అపరాధ పరిశోధన అనుబంధం—138

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అర్హతలేని అదృష్టం
రచన: వసుంధర

## టక్కరి దొంగ - చక్కని చుక్క
రచన: ప్రతాప రవిశంకర్

## ప్రేమించిన యువతి
రచన: టెంపోరావ్

## మతి తప్పిన ఆఫ్రికా ఏనుగు
రచన: కె. వి. రమణ

అగ్ని కిరీటం - పదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—138
జూన్, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# అర్హతలేని అదృష్టం

వసుంధర

ఆ యింట్లో ముగ్గురే వున్నారు. సీతారామయ్య, అతడి భార్య రుక్మిణి, కూతురు మనోరమ. తెల్లవారుఝామున నాలుగింటికి ఎవరో ఆ యింటి తలుపులు తడుతూంటే ముగ్గురికి ముగ్గురూ గాఢనిద్రలో వున్నారు. చివరకు మనోరమే లేచి కళ్ళు నులుముకుంటూ వెళ్ళి తలుపు తీసింది.

ఒక యువకుడు విసుగ్గా లోపల ప్రవేశించి—"అవతల తెల్లారిపోతూంటే ఇంకా ఇంత నిద్రేమిటి?" అన్నాడు.

"ఎవరైనా తెల్లవారుఝామునే మంచి నిద్రలో వుంటారు"—అంది మనోరమ ఇంకా కళ్ళు నులుముకుంటూనే.

"పోనీ తలుపుతట్టిన అరగంటకైనా మెలకువరాదా?" అన్నాడా యువకుడు చిరాగ్గానూ, విసుగ్గానూ.

అప్పటికి మనోరమకు కాస్త మత్తు విడినట్లుంది. అతడి వంక చూసి ఆశ్చర్యంగా—"ఎవరండీ మీరు?" అంది.

ఇప్పుడాశ్చర్యపడడం ఆ యువకుడి వంతైంది—

# 4

"నువ్వు నన్ను—ఎవరని అడుగుతున్నావా?" అన్నాడు.

"ఇందులో ఆశ్చర్యమేముంది? మీ రెవరో నాకు తెలియదు."

"నేను నీ భర్తను. ఇప్పుడైనా గుర్తొచ్చిందా?" అన్నాడతడు.

"మీ రెవర్ని మాసి ఎవరనుకుంటున్నారో—నాకింకా పెళ్ళికాలేదు...." అంది మనోరమ అతడినే పరీక్షగా గమనిస్తూ.

"ఏమయింది నీకు అనూ?" అన్నాడా యువకుడు మళ్ళీ.

"అనూ ఏమిటి—నా పేరు మనోరమ."

"కాదు—నీ పేరు అనూరాధ" అన్నాడతడు.

"అయితే నీ పేరు విశ్వంగానీ కాదుకదా!" అంది మనోరమ చటుక్కున.

"ఇంకేం—నన్ను గుర్తుపట్టావన్న మాట. కలికాలం ఇలా ఏడ్చింది—పుట్టింట్లో నాలుగురోజులుంటేసరికి తాళి కట్టిన భర్తల్నే మరిచిపోతున్నారు భార్యలు" అన్నాడు విశ్వం.

అతడి మాటలు పట్టించుకోకుండా —."అక్కేదీ?" అంది మనోరమ.

"అక్కెవరు?" అన్నాడు విశ్వం.

"మా అక్క పేరు అనూరాధ. తననుకూడా తెస్తే తప్ప నువ్వు మా బావ వనడానికి సాక్ష్యంలేదు" అంది మనోరమ.

"నాకు తెలిసిన అనూరాధవు నువ్వే!" అన్నాడు విశ్వం.

మనోరమకు సిగ్గేసినట్లుంది. ఆమె అతడిని కూర్చోమని

లోపలకు వెళ్ళి తలిదండ్రులను నిద్రలేపి విషయం చెప్పింది. వాళ్ళిద్దరూ ఒక్క ఉదుటున అతడిని చూడ్డానికి వచ్చారు. రుక్మిణి విశ్వాన్ని చూసి—"అల్లుడు బాగానే ఉన్నాడు" అని భర్త చెవిలో గుసగుస లాడింది. అది విశ్వం విన్నాడు.

విశ్వం అత్తగారికీ మామగారికీ నమస్కరించి—"నేను అనూరాధను తీసుకెళ్ళాలని వచ్చాను" అన్నాడు.

సీతారామయ్య తెల్లబోయి—"అనూరాధను తీసుకొని వెళ్ళడమేమిటి? అది నీ దగ్గరే వుందిగా" అన్నాడు.

"ఎదురుగా అనూరాధ వుంటే—నా దగ్గర ఉందంటా రేమిటి?" అన్నాడు విశ్వం ఆదోలా.

"ఇది అనూరాధ కాదు. మనోరమ. నువ్వు పొరబడ డంలో ఆశ్చర్యం లేదులే.... వాళ్ళిద్దరూ కవలపిల్లలు. ఇద్దరికీ తేడా మాకే తెలియదు" అన్నాడు సీతారామయ్య.

అప్పుడు తెల్లబోవడం విశ్వం వంతయింది.

తన ఊళ్ళో ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తూండేది అనూరాధ. ఆమెనోసారి సినిమాహాలు దగ్గర చూసి ఆకర్షితుడయ్యాడతడు. ఇద్దరూ ప్రేమించు కున్నారు. అనూరాధ తలిదండ్రులకు విశ్వం ఉత్తరం రాశాడు. అందుకు చాలా కఠినంగా బదులిచ్చాడు సీతా రామయ్య. ఆ పెళ్ళి జరిగితే కూతురిముఖం చూడ నన్నాడు. తనకు మైనారిటీ తీర్చింది కాబట్టి తలిదండ్రుల అనుమతి అవసరం లేదంది అనూరాధ. ఇద్దరూ ఆ ఊళ్ళోనే గుళ్ళో పెళ్ళి చేసుకున్నారు. విశ్వానికి తండ్రి లేదు. తల్లిమాత్రం ఆ వివాహాన్ని కామోదించింది. ఇద్దరూ కాపురం పెట్టాక సీతారామయ్య కూతురికి ఉత్తరం రాశాడు. అయిందేదో అయిపోయింది కాబట్టి జరిగిన

వన్నీ మర్చిపోవాలని ఆయన రాస్తే అనూరాధ పుట్టింటికి వెళ్ళింది.

"నేను దానికుత్తరం రాసినమాట నిజం. కానీ అందుకది బదులుగా ఏం రాసిందో నువ్వే చూడు"....అంటూ సీతారామయ్య ఓ ఉత్తరం తెచ్చి విశ్వానికందించాడు. విశ్వం అది చదువుకున్నాడు.

"పగిలిన అద్దం విరిగిన మనసు—రెండూ అతుక్కోవు. ఇక మీకూ నాకూ ఏ సంబంధమూ లేదు."

రెండే రెండు వాక్యాలున్నాయందులో.

"అయితే పుట్టింటికని బయల్దేరిన అనూరాధ ఏమైంది?" అన్నాడు విశ్వం.

అందరూ ఒకరిముఖాలొకరు చూసుకున్నారు.

# 2

విశ్వం అత్తవారింట్లో రోజంతా గడిపాడు. అనూరాధ తీసుకొని వెళ్ళడం మరిచిపోయిందని అతడు పెళ్ళిఫోటోలు కూడా తెచ్చాడు. అవి చూసి రుక్మిణి యెంతో సంబరపడి—"అచ్చం పెళ్ళి చూస్తున్నట్లే వుంది. ఇవి మాకొదిలేసి వెడతావా?" అనడిగింది.

"నాదగ్గర నెగెటివ్సున్నాయి. ప్రింటుతీసి పంపిస్తాను. కానీ అనూరాధ ఏమయిందీ అన్న విషయం ముందు తేలాలి" అన్నాడు విశ్వం.

సీతారామయ్య కాసేపాలోచించి—"అనూరాధ నీ యింట్లోనే వుంది. అది మాకు కటువుగా ఉత్తరం రాసిందనీ నీకు తెలుసు. మాతో గొడవపడ్డం నీకిష్టంలేదు. అందుకని అది పుట్టింటికని బయల్దేరినట్లు మాకు అబద్ధం చెబుతున్నావు. నువ్వు మాకు పెళ్ళిఫోటోలు చూపించాలని వచ్చావు. అవునా?" అన్నాడు.

"మీరేమంటున్నారో నా కర్థం కావడంలేదు—" అన్నాడు విశ్వం.

"నేనేమన్నప్పటికీ అనూరాధ క్షేమం కాంక్షించే వాడ్ని. అది మామీద ద్వేషంతో వున్నా నాకు బాధ లేదు. ఎక్కడో అక్కడ క్షేమంగా వుంటే చాలు. అందుకని నువ్విలాంటి అబద్ధాలు చెప్పకు. అందువల్ల మా మనసు క్షోభపడడడం మినహాగా మరేమీ ప్రయోజన ముండదు" అన్నాడు సీతారామయ్య.

"అనూరాధ ఇక్కడికే వచ్చిందని నా నమ్మకం."

"వస్తే ఎక్కడుందంటావ్?"

"తను నాకు మనోరమ అనే పేరుగల చెల్లెలుందని నాకు చెప్పలేదు."

"పోనీ—తన చెల్లెలు పేరేమిటని చెప్పింది?"

"అసలు తనకు చెల్లెలున్నట్లే చెప్పలేదు."

"అయితే ఏమంటావ్?"

"మీరు మనోరమ అంటున్నమ్మాయి అచ్చం నాభార్య అనూరాధలాగే వుంది....అమే...."

సీతారామయ్య కళ్ళెర్రబడ్డాయి—"ఏం-కవల పిల్లలు కదా అని అక్కాచెల్లెళ్ళిద్దరితోనూ కాపురం చేద్దామను కొంటున్నావా—ఇలాంటి వేషాలు నా దగ్గర కుదరవు.." అన్నాడు తీవ్రంగా.

సీతారామయ్య స్వరం మారగానే విశ్వం తడబడ్డాడు- "అబ్బే—నా ఉద్దేశ్యమదికాదు...." అన్నాడు.

"నీ ఉద్దేశ్యమేమైనా—నా రెండో కూతురి జోలికి రాకు. దానికి సంబంధంకూడా నిశ్చయమైంది. కుర్రాడు బుద్ధిమంతుడు. మంచి ఉద్యోగంలో వున్నాడు. పెద్దమ్మాయి చేసిన పనికి—దీనికి పెళ్ళి సంబంధం కుదిర్చే

దెలాగా అని బెంగ పెట్టుకున్నాను. కానీ అదృష్టవశాత్తూ ఇదెలాగో కుదిరింది. దయుంచి ఈ సంబంధం చెడ గొట్టకు...." అన్నాడు సీతారామయ్య.

"అయితే అనూరాధ ఏమైందంటారు?" అన్నాడు విశ్వం.

సీతారామయ్య భ్రుకుటి ముడతలు పడింది—"కొంప దీసి అనూరాధను నువ్వు కానీ ఏమీ చేయలేదు కదా!" అన్నాడు.

"అంటే?"

"అనూరాధ యేమైందని అమాయకంగా నువ్వు నన్న డుగుతున్నావు. దాన్నేం చేశావని నేను నిలదీస్తున్నాను. జవాబు చెప్పు...."

విశ్వం తెల్లబోయి—"అనూరాధ పుట్టింటికనే బయ ల్దేరింది. నాకా విషయం ఖచ్చితంగా తెలుసు. మొత్తం వ్యవహారమంతా ఏదో తిరకాసుగా వుంది. అయితే నిజం నేను తెలుసుకోలేకపోను...." అన్నాడు.

"నిజమేదైనా ఒక వారం రోజుల్లో నేను మీ ఇంటికి వస్తాను. నా కూతురక్కడ కనపడకపోయిందా- నిజం తేల్చడానికి పోలీసులే రంగంలోకి దిగుతారు...."

పోలీసుల పేరు వినగానే విశ్వం తడబడ్డాడు.

# 3

సత్యనారాయణ విశ్వానికి నమస్కరించి-"మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకెంతో సంతోషంగా వుంది—" అన్నాడు.

"మనం కలుసుకుని మాట్లాడుకోవడం — ఇద్దరికీ అవసరం కూడా—" అన్నాడు విశ్వం.

"మీరేదో చెప్పాలని వచ్చినట్లున్నారు.." అన్నాడు

సత్యనారాయణ.

"అవును—ముందీ ఫోటోలు చూడండి...." విశ్వం జేబులోంచి ఓ కవరు తీసిచ్చాడు.

సత్యనారాయణ కవర్లోని ఫోటోలన్నీ చూసి—"ఇవి మీ పెళ్ళిఫోటోలనుకుంటాను...." అన్నాడు.

"అవును. మీ పెళ్ళి జరిగితే ఈ ఫోటోలకూ మీ పెళ్ళి ఫోటోలకూ ఒక్కటే తేడా వుంటుంది. నా స్థానంలో మీరుంటారు...."

"అంటే?"

"రెండో పెళ్ళి ఫోటోల్లోనూ పెళ్ళికూతురు మారదు."

సత్యనారాయణ నవ్వి—"అవును—వాళ్ళు కవలలు కదా!" అన్నాడు.

"మీ రెప్పుడైనా ఆ కవలలిద్దర్నీ కలిపి చూశారా?"

"ఎందుకని మీరిలా అడుగుతున్నారు....?"

"నా అనుమానం——...." అని ఏదో చెప్పబోయి ఆగిపోయాడు విశ్వం. వాక్యం పూర్తిచేయకపోయినా తన భావం అర్థం చేసుకుని వుండవచ్చునన్న భావంతో అతడు సత్యనారాయణ వంక చూశాడు.

"మీ అనుమాన మేమిటో నాకర్థం కాలేదు—" అన్నాడు సత్యనారాయణ.

"సీతారామయ్యగారికొకే అమ్మాయని...."

"అంటే?"

"అనూరాధ, మనోరమ—ఇద్దరూ ఒకరేనని...."

"అలా ఎందుకు తలిదండ్రులు అబద్ధం చెబుతారు?"

మళ్ళీ యేదో చెప్పబోయి ఆగిపోయాడు విశ్వం—"అబద్ధాలు చెప్పడానికవరి కారణాలు వాళ్ళకుంటాయి. అవన్నీ మీకు తర్వాత వివరిస్తాను. ముందు నా ప్రశ్నకు

జవాబు చెప్పండి. మీ రెప్పుడైనా ఇద్దర్నీ కలిసి చూశారా?"

"లేదు—" అన్నాడు సత్యనారాయణ.

"అసలు తమకిద్దరు కవల పిల్లలున్నారని సీతారామయ్యగారు మీకెప్పుడు చెప్పారు?" అన్నాడు విశ్వం.

"రెండురోజుల క్రితం."

"ఎందుకు చెప్పారు?"

సత్యనారాయణ గుర్తుచేసుకుందుకు ప్రయత్నిస్తున్న వాడిలా కళ్ళు మూసుకున్నాడు.

"రెండేళ్ళ క్రితం ఉద్యోగరీత్యా నేనీ ఊరొచ్చాను. అద్దె ఇల్లుకోసం వెతుకుతూ నేను వాళ్ళింటికి వెళ్ళాను. ఇంట్లో మనోరమ వుంది. అద్దె యిల్లు దొరకలేదు కానీ— నేనామెను ప్రేమించాను. వీలున్నప్పుడల్లా ఆమెను బయట కలుసుకుని పరిచయం పెంచుకుందుకు ప్రయత్నించాను. ఆమె నేనంటే ఎక్కువ ఇష్టపడలేదు. అలా ఆర్నెల్లు జరిగాక ఆమె ఊళ్ళో లేదు. వాకబు చేయగా యెక్కడో బంధువులింటికి వెళ్ళిందని తెలిసింది. ఆ తర్వాత మధ్య మధ్య యెప్పుడైనా కనిపిస్తూండేది. అంటే ఊర్నించి వచ్చినప్పుడు., నేనోసారి సీతారామయ్య గారిని కలుసుకుని నా అభిప్రాయంకూడా చెప్పాను. ఆయనంతా విని—అంతా అమ్మాయిష్టం—అన్నారు. మనోరమ ఇష్టపడితే తనే స్వయంగా నా యింటికి వస్తానన్నారు. రెండ్రోజుల క్రితమే మా ఇంటికాయన వచ్చి విషయాలు చాలా చెప్పారు. పెద్దమ్మాయి ప్రేమ వివాహం చేసుకుని తమతో తెగతెంపులు చేసుకుందని చెప్పి శ్రీకార్డుకూడా చూపించారు. పెళ్ళి విషయం

ఆడపిల్లలకు వదలడం చాలా తెలివితక్కువ పని అనీ— అలాంటి పొరపాటు మళ్ళీ చేయననీ అన్నారు. ఆయన మనోరమకూ నాకూ పెళ్ళి చేయాలనుకుంటున్నట్లు చెప్పారు. మనోరమ చేస్తున్న ఉద్యోగం మానిపించి ఇంటికి రప్పించామని చెప్పారు. ఇదీ నా కథ...." అన్నాడు సత్యనారాయణ.

"మీ కథ నా అనుమానాన్ని పెంచుతోంది. ఇందులో ఏదో తిరకాసుంది. మనోరమ పేరు—మీకు మొదటిసారి తెలిసినప్పట్నించీ అదేనా?" అన్నాడు విశ్వం.

"ఆమె పేరు నాకు తెలిసినప్పట్నించీ అదే....—"

విశ్వం నిట్టూర్చి—"ఏమిటో-అంతా అయోమయంగా వుంది. మీరు పెళ్ళి చేసుకోబోతున్న మనోరమ నాతో కాపురంచేసిన అనూరాధేనని నా అనుమానం. మీరు సహకరిస్తే ఈ విషయం తేల్చెయొచ్చు. అది మీక్కూడా మంచిది...." అన్నాడు.

"ఎలా తేల్చడమో మీరే చెప్పండి. నాకు వీలుంటే సహకరిస్తాను...."

"ఆమె శరీరంమీద కొన్ని గుర్తులు చెప్పగలను...." అంటూ విశ్వం అతడికి మొత్తం నాలుగు గుర్తులు చెప్పాడు.

అది వింటూనే సత్యనారాయణ చెవులు మూసుకుని- "పరాయి ఆడపిల్ల దగ్గర—ఇలాంటి గుర్తులు నేనెలా కనుక్కోగలను?" అన్నాడు.

"మనోరమ మీకు పరాయిదికాదు. కాబోయే భార్య!"

సత్యనారాయణ క్షణం ఆలోచించి — "మీరు చెప్పిందీ రైటే! అయితే ఈ విషయంలో నేను మీకు తప్పక సహకరించగలను...." అన్నాడు.

"థాంక్స్—మనం మళ్ళీ యెప్పుడు కలుసుకుందాం?"

"ఏమో-పెళ్ళికి ముహూర్తాలెప్పుడున్నాయో నాకెలా తెలుసుంది?"

"పెళ్ళి ముహూర్తా లేమిటి?"

"నాకూ మనోరమకూ పెళ్ళయ్యాకనే కదా—మీకీ విషయం చెప్పగల్గుతాను...."

విశ్వం విసుగ్గా—"పెళ్ళయ్యాక—ఆమె మనోరమ కాదు—అనూరాధ—అని తెలుసుకుని ఏం చేస్తారు?" అన్నాడు.

"ఏం చేయాలో నాకూ తెలియదు. అసలు తెలుసుకోవాలన్నా కుతూహలం కూడా నాకు లేదు. కానీ మీరడిగారు కదా...."

విశ్వం ముఖంలో అసహనం కనబడింది — "అంటే ఆమె అనూరాధ అనీ — నాతో కాపురం చేసిందనీ తెలిసినాకూడా మీరామెతో కాపురం చేయగలరన్న మాట!"

"మీరు చెప్పిన గుర్తులామె కంటిమీదున్నంత మాత్రాన—ఆమె అనూరాధ అయిపోదుగదా! నాతో కలిసి జీవించాలని వచ్చిన ఆమె మాటలే నేను నమ్ముతాను. నాకు ప్రయోజనం లేనప్పుడు—నిజాల గురించి కూడా పట్టించుకోను...." అన్నాడు సత్యనారాయణ.

"అలా పట్టించుకోకపోవడంవల్ల—మీకూడా నా కతే పట్టవచ్చు...."

"మిస్టర్ విశ్వం! నా భార్య అలా చేస్తే ఆ తప్పు నాదే అవుతుంది. ఎందుకంటే—హిందూ స్త్రీ తనంతటతనే తన కాపురంలో నిప్పులు పోసుకోవాలనుకోదు. ఆమె అలా చేసిందంటే అందులో భర్త బాధ్యత చాలా

వుంటుంది...." అన్నాడు సత్యనారాయణ.

విశ్వం చటుక్కున లేచి నిలబడి—"మీకు సాయ పడాలనుకోవడం నా తెలివితక్కువ. అయితే మీ పెళ్ళి ముహూర్తం వదిరేలోగా అనూరాధను బయటకు లాగ లేనంతటి తెలివితక్కువవాణ్ని మాత్రం కాను...." అన్నాడు.

## 4

అది సుందరేశన్ కంపెనీ. బిజినెస్ కన్సల్టెన్సీ వాళ్ళు చేస్తున్న వ్యాపారం. ఏయే ప్రాంతాల ఏయే వస్తువులకు గిరాకీ ఉన్నదీ—ఒకే వస్తువుకు వివిధ కంపెనీలు నిర్ణ యించిన వివిధ ధరలు-షేర్ మార్కెట్ తీరుతెన్నులు-ఇలా ఒకటేమిటి-వ్యాపారానికి సంబంధించిన యెన్నో వ్యవహారాల్లో అక్కడ సమాచారం, సలహా, సంప్ర దింపులు లభిస్తూంటాయి.

అక్కడి ఆఫీసులో మొత్తం నలభై మంది ఉద్యోగు లున్నారు. నాలుగు సెక్షన్లున్నాయి.

విశ్వం ఆ ఆఫీసులో అడుగుపెట్టి రిసెప్షనిస్టును కలుసు కున్నాడు. ఆమె ఇరవై ఏళ్ళ అందమైన యువతి. మామూలుగానే నవ్వుతున్నట్లుండే ముఖం. చిరునవ్వు నవ్వినప్పుడు చూడగానే—ఆ చిరునవ్వుకోసం మళ్ళీ మళ్ళీ ఆ ఆఫీసుకు రావాలనిపిస్తుంది.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ-...." అందామె.

"ఇక్కడ పనిచేస్తున్న అనూరాధ అనే అమ్మాయి గురించి తెలుసుకుందుకు వచ్చాను...." అన్నాడు విశ్వం.

"మీరు లోపలకు వెళ్ళి శ్రీమన్నారాయణగారిని కలుసుకోండి...." అందా అమ్మాయి వెంటనే.

విశ్వం లోపలకు వెళ్ళాడు. శ్రీమన్నారాయణ

గురించి తనకు కనబడిన ప్ల్యాన్ ని అడిగాడు.

శ్రీమన్నారాయణ ఓ సెక్షన్ కి హెడ్. ప్ల్యాన్ విశ్వాన్ని శ్రీమన్నారాయణ దగ్గరకు తీసుకొని వెళ్లాడు.

శ్రీమన్నారాయణ ఫుల్ సూటులో వున్నాడు. గది పూర్తిగా ఎయిర్ కండిషను. విశ్వం అక్కడి యేర్పాట్లు చూసి—"అనూరాధ గొప్ప కంపెనీలోనే పని చేసే దన్నమాట...." అనుకున్నాడు.

అంతకుముందు అతడెన్నడూ ఆ కంపెనీ ఆఫీసులో అడుగుపెట్టలేదు. అనూరాధ అందుకతడిని ప్రోత్సహించనూ లేదు.

"మీ కంపెనీలో పనిచేసే మిస్ అనూరాధ గురించి తెలుసుకోవాలని వచ్చాను..." అన్నాడు విశ్వం.

"ఏం తెలుసుకోవాలి?"

"ఆమె విద్యాభ్యాసం యెక్కడ జరిగిందోనని.... మీ దగ్గర సర్టిఫికెట్సుంటాయి గదా...."

"మీరు పోలీసులా?" అన్నాడు శ్రీమన్నారాయణ.

"అలాగే అనుకోవచ్చు...."

"మీకు సహకరించాల్సిన బాధ్యత నాకుంది—కానీ మీ కాబట్టే సహకరించలేనని నా భయం...." అన్నాడు శ్రీమన్నారాయణ.

అనూరాధ సుమారు ఏణర్ధం అక్కడ పనిచేసింది. పదిరోజుల క్రితమే ఆమె ఉద్యోగానికి రాజీనామా చేసింది. ఇకపోతే ఆమె అక్కడ చేసే ఉద్యోగానికి యే సర్టిఫికెట్లూ అవసరం లేదు.

"ఎందుకంటే ఒకోసారి యే సర్టిఫికెట్సూ లేనివారు ఉన్న వారికంటే బాగా పనిచేయగల్గుతారు. సర్టిఫికెట్సుకు ప్రాముఖ్యతనిస్తే—అలాంటి వారిని సెలక్ట

చేయడానికిబ్బంది. అందుకని మేమూ ఇక్కడకు వచ్చిన వారిని పరీక్షిస్తాము. పనికొస్తారనుకున్న వారికి మేమే శిక్షణకూడా యిచ్చుకుంటాము...." అన్నాడు శ్రీమన్నారాయణ.

"అంటే మీవద్ద అనూరాధ అనే పేరుతో పని చేస్తున్న అమ్మాయి పేరు మనోరమ అయ్యే అవకాశం కూడా వుందన్నమాటే!" అన్నాడు విశ్వం.

శ్రీమన్నారాయణ కరంగా లేదు. విశ్వం వివరించాడు-
"సర్టిఫికెట్లడగరు మీరు. అంటే ఆమె తనే పేరు చెబితే అదే నమ్ముతారు. సర్టిఫికెట్లలో తన పేరు మనోరమ అనే వున్నా—ఆమె మీకు అనూరాధ అని తన పేరు చెబితే మీరదే ఆమె పేరనుకుంటాను...."

"కావచ్చు...."

అనూరాధ గురించి ఇంకేమైనా చెప్పగలరా?"

"చాలా మంచి వర్కర్. వెరీ సిన్సియర్. మా కంపెనీకి ఆమె లేకపోవడం ఒక తీరని నష్టం...." అన్నాడు శ్రీమన్నారాయణ.

"అనూరాధ గురించి ఆఫీసులో ఇంకా చెప్పగల వారెవరైనా ఉంటారా?"

శ్రీమన్నారాయణ మందహాసం చేసి—"మేము చేస్తున్నది వ్యాపారం. ఇది గవర్నమెంటాఫీసు కాదు. అందుకే ఇక్కడ నియమమేమిటంటే—ఈ కంపెనీలో పనిచేస్తున్న వారంతా యెవరికివారే యమునాతీరే అన్నట్లుండాలి. ఒకరితో ఒకరు మాట్లాడకూడదు. ఆఫీసు బయటకూడా ఎవరూ ఎవరితోనూ స్నేహ సంబంధాలు పెంచుకోకూడదు. అటువంటిదేమైనా మా దృష్టికివస్తే- ఆ ఉద్యోగులు హెచ్చరింపబడతారు. అందువల్ల అనూ

రాధతో ఇక్కడింకెవరికైనా పరిచయమున్నప్పటికీ— వారా విషయం మీకు చెప్పరు. మేమే కూపీలాగడాని కెవరినో నియమించామనుకుని భయపడతారు" అన్నాడు.

"చాలా తమాషాగా వుంది...." అన్నాడు విశ్వం.

"వ్యక్తిగత జీవితానికీ ఆఫీసుకూ యేమీ సంబంధ ముండకూడదు. అంటే ఇళ్ళలో యేదైనా శుభం జరిగితే స్వీట్సు పంచిపెట్టడంకూడా మేము ప్రోత్సహించము."

"ఇలాగైతే ఇక్కడెవరూ యెక్కువకాలం పని చేయరు...."

శ్రీమన్నారాయణ నవ్వి — "మేమిచ్చే జీతాలు ఎక్కువ. అందుకని ఎవరూ ఇక్కణ్నించి వెళ్ళిపోవాలను కోరు. అయినా ఆఫీసుకు వచ్చేది నియమిత కాలంలో అప్పగించబడిన పని చేయడానికి తప్పితే ఊసుపోక కబుర్లకూ వాటికీ కాదు కదా! మా ఆఫీసులో యెవ రెప్పుడు ఉద్యోగం మానేసినా బాధలేదు. మా దగ్గర అన్ని రకాల ఉద్యోగాలకీ — వెయిటింగు లిస్టులో రకానికో వందమంది చొప్పున వున్నారు...." అన్నాడు.

విశ్వం లేచి—"థాంక్స్!" అన్నాడు.

# 5

విశ్వం దిగులుగా ఇంట్లో కూర్చున్నాడు. తల్లి నర్సమ్మ అక్కడకొచ్చి—"ఏరా—కోడలుపిల్ల కబురు తెలిసే అవకాశం లేదా?" అంది.

"నీ కోడలుపిల్ల మళ్ళీ పెళ్ళి చేసుకుంటోంది...." అన్నాడు విశ్వం.

"అది చేసుకుంటానంటే మాత్రం చేసుకుందుకెవరైనా సిద్ధంగా వుండాలి కదా!"

"వున్నాడమ్మా—ఇప్పుడు దాని పేరు అనూరాధ

కాదు—మనోరమ!"

"ఏమిటీ—అది పేర్లుకూడా మారుస్తోందా—అమాయ కంగా కనపడేది—దానికన్ని తెలివితేటలొచ్చాయా?" అంది నర్సమ్మ.

"ఇప్పుడూ అమాయకంగానే కనబడుతోందమ్మా.." అన్నాడు విశ్వం. అతడు తల్లికి నెమ్మదిగా అంతకు రెండు రోజులముందు సీతారామయ్య ఇంట్లో తనకు జరిగిన అనుభవమూ, సత్యనారాయణ గురించీ చెప్పాడు.

నర్సమ్మ ముక్కుమీద వేలేసుకని—"ఇక్కడ నిన్ను పెళ్ళి చేసుకుని మళ్ళీ అక్కడింకో పెళ్ళికి తయారవు తోందా—చాలా విడ్డూరంగా ఉందే!" అంది.

"ఇప్పుడు నేనేం చేయాలో చెప్పమ్మా!" అన్నాడు విశ్వం దీనంగా.

"నువ్వు చవట దద్దమ్మలా ఊరుకున్నా నేనూరుకోను. ఇప్పుడే ప్రయాణమై వెళ్ళి—ఇంటిల్లపాదినీ నిలదీసి జుట్టుపట్టి మరీ దాన్ని కాపురానికి తీసుకొస్తాను—" అంది నర్సమ్మ కోపంగా.

"మనం వాళ్ళనేం నిలదీస్తామమ్మా—వాళ్ళే మనల్ని నిలదీసేలాగున్నారు. పదిరోజుల్లో మనం అనూరాధ అయాకీ చెప్పకపోతే వాళ్ళు పోలీసుకంప్లయింట్ కూడా యిస్తామని బెదిరించారు...."

పోలీస్ కంప్లయింట్ పేరు వినగానే నర్సమ్మ కూడా కంగారు పడింది.

"అయితే దాని ఆఫీసుకు వెళ్ళి కనుక్కో లేకపోయావా" ఈ పేర్ల తిరకాసేమిటో తెలిసేది...." అంది నర్సమ్మ.

"నీకు చెప్పకుండా ఈ రెండ్రోజులూ నేను చేసిం

దదే! ఏమీ ప్రయోజనం లేదు. అది మనకంటే తెలి వైనది. దెబ్బతినేశాం...." అన్నాడు విశ్వం.

"అయితే రంగా యేమంటాడో ఇప్పుడు...." అంది నర్సమ్మ సాలోచనగా.

"ఏమన్నప్పటికీ రంగాను పిలిచి మాట్లాడ్డం మంచి దేమో...." అన్నాడు విశ్వం.

"మనని బాగా తిడతాడు-" అంది నర్సమ్మ.

"తిట్టినా తప్పదు..." అన్నాడు విశ్వం.

## 6

పడక కుర్చీలో వెనక్కి వాలి పడుకుని కళ్ళు రెండూ మూసుకుని-"అంటే-నీ పెళ్లాం పారిపోయిందన్నమాట" అన్నాడు రంగా.

"ఊఁ" అన్నాడు విశ్వం.

"పట్టుమని పదిరోజులైనా కాపురం చేయలేదు-" అంది నర్సమ్మ.

"ఎందుకు పారిపోయింది?" అన్నాడు రంగా.

"తెలియదు..."

"చూడు విశ్వం. ఆపిల్ల నిన్ను ప్రేమించింది. తల్లి దండ్రులెన్నెదిరించి మరీ నిన్ను పెళ్ళి చేసుకుంది. నువ్వే ప్రపంచమనుకుని నీతోనే వుండిపోవాలనుకుంది. అలాంటి పిల్ల ఉన్నట్లుండి ఎందుకు పారిపోతుంది?" అన్నాడు రంగా.

"అదే నాకూ అర్థం కావడంలేదు. అసలు తనిలా పారిపోవచ్చు ననిపించేలా కూడా నా వద్ద ప్రవర్తించ లేదు. పైగా తను పేరు మార్చుకుంది...తన పేరిప్పుడు మనోరమ అంటోంది..."

"నా అభిప్రాయంలో అనూరాధ వేరు. మనోరమ

వేరు. ఎందుకంటే హిందూ స్త్రీ—భర్తనంత సులభంగా విడిచిపెట్టదు. విడిచిపెట్టిన హిందూ స్త్రీకి అంత సులభంగా వివాహం కాదు. ఈ రెండూ జరుగుతున్నాయంటే ఆమె తప్పకుండా వేరే యువతి అయుండాలని నేను నమ్ముతున్నాను...."

"అయితే అనూరాధ ఏమయుంటుంది?"

"అదే నేను నిన్నడగుతున్నాను...."

"అంటే?" కంగారుగా అన్నాడు విశ్వం.

"నీకు నీ భార్యంటే ప్రేమ ఏర్పడింది. ఆమెనెక్కడో దాచావు...."

"దాచడమెందుకు?"

"ఎందుకో నువ్వే ఆలోచించు..." అన్నాడు రంగా.

విశ్వం కాసేపు మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా "రంగా—నువ్వు నన్ను నమ్మ. నా భార్యను వెతికే మార్గం చెప్పు...." అన్నాడు.

"మెలకువగా వున్న వాళ్ళను నిద్ర లేపడమెంత కష్టమో — తప్పిపోయిన వాళ్ళను వెతకడమూ అంత కష్టం. నువ్వు నన్ను మోసం చేస్తున్నావు. అసలేం జరిగిందో చెప్పు...."

"నేను నీకు నిజమే చెప్పాను...."

"అయితే నేను చెప్పినట్లు చేస్తావా?"

"చేస్తాను...."

"మాట తప్పకూడదు...."

"తప్పను...."

"ఇంతకీ మావాడినేం చేయమంటావ్ బాబూ!" అంది నర్సమ్మ.

"మళ్ళీ పెళ్ళి చేసుకోమంటాను...."

"మళ్ళీ పెళ్ళా?" విశ్వం గుటకలు మింగాడు.

"ఏం- సంతోషించడానికి బదులు భయపడతావేం?"

"రెండోసారి పెళ్ళిచేసుకోవడం నేరం కదూ!"

"నీకు ముందటిసారి పెళ్ళి జరిగితే కదా—రెండో పెళ్ళి చేసుకునేందుకు...." అన్నాడు రంగా.

"అంటే?"

"ముందు మీరిక్కడ్నించి మకాం మార్చేస్తారు. నీకు పెళ్ళైనట్లు సాక్ష్యాలేమున్నాయి...."

"పెళ్ళి ఫోటోలు...."

"అవి మన దగ్గరే వున్నాయి కదురా—" అంది నరసమ్మ.

"అవును—ఆ తర్వాతింట్లో అడిగితే-నెగెటివ్సున్నాయి- ప్రింటు చేయించి పంపిస్తానని చెప్పాను తప్పితే వాళ్ళ కివ్వలేదు—" అన్నాడు విశ్వం.

"అయితే చాలా మంచి పని చేశావు. ఆ ఫోటోలూ నెగెటివ్సూ ఇలా తీసుకురా. ఇప్పుడే ఇక్కడే తగలెట్టేద్దాం...." అన్నాడు రంగా.

"అవి మన దగ్గరే ఉంటే నష్టమేమిటి?" అన్నాడు విశ్వం.

"భలేవాడివే.... రేపే కారణం చేతయినా పోలీసులీ యిల్లు సెర్చిచేస్తే—ఆ ఫోటోలు దొరక్కూడదు. అసలు- అనూరాధనే పేరుగల యువతి ఈ యింట్లో యొన్నడూ అడుగుపెట్టలేదు. నీ పెళ్ళి రహస్యంగా జరిగింది. ఆ పెళ్ళికి సాక్షిని నేనే! అనూరాధనీ యింట్లో కొద్ది రోజు లెవరైనా చూసి వుండవచ్చు. కానీ ఆమె నీ భార్యగా ఇక్కడెవ్వరికీ పరిచయం చేయబడలేదు. ఎవరో అమ్మాయి చుట్టపు చూపుగా వచ్చి ఉందని అంతా అనుకుని

ఉంటారు. అదీకాక మీరిక్కడ్నించి మళా మెలాగూ మార్చేస్తున్నారు...."

విశ్వం లోపలకు వెళ్ళి తిరిగివచ్చాడు. అతడి చేతుల్లో ఓ కవరుంది—...."ఇవీ ఫోటోలు...."

రంగా అందుకుని—ఫోటోలను చూసి — "గుడ్!" అన్నాడు. అతడు కుడిచేత్తో వాటిని పట్టుకొని ఎడంచేత్తో సిగరెట్ లైటర్ వెలిగించి—ఆ ఫోటోలను అంటించాడు. గుప్పున మండాయవి. వాటిని నేలమీదకు జారవిడుస్తూ— "నెగెటివ్స్ కూడా యివ్వు!" అన్నాడు.

విశ్వం తల వంచుకుని-"నెగెటివ్స్ కనిపించడంలేదు" అన్నాడు.

"వాట్!" అన్నాడు రంగా.

"నేను ఫోటోల నొకచోటా నెగెటివ్స్నొకచోటా భద్రంగా దాచాను. ఇప్పుడు నెగెటివ్స్ కనిపించడం లేదు...."

"నువ్వు నిజమే చెబుతున్నావా?"

"ఊఁ."

"నెగెటివ్స్ ఎప్పట్నించి కనబడ్డం లేదు....?" అన్నాడు రంగా.

"నెగెటివ్స్ వేరే పెట్టానని చెప్పానుకదా—ఫోటోలు వచ్చేక ఫోటోలనే. మళ్ళీ వాటికోసం చూడలేదు. ఇదే చూడ్డం...."

"అంటే ఒకవేళ నీ భార్య తను వెళ్ళిపోతూ వాటిని తీసుకునిపోయే అవకాశముందా?" అన్నాడు రంగా.

విశ్వం ఉలిక్కిపడి—"ఇది నాకు తట్టనేలేదు. అలాగే జరిగుండవచ్చు—" అన్నాడు.

"అలాగే ఎందుకు జరుగుతుంది?" అన్నాడు రంగా.

విశ్వం మాట్లాడలేదు.

"విశ్వం—నువ్వు నన్ను మోసమైనా చేస్తూండాలి. లేదా నీవల్ల పెద్ద పొరపాటైనా జరిగుండాలి. నీ భార్య ఇక్కణ్ణించి వెళ్ళిపోతూ కూడా నాగటివ్వు తీసుకుని వెళ్ళాలని ఎందుకనుకుంది? అసలు తనిక్కణ్ణించి వెళ్ళి పోవాలన్న ఆలోచనకెందుకొచ్చింది?"

"నువ్వు నన్నీ ప్రశ్న లెందు కడుగుతున్నావు?"

"నీ భార్యకు నీ గురించి తెలిసిపోయిందా?"

"ఆ అవకాశం లేదు. అబ్బాయి తన జాగ్రత్తలో తనున్నాడు—" అంది నర్సమ్మ తను కొడుకు తరఫున మాట్లాడుతూ.

"అబ్బాయి తన జాగ్రత్తలో తనుండడం సహజం. ఎందుకంటే రహస్యం అబ్బాయికి తెలుసు కాబట్టి. కానీ అమ్మాయికూడా తన జాగ్రత్తలో తనుందని నాకిప్పుడని పిస్తోంది. అలా ఎందుకు జరిగిందీ అని ఆలోచిస్తున్నాను."

విశ్వం చటుక్కున—"రంగా—నువ్వు చెప్పింది నిజం. ఆమె తన జాగ్రత్తలో తనుందని నాకిప్పుడర్థమవుతోంది" అన్నాడు.

"అంటే?"

"మాకిద్దరికీ వివాహమైనా మేము భార్యాభర్తల్లా కలిసి జీవించలేదు. తనకు ఆరోగ్యం సరిగా లేదని చెప్పింది. డాక్టరు వద్దకుకూడా తీసుకొని వెళ్ళాను. ఆమె అనూరాధను పరీక్షించి నెలరోజులపాటు సంసార జీవితానికి దూరంగా వుండాలని చెప్పింది...."

రంగా తెల్లబోయి—"విశ్వం—నువ్వు తెలివితక్కువ వాడివని తెలుసు. కానీ మరీ యింత ఫూల్ వనుకోలేదు-" అన్నాడు.

"నా పరిస్థితుల్లో యెవరైనా అలాగే అనుకుంటారు. ఆమె యెంతో అమాయకంగా మాట్లాడింది. నావంక జాలిగా చూసేది. నామీద జాలిపడేది...." విశ్వం స్వరం తగ్గించి—"రంగా — ఇంతకంటే ఏం చెప్పను? ఆమె నామీద జాలితో నన్ను తన నగ్న శరీరాన్ని రెండుమూడుసార్లు చూడనిచ్చింది-" అని రంగాకు మాత్రమే వినపడేలా చెప్పాడు.

"అనూరాధను పరీక్షించిన ఆ లేడీ డాక్టరు ఎవరు?"

"డాక్టర్ ప్రభాదేవి."

"ఆమె బాగా పేరున్న డాక్టరు...." అన్నాడు రంగా-"అంటే నీ భార్య చాలా చాలా తెలివైనదయుండాలి. అంత అందమైన ఆడదానికన్ని తెలివితేటలున్నాయంటే నమ్మశక్యం కాకుండా వుంది."

"ఇప్పుడేం చేయాలి?"

"నీ భార్యకన్ని తెలివితేటలుండడానికి వీల్లేదు. ఎవరో తెలివైన వాళ్ళామెకు సాయపడ్డారు. యెవరు వాళ్ళు?"

"రంగా-నువ్వు చెప్పేవన్నీ వింటూంటే నాకు భయం వేస్తోంది...." అన్నాడు విశ్వం.

రంగా అతడి వంక అనుమానంగా చూస్తూ-"తప్పు చేసినవారే భయపడతారు.." అన్నాడు.

"అంటే?"

"నీ భార్యకు సాయపడగల తెలివైన వాడివి నువ్వేనని నా అనుమానం.." అన్నాడు రంగా.

"ఇది చాలా అన్యాయం. నేను తెలివితక్కువవాడినని ఇందాకా నువ్వే అన్నావు!"

"తెలివితక్కువ వాడినని భ్రమింపజేయడం కూడా

ఒకవిధమైన తెలివే!" అన్నాడు రంగా.

"ప్లీజ్ రంగా! నన్ను నమ్ము. నువ్వేం చెబితే అది చేస్తాను."

రంగా సాలోచనగా-"వ్యవహారం చాలా తిరకాసుగా వుంది. మనం వేయబోయే ప్రతి అడుగూ జాగ్రత్తగా వేయాలి. ఏది యేమైనా నువ్వు పెళ్ళికి సిద్ధపడాలి..." అన్నాడు.

"నువ్వేం చెబితే దానికి నేను సిద్ధం. కానీ ఇందులో యెలాంటి ప్రమాదమెదురైనా నువ్వే నన్ను రక్షించాలి" అన్నాడు విశ్వం.

"నన్ను నమ్మిన వాళ్ళను నేను రక్షించగలను.." అన్నాడు రంగా. తర్వాత అతడు విశ్వానికి పరిస్థితి వివరించి చెప్పాడు.

అనూరాధకు విశ్వం గురించిన రహస్యం విశ్వంద్వారా తెలియడానికి లేదు. ఆ రహస్యమామెకు ఎలాగో తెలిసి తెలివిగా అతడినుంచి తప్పించుకుంది. అసలు పెళ్ళిచేసుకోకముందే ఆమెకీ విషయం తెలిసుండాలి. జరుగనున్న పెళ్ళిని ఓ నాటకంలా భావించి ఆమె అందుకు సిద్ధపడింది. తర్వాత ఒకరోజున పుట్టింటి వంకపెట్టి పారిపోయింది. ఆమె యెందుకలా చేసిందో ప్రస్తుతానికి తెగే విషయం కాదు. కానీ ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. ఆమె చాలా తెలివైనది. తనను మోసంచేయాలనుకుంటున్న వ్యక్తిని, తెలిసికూడా పెళ్ళిచేసుకుంది. పెళ్ళయ్యాకకూడా అతడి మోసం తనకెక్కడా తెలియదన్న భ్రమ నతడికి కలిగించింది. పెళ్ళి ఫోటోల నెగటివ్సుతోసహా పారిపోయింది.

ఇప్పుడామె ఏదైనా సాధించాలనుకుంటోందా?

"అనూరాధ తన్ను తాను రక్షించుకునేందుకిలా చేసి వుంటే ఆమెతో మనకి సంబంధంలేదు. అలాకాక మన కోలికి వచ్చిందా.." అని రంగా ఒక్క క్షణం ఆగి-"నే నేమంటానో అని కుతూహలపడుతున్నావు కదూ! అదిప్పుడు చెప్పను-" అన్నాడు.

## 7

విశ్వం, నర్సమ్మ బస్సు దిగారు. బస్ స్టాండులో రిక్షా వాళ్ళు వాళ్ల చుట్టూ మూగారు. విశ్వం తామెక్కడికి వెళ్లాలో చెప్పాడు. నర్సమ్మ రిక్షా బేరమాడింది.

ఇద్దరూ రిక్షా ఎక్కారు. రిక్షా శరవేగంతో దూసుకుని పోయి ఓ ఇంటిముందాగింది.

అక్కడ ఇంట్లో చాలా హడావుడిగా వుంది. ఎవరో ఓ చిన్న కుర్రాడొచ్చి — "పెళ్లివారొచ్చేశారు—..." అన్నాడు. అప్పుడో ముసలాయన బయటకు వచ్చి-విశ్వాన్ని చూసి-"రా-నాయనా!" అన్నాడు. నర్సమ్మకు చేతులు జోడించి నమస్కరించాడు.

తల్లీ కొడుకు లిద్దరూ లోపలకు వెళ్లి ఆడపెళ్లివారు చూపించిన కుర్చీల్లో కూర్చున్నారు. అక్కడ పరస్పర పరిచయాలయ్యాయి.

వియ్యపురాలు నర్సమ్మ దగ్గరకొచ్చి - "మాలతి నా సవతి కూతురని అంతా అంటారు. కానీ నాకలా అని పించదు. కన్నబిడ్డలకంటే ప్రేమగా పెంచాను దాన్ని" అంది.

నర్సమ్మ చిరునవ్వు నవ్వి - "ఈ లోకప్రతీరే అంత! మంచితనానికి పెడార్థాలు తీస్తుంది. మా అబ్బాయికి కట్నం, లాంఛనాలు అంటే అసహ్యం. ఆర్భాటాలంటే అసహ్యం. కానీ ఖర్చులేకుండా దండలు మార్చుకుంటే

అది పెళ్ళి కాదా అంటాడు. దీనికందరూ పెద్దరాలుతీసి వాడికి పెళ్ళే కాదని భయమేమో అంటారు..." అంది.

ఫలహారాలు వచ్చాయి. విశ్వం, నర్సమ్మ ఫలహారాలు తీసుకున్నారు, విశ్వం దృష్టంతా పెళ్లికూతురిమీదే వుంది. ఆమె చాలా అందగత్తె అని విన్నాడతను. ఇప్పుడు చూడబోతున్నాడు.

ఇంకా పెళ్ళికూతురు రాలేదు.

"తొందరగా అమ్మాయిని తీసుకొని రండమ్మా!" అంది నర్సమ్మ.

"ఈలోగా మీతో ఓ విషయం మాట్లాడాలి వదినగారూ!" అంది వియ్యపురాలు. ఆమె పైకి లేయగా నర్సమ్మ ఆమెతో కలిసి లోపలకు వెళ్ళింది.

వియ్యపురాలు గది తలుపులు వేసింది. తన బొడ్లోంచి తాళంచెవులు తీసి — అక్కడున్న బీరువా తలుపులు తెరుస్తూ — "ఈ యింట్లో నేను తప్ప ఎవ్వరూ ఈ బీరువాను తాకడానికికూడా వీల్లేదు...." అంది.

ఆమె చెప్పదల్చుకున్నదేమిటా అని నర్సమ్మ ఎదురు చూస్తోంది.

వియ్యపురాలు బీరువా అరలోంచీ ఓ మూలగా పెట్టిన కవరొకటి తీసింది. ఆ కవర్లోంచి ఓ కాగితంతీసి నర్సమ్మకిచ్చి — "ఇది చదవండొదినగారూ...." అంది.

నర్సమ్మ ఆ కాగితం చదివింది. అందులో విశ్వానికి అంతకుముందే వివాహమైందన్న విషయం వ్రాసి వుంది.

"అబద్ధం!" అంది నర్సమ్మ అప్రయత్నంగా.

అప్పుడు వియ్యపురాలు కవర్లోంచి ఓ ఫోటోకూడా తీసి నర్సమ్మకిచ్చింది. అది చూస్తూనే నర్సమ్మ గుడ్లు తేలేసింది. ఏం మాట్లాడాలో ఆమెకర్థంకాలేదు.

"ఇదంతా యేమిటి వదినగారూ...." అంది వియ్యాపు రాలు.

"ఏమో—నాకేమీ అర్థం కావడంలేదు...." అంది నర్సమ్మ.

"ఈ రోజుల్లో చాలామంది ఫోటోగ్రఫీలో ట్రిక్స్ చేస్తున్నారు. నా కూతురికి పెళ్ళి కుదిరిందని అసూయపడి కొందరీ పెళ్ళి చెడగొట్టడానికి కుతంత్రం చేస్తున్నారు. అవునా?"

"అవును...." అనేసింది నర్సమ్మ వెంటనే.

"నేనలాగే అనుకున్నాను. అయినా సవతి తల్లినికదా నేను చెబితే ఈ మాటెవరూ నమ్మరు. అందుకే మిమ్మల్నడిగి తెలుసుకుంటున్నాను...." అంది వియ్యాపురాలు.

"మీరు చాలా మంచివారు...."

"అలాగనకండి. మీది చాలా మంచి సంబంధం. మీలాంటి అత్తగారినీ, మీ అబ్బాయిలాంటి భర్తనూ పొందాలంటే మా అమ్మాయి గత జన్మలో ఏ బంగార పూవులతోనే పూజచేసుకొని వుంటుంది. మీనుంచి నిజం తెలుసుకున్నాక నాకిప్పుడెంతో సంతోషంగా వుంది. ఇక మా మాలతికేలోటూ వుండదు...."

నర్సమ్మ అనుమానంగా—"మీరు నమ్మినా మిగతా వాళ్ళిది నమ్ముతారా?" అంది.

"అదే మాలతి అదృష్టం. ఈ ఉత్తరం పోస్టుమన్ స్వయంగా నాకే యిచ్చాడు. నేనుకాక వేరెవరైనా ఇది చూసివుంటే ఈ పెళ్ళికి ఒప్పుకునేవారు కాదు. నాకున్న నిదానం మా ఇంట్లో ఇంకెవ్వరికీ లేదు...." అంది వియ్యాపురాలు.

"మీవంటి వారితో వియ్యమందుతున్నామంటే మాదీ

అదృష్టమే కదా!" అంది నర్సమ్మ.

"ఒక్కటే అనుమానం వదినగారూ! అసలీ ఫోటో యెలా తయారయిందంటారు?" అంది విస్మయపురాలు.

నర్సమ్మ బుర్ర చురుగ్గా పనిచేసింది — "మావాడు నాటకాల్లో వేషాలేస్తూంటాడు. అందులోదేమోనని నా అనుమానం. నాకు నాటకాలంటే చిరాకు. మా ఇంట్లో వాడి నాటకాల ఫోటోలు చాలా వున్నాయి. ఒక్కటి కూడా నేను చూడలేదు...."

"ఇప్పుడు నా శంక పూర్తిగా తీరిపోయింది—...." అంటూ విస్మయపురాలు అప్పటికప్పుడు — ఫోటోనీ, ఉత్తరాన్నీ, కవర్నీ — అగ్గిపుల్లతో అంటించేసింది. తర్వాత ఇద్దరూ గదిలోంచి బయటకు వచ్చారు.

అప్పటికి పెళ్ళికూతురు వచ్చి కూర్చుంది. ఆమె చాలా అందంగా వుంది. విశ్వం ఆమె వంకనే రెప్పలార్పకుండా చూస్తున్నాడు. ఆమెకూడా ఓరకంట అతడిని గమనిస్తూనే వుంది. వాటం చూస్తే ఒకరికొకరు నచ్చినట్లే కనబడుతోంది.

నర్సమ్మ కొడుకుతో కొద్దిక్షణాలు మాట్లాడి—"మళ్ళీ వెళ్ళి ఉత్తరాలు రాస్తామనే సంప్రదాయంకాదు మాది. అబ్బాయికి పిల్ల నచ్చింది. సింపుల్‌గా వివాహం జరిగే యేర్పాట్లు చేయండి. మంచి ముహూర్తం నిర్ణయమయ్యాక మాకు కబురుపెట్టండి—" అంది.

# 8

"నా పథకానికి తిరుగుండదు..." అన్నాడు రంగా.

"ఆవిడ ఆ ఫోటో చూపించినప్పుడు నేను చాలా కలవరపడ్డాను. కానీ ఆవిడే నాకు దారి చూపించింది.." అంది నర్సమ్మ.

"ఎందుకు చూపించదరా? ఆ పిల్ల నెలా వదుల్చుకోవాలా అని చూస్తోందావిడ. సవతి కూతురంటే బొత్తిగా పడదామెకు. చాలా మంచి సంబంధాలే వచ్చాయా అమ్మాయికి. సవతికూతురెక్కడ సుఖపడిపోతుందోనని తిరగ్గొట్టిందా యిల్లాలు...." అన్నాడు రంగా—"ఇప్పుడావిడ తనే పట్టుబట్టి విశ్వంతో పెళ్ళి జరిపిస్తుంది మాలతికి...."

"కానీ...." అంది నర్సమ్మ—"ఆ ఫోటోను వాళ్ళెవరు పంపివుంటారు? అనూరాధ కాదుగదా...."

విశ్వం భయంగా—"అనూరాధే అయుండాలి. నెగటివ్సు ఆమె దగ్గరే వున్నాయి...." అన్నాడు.

రంగా నవ్వి—"మీ భయం అర్థంలేనిది. అనూరాధ తన్ను తాను రక్షించుకుందుకే ఆ నెగటివ్సుకూడా పట్టుకు పోయింది తప్పితే-ఆమె వాటితో ప్రింట్సుతీసి విశ్వాన్ని బెదిరించదు....అదామెకు క్షేమంకాదు...." అన్నాడు.

"అయితే ఆ నెగటివ్సు—ఇంకా యెవరి దగ్గరైనా వున్నాయంటావా?"

"వెర్రివాడా — అది కొత్త ప్రింటు కాదు. పాత ప్రింటే! నీ పెళ్ళి ఫోటో ఒకటి నా దగ్గరున్న విషయం మరిచావా?" అన్నాడు రంగా.

"అంటే?"

"ఈ పెళ్ళి కుదరాలని నేనే ఆ ఫోటో నీకాబోయే అత్తగారి పేరిట పంపించాను. ఆ ఫోటోయే ఈ పెళ్ళి కుదిర్చింది...." అన్నాడు రంగా.

విశ్వం తెల్లబోయి — "నువ్వు అసాధ్యుడివి—" అన్నాడు.

"నేను అసాధ్యుడనైతే సరిపోదు. నువ్వూ అలాగే

వుండాలి. ఆ ఫోటో గురించి యెప్పుడెవరడిగినా — అది నాటకంలోని దృశ్యమని చెప్పడం మరిచిపోకు—" అన్నాడు రంగా.

"చెప్పడానికి నా యింట్లోకూడా అలాంటి ఫోటో లుండాలి కదా....అసలు మా ఇంట్లో నేను నాటకాల్లో వేషాలేసిన ఫోటోలే లేవు...."

నర్సమ్మ చిరాగ్గా—"బాగుంది—ఇదేమైనా కోర్టను కున్నావా - సాక్ష్యాధారాలన్నీ తెచ్చి చూపించడానికి- ఆల్బం ఏ ప్రయాణంలోనో పోయిందనొచ్చు...." అంది.

"చూడు - మీ అమ్మను చూసి తెలివి పెంచుకో -" అన్నాడు రంగా.

వాళ్ళలా కబుర్లు చెప్పుకుంటూండగా చటుక్కున యెవరో లోపలకు వచ్చారు. విశ్వం వచ్చిన వ్యక్తిని చూసి కంగారుగా లేచి నిలబడి - "అరే - మామయ్య గారు-" అన్నాడు.

"అప్పుడే నన్నలా పిలిచేయకు బాబూ!" అన్నా డాయన.

"ఏమిటన్నయ్యగారూ—హడావుడిగా కనబడు తున్నారు! అప్పుడే ముహూర్తం పెట్టించుకొని వచ్చేశా రేమిటి?" అంది నర్సమ్మ.

ఆయన తన లాల్చీ పక్క జేబులోంచి ఓ కవరుతీసి విశ్వాని కందించి - "ఇందులో మొత్తం పది ఫోటో లున్నాయి. వాటి గురించి నువ్వే చెప్పాలి-" అన్నాడు.

విశ్వం ముందు కాబోయే మామగారికి కుర్చీ చూపించి తనప్పుడా ఫోటోలను చూశాడు. అవన్నీ అతడికీ, అనూరాధకూ వివాహమైన పెళ్ళి ఫోటో కాపీలు. విశ్వం ఆ ఫోటోలను మౌనంగా రంగాకు అందించాడు. రంగా

ఆ ఫోటోలు చూసి తడబడుతూ — "ఇవి మీకెలా వచ్చాయి?" అన్నాడు.

"మా యింటిపక్క అటు అయిదిళ్ళు, ఇటు అయిదిళ్ళవాళ్ళకి వచ్చాయివి—" అన్నాడు వచ్చినాయన. ఆయన చెప్పిందాన్నిబట్టి వాళ్ళకర్థమైన విషయమేమిటంటే—ఎవరో ఆ పదిమందికీ ఈ ఫోటోతోపాటు ఓ ఉత్తరంకూడా ఇచ్చారు—అందులో "ఇలాంటి ఫోటోలే మాలతి తల్లికీ పంపాం. కానీ ఆమె సవతి తల్లి కదా! అందుకని మాలతి పెళ్ళి ఆ పెళ్ళైన వాడితోనే జరిపేయబోతోంది. ఇరుగూ పొరుగూ అయిన మీరైనా కలగజేసుకొని ఈ పెళ్ళి ఆపాలి ..." అని వుందిట. వాళ్ళంతా మాలతి ఇంటిమీద దాడిచేసి సవతి తల్లిని నానా మాటలూ అనడమేకాక—మాలతి తండ్రినికూడా—నువ్వు తండ్రివా, కసాయివాడివా అని దూషించారుట. అటు లోకాపవాదుకీ ఇటు కూతురి భవిష్యత్తుకీ భయపడి ఆయనిలా పరుగున వచ్చాడుట.

విశ్వం వెంటనే-"నేనో నాటకంలో వేషం వేశాను. ఆ ఫోటోలా నాటకంలోనివే! నా నాటకాల ఫోటో ఆల్బం మొన్న ప్రయాణంలో పోయింది—" అన్నాడు.

"అయితే ఈ ఫోటో లెవరు పోస్టుచేశారు—ఎందుకు చేశారు?" అన్నాడు వచ్చినాయన.

"ఈయన నా మిత్రుడు. పేరు రంగా. ఇతడే ఆ ఫోటోలన్నీ పోస్టుచేశాడు. అబ్బాయిమీద చెడ్డ అభిప్రాయం ఏర్పడితే సవతి తల్లి ఈ పెళ్ళికి తప్పక ఒప్పుకుంటుందని ఇతడభిప్రాయం...." అన్నాడు విశ్వం.

వచ్చినాయన విచిత్రముఖంవేసి—"ఇలాంటి పని శత్రువులే తప్ప మిత్రులు చేయరు-...." అన్నాడు.

రంగా వెంటనే — "అయ్యా! మీ యింట్లో కథ అందరికీ తెలుసు. ఆ యింట్లో మీ ఆవిడమాటతప్ప ఇంకెవ్వరిదీ చెల్లదు. అమ్మాయి గురించి అనుమానాలుంటే ఆవిడకిష్టం. అమ్మాయి సుఖపడితే మీకిష్టం. మీరీ పెళ్లి కాదనకండి. ఆవిడ కాదనదు. ఉభయతారకంగా ఉంటుందీ ఫోటోలవల్ల ...." అన్నాడు.

వచ్చినాయన కంగారుగా — "నేను కన్న తండ్రినే కానీ కసాయివాణ్ని కాను. ఈ పెళ్లి కొప్పుకొని నలుగురి చేతా ఛీ అనిపించుకోలేను. మీ వ్యవహారం చాలా తిరకాసుగా వుంది. వస్తాను...." అనేసి అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

ముగ్గురికి ముగ్గురూ తెల్లబోయారు. ముగ్గురిలోకీ ముందు నర్స మ్మే తేరుకొని— "కోరివితో తలగోక్కోవడమంటే ఇదే....వాళ్ళకీ ఫోటోలు పంపడం చాలా తెలివితక్కువ పని—" అంది.

"నేనేమంత తెలివితక్కువవాణ్ని కాదు. ఈ ఫోటోలు నేను పంపలేదు—" అన్నాడు రంగా.

"ఇందాకా నువ్వే పంపానన్నావు!" అన్నాడు విశ్వం.

"అందుక్కారణముంది—" అన్నాడు రంగా— "నువ్వసలే పిరికివాడివి. ఆ ఫోటో లెవరో పంపారని తెలిస్తే వాళ్ళ సంగతెలాగున్నా ముందు నువ్వే భయపడి వెళ్లి వద్దంటావని భయపడి అలా చెప్పాను. దాంతో నువ్వు ఆ తర్వాత నీ మామగారు తెచ్చిన ఫోటోలు కూడా చూసి అవీ నేనే పంపి ఉంటాననుకున్నావు...."

"అయితే ఈ ఫోటో లెవరు పంపారంటావు?"

"ఇంకెవరు? నెగటివు లెవరిదగ్గరున్నాయో-వాళ్ళు!"

"అంటే—అనూరాధా?"

"అవును—ఆమే!"

"ఇందువల్ల ఆమెకు ప్రయోజనం?"

"ప్రయోజనమేమిటీ-నీకింకా అర్థం కాలేదా? ఆమెకు మన గురించి పూర్తిగా తెలిసిపోయింది. ఇప్పుడామె మన ప్రయోజనాలకి అడ్డం వస్తుంది...."

"మొత్తంమీద ఈ పెళ్ళి చెడగొట్టింది...." అంది నర్సమ్మ.

"పెళ్ళెక్కడ చెడింది-? ఈ పెళ్ళి జరిపించే బాధ్యత నాది!" అన్నాడు రంగా లేచి నిలబడుతూ.

"పెళ్ళికూతురి తండ్రి వచ్చి ముఖంమీద కుండబద్దలు కొట్టినట్లు మీ సంబంధం వద్దని చెప్పిపోయాక కూడా- ఇంకా పెళ్ళి జరుగుతుందంటావేమిటీ? నువ్వు తెలివిలో ఉండే మాట్లాడుతున్నావా?" అంది నర్సమ్మ.

"ఈ దేశంలో ఆడపిల్లల సంగతి మీకంటే నాకు బాగా తెలుసు—" అన్నాడు రంగా.

"పెళ్ళి జరిగితే మాత్రం - అనూరాధ నన్నొదిలిపెడుతుందనుకోను. ఆమె సాక్ష్యాలు పట్టుకొని బయల్దేరిందంటే నేను జైలు పాలవుతాను-" అన్నాడు విశ్వం.

"ఎందుకని?"

"ఒక భార్య బ్రతికుండగా రెండో భార్యను తెచ్చుకోవడం చట్టరీత్యా నేరమని నీకు మాత్రం తెలియదా?" అన్నాడు విశ్వం.

"అదా నీ భయం?" అని నవ్వాడు రంగా - "నీకు నేను హామీ యిస్తున్నాను. నీకు మాలతితో వివాహమయ్యేసరికి అనూరాధ బ్రతికుండదు-"

నర్సమ్మ, విశ్వం ఉలిక్కిపడి రంగా వంక చూశారు. అతడి కళ్ళలో వారికి హెచ్చరిక కనబడింది.

# 9

రంగా అంచనా తప్పుకాలేదు. అతను విశ్వాన్ని తీసుకొని మళ్ళీ మాలతి యింటికి వెళ్ళాడు. స్వయంగా మాలతితో మాట్లాడాడు. విశ్వం శీలాన్నీ గుణగుణాల్నీ విపరీతంగా పొగిడాడు.

విశ్వం మాలతితో—"నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నాకు భార్యగా నువ్వు సుఖం తప్ప మరొకటి రుచి చూడవు. ఆ ఫోటోలు కట్టి నాటకం. వాటిని చూసి మనసు పాడుచేసుకోకు-...." అన్నాడు.

మాలతి అతడి మాటలకు కరిగిపోయింది. ఆ యిల్లొక నరకంలా ఉన్నదామెకు. ఏదోవిధంగా అందులోంచి బయటపడాలనుకుంటోంది. విశ్వం మోసగాడైతే తర్వాత చూసుకోవచ్చు.

"ఈ పెళ్ళి నాకిష్టమే!" అని చెప్పిందామె. విశ్వం మాలతి తండ్రితో - "మీ అమ్మాయిష్టపడింది. ఆమెకు మైనారిటీ తీరిపోయింది కాబట్టి మేమిద్దరం మిమ్మల్నెదిరించికూడా వివాహం చేసుకోగలం-" అన్నాడు.

పెద్ద యిబ్బందేమీ లేకుండా ఆ రాత్రే అక్కడ గుళ్ళో పెళ్ళి జరిగింది. విశ్వం మాలతిని తీసుకొని వెళ్ళయిపోయిన మర్నాడే తన యింటికి వచ్చేశాడు. నర్సమ్మ యింట్లో కోడలికి స్వాగతం పలికి-"నన్ను పిలవకుండా నే పెళ్ళి చేసుకొచ్చేశారూ-" అంది కొడుకుతో. కానీ ఆవిడ ముఖంలో బాధ లేదు.

మాలతికి అంతా విచిత్రంగా వుంది.

ఇలాంటి పెళ్ళెక్కడైనా వుంటుందా?

తండ్రి లోకాపనిందకు భయపడి ఈ పెళ్లి వద్దన్నాడు. తనేమో నరకంలోంచి బయటపడాలని ఈ పెళ్లికి ఒప్పుకుంది. ఒప్పుకున్న మరుక్షణం పెళ్లి. అటుపైన అత్తవారింటికి ప్రయాణం. పెళ్లికి అత్తగారు రానేలేదు.

మాలతికి సందేహాలకు చాలకన్నట్లు "నీకు పెళ్ళయిందనిగానీ - నువ్వు మా అబ్బాయి భార్యవనిగానీ చుట్టుపక్కల ఎక్కడా అనకు-" అంది నర్సమ్మ కోడలితో-ఆమె కాపురానికి వచ్చిన ఓ గంట అనంతరం.

"ఎందుకని?"

"అన్నీ నీకే అర్థమవుతాయి తొందర్లో...." అంది నర్సమ్మ.

విశ్వం బయటకు వెళ్లిపోయాడు. ఇంట్లో అత్తాకోడళ్ళు మిగిలారు. మధ్యాహ్నం రెండింటికి నర్సమ్మ నిద్రపోయింది. మాలతికేమీ తోచక దొరికిన పుస్తకమొకటి తీసింది.

అప్పుడెవరో గుమ్మం దగ్గర నిలబడ్డారు.

మాలతి తలెత్తి చూసింది. ఓ అందమైన యువతి. ఆమె ఎక్కడో చూసినట్లుంది.

"కంగ్రాట్యులేషన్స్ మిసెస్ మాలతీ!" అందా యువతి.

"నువ్వెవరో నాకు తెలియదు...." అంది మాలతి. "మా అత్తగారిని పిలుస్తాను."

"పాపం-ఆవిడ మంచి నిద్రలో వుంటుంది. ఇప్పుడు లేపకు. నేను నీ కోసమే వచ్చాను. నన్ను నువ్వింకా గుర్తుపట్టలేదా? నీ శ్రీవారితో నాటకంలో వేషంవేశాను" అందా యువతి.

మాలతికి గుర్తొచ్చింది. తమ వీధిలో పంచిపెట్టబడిన

పెళ్లి ఫోటోలో విశ్వం పక్కన పెళ్లికూతురిలా కూర్చుంది దామె.

"నీ పేరు?"

"అనూరాధ.."

"మీరిద్దరూ వేసిన ఆ నాటకం పేరేమిటి?"

"జీవితం-" అంది అనూరాధ.

"ఆ ఫోటో చూడ్డానికి నాటకం ఫోటోలా లేదు. అచ్చం నిజం పెళ్లి ఫోటోలాగుంది.." అంది మాలతి.

"చెప్పానుగా - ఆ నాటకం పేరు జీవితమని!" అంది అనూరాధ.

"నిలబడే వున్నావు. కూర్చో!" అంది మాలతి.

"ఈ యింట్లో నిలబడవలసినదాన్ని నేను. కూర్చోవలసినదానివి నువ్వు.." అంది అనూరాధ.

మాలతి ఆమె వంకే పరీక్షగా చూస్తూ - "నువ్వు చాలా అందంగా వున్నావు. నాటకాలేం కర్మ— ప్రయత్నిస్తే నీకు సినిమా ఛాన్సుకూడా తగలొచ్చు.." అంది.

అనూరాధ నవ్వి - "అందం ఆడదానికి వరమని నువ్వు భావిస్తున్నట్టున్నావు. ఆడదానికి పెళ్ళయితే ఆ వరం మగాడిదే అవుతుంది-" అంది.

"నీకు పెళ్ళయిందా?" అంది మాలతి.

"ఆఁ నాటకంలో.." అంది అనూరాధ - "నేను నీ అదృష్టానికి నిన్నభినందించాలని వచ్చాను. పెళ్లిఫోటోలో మా యిద్దర్నీ చూడ్డంవల్ల నీకు కలిగిన అపోహలేమైనా వుంటే తొలగించాలని వచ్చాను.."

"చాలా థాంక్స్!" అంది మాలతి.

"ఎందుకూ అనడగనంటే నాదో సలహా నీకు..."

అనాగింది అనూరాధ.

మాలతి ఆమె వంక కుతూహలంగా చూసింది.

"నీ కంట్లో అనారోగ్యంగా వున్నదని చెప్పి నీ భర్తను కొంతకాలంపాటు దగ్గరగా రానివ్వకు. నీ భర్త నమ్మకపోతే లేడీ డాక్టర్నికలు. డాక్టర్ ప్రభాదేవికి నా పేరు చెప్పావంటే నువ్వు కోరిన రిపోర్టిస్తుంది..." అంది అనూరాధ.

మాలతి తెల్లబోయి - "ఇదంతా ఎందుకు?" అంది.

"నా సలహా అయిపోలేదు. నీ పెళ్ళి సింపుల్‌గా జరిగినా పెళ్ళిఫోటోలు తీశారుగదా? వాటి నెగెటివ్స్ సంగ్రహించి దాచుకో."

"ఎందుకు?"

"అవన్నీ నేను మళ్ళీ నిన్ను కలిసినపుడు చెబుతాను. ప్రస్తుతానికి నేను చెప్పినది తూచా తప్పకుండా పాటించాలి..."

"పాటించకపోతే?"

"అది నీ దురదృష్టం. నేను నీ మేలుకోరి చెబుతున్నాను. గుర్తుంచుకో. నేను మళ్ళీ నిన్ను కలుస్తాను...." అని చటుక్కున వెనక్కి తిరిగి చరచరా వెళ్ళిపోయింది అనూరాధ.

## 10

గదిలో మల్లెల పరిమళం గుప్పుమంటోంది. మంచం మీద ముడుచుకుని కూర్చుంది మాలతి.

రాత్రి పదింటికి విశ్వం గదిలో అడుగుపెట్టి తలుపులు వేశాడు.

మాలతి గుండె దడదడా కొట్టుకుంది.

విశ్వం ఆమెను సమీపించి చుబుకం పైకెత్తాడు.

మాలతి బరువుగా కనురెప్పలు వాల్చేసింది.

"అందానికి మారు రూపానివి నువ్వు. నువ్వు నా భార్యవు కావడం - ఎన్నో జన్మల అదృష్టం-" అన్నాడు విశ్వం.

"అదృష్టం మీది కాదు - నాది!" అంది మాలతి.

విశ్వం ఆమె పక్కగా కూర్చుని - "నాది పొరపాటే! ఇకమీదట జీవితంలో - నీ, నా అని వేరే లేవు. అన్ని అనుభవాలూ మనవి!" అన్నాడు.

మాలతి మాట్లాడలేదు. అతడామె నడుంచుట్టూ చేయి వేసి - "ఇన్నాళ్ళవు నాటకాల్లో నేకాక నిజంగా కూడా ఓ భార్యను సంపాదించుకున్నాను-" అన్నాడు.

మాలతికి నాటకాలనగానే మధ్యాహ్నం వచ్చిన అనూరాధ గుర్తొచ్చింది. ఆమె మృదువుగా అతడిచేయి నడుంమీంచి తీసి — "నన్ను మీరు క్షమించాలి. నా ఆరోగ్యం బాగాలేదు...." అంది.

"ఏమయింది నీకు?" అన్నాడు కంగారుగా విశ్వం.

"ఏమయిందో చెప్పలేను. ఏదోలాగుంది...." అంది మాలతి.

"తొలిరేయి కదా - అలాగే వుంటుంది - "అన్నాడు విశ్వం.

"అలాకాదండీ - వళ్ళంతా సూదులు గుచ్చినట్లు ఏదో బాధ. మీరు వంటిమీద చేయివేయగానే పుండుమీద కారం జల్లినట్లుగా అనిపించింది...." మాలతి తన బాధను వర్ణించి చెప్పసాగింది.

విశ్వం ఆమె వంక అనుమానంగా చూసి - "ఈ బాధ నీకిప్పుడే ప్రారంభమైందా?" అన్నాడు.

"లేదండీ-చాలా రోజుల్నించి వుంది. మా అమ్మకు

చెప్పడం లేమి నేదికాదు. మా నాన్నగారికూడా చెప్పు కున్నానాఖరికి. అప్పుడాయన నన్నీ ఊరే తీసుకొద్దా మనుకున్నారు. కానీ అమ్మ ఒప్పుకోలేదు. ఈ ఊళ్ళో డాక్టర్ ప్రభాదేవి అని ఒకామె ఉన్నారుట. మీరు అనుమతి స్తే రేపొక్కసారి ఆ డాక్టర్ని చూద్దాం....” అంది మాలతి.

డాక్టర్ ప్రభాదేవి పేరు వినగానే విశ్వానికి కళ్ళు తిరిగినట్లనిపించింది. ఇంచుమించు ఇలాగే జరిగింది మొదటి భార్య విషయంలోకూడా.

“సరే-నీ యిష్టం....” అని అతడు మంచంమీద ఓ మూలగా జరిగి కూర్చున్నాడు. మాలతి అక్కడే కూర్చుంది. భర్త ఇంకేమీ అనకపోవడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. అలా కాసేపు గడిచాక విశ్వం మంచంమీద నడ్డి వాల్చాడు. అతడు భార్యవైపు చూడను కూడా చూడ లేదు.

మాలతి ఆలోచనలో పడింది. పాపం—అతడు నిరుత్సాహ పడినట్లున్నాడు. కానీ ఎంత మంచివాడు? తన కారోగ్యం బాగోలేదని తెలియగానే ఏమీ బలవంతం చేయలేదు.

అతడు బలవంతం చేయకపోవడానికి కారణం వేరే వుందని ఆమెకు తెలియదు. మాలతి ఆరోగ్యం బాగో లేదనీ, డాక్టర్ ప్రభాదేవిని కలుస్తానని అనగానే అతడి కేదో అపశృతిలా తోచింది. మాలతికి తనగురించి యేదో సమాచారం తెలిసిందనీ—తననుంచి ఆమె ఏదో రాబట్టా లనుకుంటోందనీ అతడికనుమానం కలిగింది. ఆమె పోలీసుల మనిషి కాదుగదా అనికూడా అతడు అనుమానించాడు. అందుకే అతడు తీవ్రాలోచనలో పడ్డాడు.

"ఏమండీ!" అంది మాలతి.

విశ్వం ఆలోచనల్లోంచి తేరుకుని ఉలిక్కిపడి—"ఊఁ" అన్నాడు.

"కోపం వచ్చిందా?" అంది మాలతి మళ్ళీ.

"ఎందుకు?"

మాలతి క్షణమాత్రం తటపటాయించి — "భార్యాభర్తల మధ్య రహస్యాలుండకూడదంటారు. కానీ మీరు నా దగ్గర చాలా దాచారు...." అంది.

"ఏం దాచాను?" అన్నాడు విశ్వం. తనలో కలిగిన కలవరపాటును బయటపడకుండా వుండాలని అతడు పొడిగా ఆ ప్రశ్న వేశాడు.

"అనూరాధ గురించి నాకు చెప్పలేదు...."

"అనూరాధ..అనూరాధ ఎవరు?" అన్నాడు విశ్వం. ఈసారి దాచుకుందామన్నా అతడి గొంతులో కలవరపాటు దాగలేదు.

"అదే—జీవితమనే నాటకంలో మీ పక్కన పెళ్ళికూతురుగా కూర్చున్న అమ్మాయి...." అంది మాలతి అమాయకంగా.

"ఏమిటి నువ్వంటున్నది?" అన్నాడు విశ్వం.

అప్పుడు మాలతి అతడికి అనూరాధ మధ్యాహ్నం ఇంటికి వచ్చి తనతో మాట్లాడిన విషయం చెప్పి—"ఆమె నాతో అలా యెందుకు మాట్లాడిందో అర్థంకాలేదు. అయినా ఆమె చెప్పినట్లే చేశాను. కానీ మిమ్మల్ని చూస్తే జాలేసి నిజం చెప్పేశాను...." అంది.

"అనూరాధ ఇక్కడికి వచ్చిందా?" అన్నాడు విశ్వం. ఆ ప్రశ్న అతడు మాలతి నుద్దేశించి వేయలేదు. తనలో తానే ఆశ్చర్యంగా గొణుక్కున్నాడు. తర్వాత మాలతిని

మధ్యాహ్నమేం జరిగిందని శతవిధాల ప్రశ్నలు వేశాడు. అవన్నీ వినగానే ఆతడికర్థమైపోయింది. అనూరాధ తను తప్పించుకుపోవడమే కాక — మాలతిని కూడా ఇక్కణ్నించి తప్పించాలనుకుంటోంది. తనే విధంగా తప్పించుకుందో అదే విధంగా మాలతినీ తప్పించబోతోంది.

ఎందుకు?

తన గురించి పూర్తిగా తెలిసికూడా ఆమె తనను పెళ్లెందుకు చేసుకుంది? ఆటుపైన మాలతితో తన వివాహాన్ని భగ్నం చేయడానికెందుకు ప్రయత్నించింది? తమ వివాహం జరిగినా మాలతినింకా వదలిపెట్టదేం?

ఆమె మాలతికింకా యేమైనా చెప్పిందా అన్న అనుమానం విశ్వాన్ని పీడిస్తోంది. కానీ మాలతి యెంత అడిగినా తనకింకేమీ తెలియదని చెబుతోంది. ఆమె ముఖం చూస్తుంటే నిజమే చెబుతోందనిపిస్తోంది. అయితే ఒకప్పుడు తనిలాగే అనూరాధను నమ్మి మోసపోయాడు. కానీ మాలతి అనూరాధ వంటిది కాదు. లేకుంటే మధ్యాహ్నం అనూరాధ వచ్చిన విషయం తనకెందుకు చెబుతుంది?

"ఏమండీ? ఆ అమ్మాయి నాకలా యెందుకు చెప్పిందంటారు?" అంది మాలతి విశ్వాన్ని కుతూహలంగా చూస్తూ.

"ఎందుకా?" అన్నాడు విశ్వం. అతడి బుర్ర చురుగ్గా పనిచేసింది.

అనూరాధ విశ్వాన్ని ప్రేమించింది. విశ్వమామెను ప్రేమించలేదు. నాటకాల్లో వేషం వేసినప్పటికీ అతడామెపై సోదర భావాన్నే ప్రకటిస్తూ వచ్చాడు. తనకు విశ్వంద్వారా లభించిన సౌఖ్యం యే అమ్మాయికీకూడా

లభించరాదన్న భావంతో అనూరాధ మాలతికలా చెప్పి వుంటుంది. డాక్టర్ ప్రభాదేవి ఆమెకు స్నేహితురాలు.

మాలతికీ సమాధానం నచ్చి "-అంతే అయివుంటుంది" అంది.

విశ్వం చటుక్కున లేచి కూర్చుని ఆమెకు దగ్గరగా జరిగి నడుంచుట్టూ చేయివేసి — "పుండుమీద కారం చల్లినట్లు లేదుకదా!" అన్నాడు.

"లేదు కాబట్టే-మీకు ముందబద్ధం చెప్పినా తర్వాత నిజం చెప్పేశాను...." అంది మాలతి.

"మాలతీ—నువ్వు నా అదృష్ట దేవతవు—" అంటూ విశ్వం ఆమెను తనవైపుకు తిప్పుకుని బలంగా కౌగలించుకున్నాడు.

ఆ తర్వాత మాలతిమీద ఇంకేమైనా అనుమానాలుంటే అవన్నీ పూర్తిగా తొలగిపోయాయతడికి. ఆమె అమాయకురాలన్న విషయంలో అతడికింకేమీ సందేహం మిగల్లేదు.

## 11

మర్నాడుదయం ఉత్సాహంగా నిద్రలేచాడు విశ్వం. ఇదివరకటి పెళ్ళిలాంటిది కాదీసారి. ఇప్పుడు తన భార్య నిజంగానే తనకిల్లాలయింది. అతడికెంతో సంతోషంగానూ, మనసు తేలికగానూ వుంది.

ఇప్పుడు మాలతి గతంలోని అనూరాధలాకాక తన కాలికింద చెప్పులా పడి వుంటుంది. తనేం చెబితే అది చేస్తుంది. అనూరాధ అనుకోకుండా తనను దెబ్బతీయడంతో మళ్ళీ తనకిలాంటి అవకాశం వస్తుందా అని భయపడ్డాడు. కానీ అదృష్టం తనను వరించింది.

నాలుగైదేళ్ళలోనే తను బంగళా కొంటాడు. కారు

కొంటాడు. ఇప్పుడు చేస్తున్న ఉద్యోగం వదిలి కాలుమీద కాలువేసుకుని దర్జాగా జీవిస్తాడు. బహుశా అప్పుడు తను వేరే పెద్దింటి పిల్లను పెళ్ళికూడా చేసుకోవచ్చు.

ఇప్పుడు తను అర్జంటుగా రంగాను కలుసుకోవాలి.

విశ్వం కాఫీతాగి బట్టలు మార్చుకుని రంగా ఇంటికి బయల్దేరాడు. అతడు వెళ్ళేసరికి రంగా యింటి తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. కాలింగ్ బెల్ మ్రోగించి యెంతకీ యెవరూ రాకపోవడంతో అతడే తలుపులు తోసుకుని లోపలకు వెళ్ళాడు.

"ప్లీజ్ — కమిన్!"

తియ్యని గొంతు....

ఎదురుగా సోఫాలో కూర్చుని వుంది అనూరాధ.

"నువ్వా?" అన్నాడు విశ్వం.

"అవును. నువ్వు రంగాకోసం వచ్చావు. నేను నీకోసం ఇక్కడ కూర్చున్నాను. రంగానే కలుసుకోవాలంటే టూ టౌన్ పోలీసుస్టేషనుకు పరుగెట్టు. రంగా పోలీస్ స్టేషన్లో యెందుకున్నాడో తెలుసుకోవాలంటే — ఇలా వచ్చి నాకెదురుగా చేతులు కట్టుకుని నిలబడు...." అంది అనూరాధ.

"నీకంత ధైర్యం....?" అని అతడింకా యేదో అనబోయి ఆగిపోయాడు. అనూరాధ చేతిలో రివాల్వ రుంది. అది అతడికే గురిపెట్టబడి వుంది.

"నా ధైర్యమే నీ బలహీనత. నీ బలహీనతే నా ధైర్యం. నేను చెప్పినట్లు నా ఎదురుగా చేతులు కట్టుకుని నిలబడు...." అంది అనూరాధ.

విశ్వం విధిలేక ఆమె చెప్పినట్లే చేశాడు.

"పాపం — రంగా జైలుపాలయ్యాడు. నువ్వూ జైలు

పాలు కావలసిందే-నాటకంలో నైతే నేం-నా మెడలో తాళికట్టావుకదా అన్న జాలికొద్దీ నేనే నిన్ను రక్షించాను...."

"ఏమిటి__రంగా చేసిన తప్పు...."

"రంగా గురించి నేను నీకు చెప్పాలా?" అంది మాలతి.

రంగాదో వింత వ్యాపారం. స్వతంత్ర భావాలు కలిగిన అందమైన యువతుల్నీ, అసహాయులైన అందమైన యువతుల్నీ వివిధ ప్రాంతాలు తిరిగి స్పాట్ చేస్తాడతను. ఆ తర్వాత అతడు కొందరిని తన మిత్రవర్గంలో చేర్చుకుంటాడు. వారికి ప్రేమ పేరు చెప్పో, మరో విధంగానో వివాహాలు జరిపిస్తాడు. ఏ యువతికైనా రంగా నిర్ణయించిన ప్రకారం వివాహం కాగానే ఆమె ఫోటో దేశంలో పేరెన్నికగన్న ఎన్నో హోటల్సుకి చేరుకుంటుంది.

డబ్బు సమాజాన్ని నడిపించే పెద్దలలో వివాహిత స్త్రీలపై మోజు ఒకటి. రంగా చేతిలోని కీలుబొమ్మలైన అతడి మిత్రులు వ్యభిచారం చేయించడానికే వివాహమాడతారు. వారివద్దకు వచ్చే కస్టమర్సు కూడా బాగా డబ్బున్నవారయుంటారు. వచ్చే డబ్బులో సగం వాటం రంగాది. అయినప్పటికీ యేడాదికి లక్ష రూపాయలకు తక్కువకాకుండా యే భర్తయినా సంపాదించుకోవచ్చు. తమకావలసింది సంపాదించుకున్నాక భార్యను యే వ్యభిచార గృహానికో అమ్మేసినా అమ్మేయవచ్చు.

ప్రేమ మైకంలో పడ్డ యువతులు అయినవాళ్ళకు దూరమవుతారు. అసహాయురాలైన యువతులకు అయినవాళ్ళుండరు. తన వివాహ కార్యక్రమాలకు రంగా అటు

వంటి యువతులనే యెన్నుకుంటాడు. వారికి వివాహాలైనాక వ్యభిచారిణులుగా మార్చడం పెద్ద కష్టంకాదు. మన సమాజంలో భర్త తలచుకుంటే భార్యచేత ఏమైనా చేయించగలడు. ప్రత్యక్షంగా అతడు చెప్పకపోయినా పరోక్షంగా అతడు సహకరించినా చాలు.

ఈ విధంగా రంగా బాగా డబ్బు సంపాదించాడు. అతడిపైన యెవ్వరికీ అనుమానంలేదు. ఎందుకంటే బాగా పకడ్బందీగా ఉంటుందతడి పథకం.

ఏదో నేర పరిశోధనలో డిటెక్టివ్ వెంకన్న ఓ వ్యభిచారిణిని కలుసుకుని—ఆమెనా మురికికూపంలోంచి రక్షించాడు. ఆమె ద్వారా అతడికి రంగా గురించి తెలిసింది. రంగా విషయమై అతడు తన అనుమానాలను బలపర్చుకునేందుకు సీతారామయ్యను సాయం కోరాడు. ఆయన కుమార్తె అనూరాధగా ఈ ఊరొచ్చింది. ఉద్యోగంలో చేరింది. అన్ని యేర్పాట్లూ డిటెక్టివ్ వెంకన్నద్వారా జరిగాయి.

ఈలోగా రంగా విశ్వంను తన మిత్ర బృందంలో చేర్చుకున్నాడు. కొడుకు పెళ్ళికో పదిహేనువేలు కట్నం అడుగుదామనుకుంటున్న నర్సమ్మకు రంగా పథకం బాగా నచ్చింది. ముందుగా ఓకోడల్ని తెచ్చుకొని లక్షలు సంపాదించి ఆయిదారేళ్ళు పోయాక - ఇంకో కోడల్ని తెచ్చుకోవాలని ఆమె అనుకుంది.

ఇలా విశ్వంతో పెళ్ళి జరగ్గానే అలా ఆమె ఫోటో పెద్ద హోటళ్ళలో చేరింది. వెంకన్న రంగానో కంట గమనిస్తూ అతడి గురించి చాలా ఋజువులు సంపాదించాడు. విశ్వం, రంగాల సంభాషణలుకూడా కొన్ని రికార్డు చేశాడు.

వెంకన్న చెప్పిన ప్లాను ప్రకారం అనూరాధ విశ్వాన్ని వదిలి వెళ్లిపోయింది. ఆమెకు విశ్వంపై ప్రేమలేదు. తమ పెళ్ళి ఒక నాటకమని కూడా ఆమెకు తెలుసు. వెంకన్న చెప్పిన ప్రకారం ఆమె తన బాధ్యతను నిర్వహించింది.

ఈలోగా విశ్వం గురించి రంగా మరో సంబంధం చూశాడు. వెంకన్న ద్వారా మాలతి గురించి యిప్పటి కప్పుడు తెలుసుకున్న అనూరాధ—"ఆ అమాయకురాలి కన్యాయం జరక్కూడదు...." అని వెంకన్నను వేడు కుంది.

అందుకే ఫోటోలు పంపి ఆమెను హెచ్చరించడం జరిగింది.

"అయినప్పటికి ఆ పెళ్ళిని ఆపలేకపోయావు—" అన్నాడు విశ్వం. తను విన్నదంతా అతడికి అపరిమితా శ్చర్యాన్ని కలిగిస్తోంది.

"అందుకేగదా — నిన్న నీ భార్యను హెచ్చరించి వచ్చాను...." అంది అనూరాధ నవ్వుతూ.

"నీ హెచ్చరిక ఫలించలేదు. నా భార్య నాకు నిజం చెప్పేసింది. నువ్వొచ్చి వెళ్ళిన విశేషాలన్నీ చెప్పే సింది...." అన్నాడు విశ్వం.

"అయినా ఆమెకేం నష్టంలేదు. రంగా అరెస్ట య్యాడుకదా... నువ్వింక నీ భార్యను ఏలుకోకతప్పదు.." అంది అనూరాధ.

"నా భార్య—నా యిష్టం.. "

అనూరాధ అదోలా నవ్వి — "నీకా స్వతంత్రం లేకుండా చేయాలనే ఈనాటకమంతా ఆడింది. మాలతి వంటి దురదృష్టవంతురాలికి మంచి సంబంధం చేయాలనే సత్సంకల్పం నాకు కలగడంవల్లనే మీ వివాహం జరి

గింది. నీ గురించిన వివరాలు డిటెక్టివ్ వెంకన్నవద్ద వున్నాయి. మాలతి కెప్పుడే ప్రమాదం వచ్చినా ఆయన కలగజేసుకుంటాడు. అటుపైన ఇంకా పెద్ద ఆయుధం ఉండనే వుంది... " అంది.

"ఏమిటది?" అన్నాడు విశ్వం కంగారుగా.

"మన పెళ్ళి ఫోటో! మాలతికేమన్యాయం జరిగినా అది బయటకు వస్తుంది. నువ్వెక్కడ మరో పెళ్ళి ప్రయత్నం చేసినా అనూరాధ నిన్ను వెంటాడి వేటాడు తుంది. బుద్ధిగా మాలతితో కాపురం చేసుకున్నావూ— నీకు మనోరమే తప్ప అనూరాధ కనపడదు. అర్థమయిందా?"

విశ్వం తలూపాడు.

"అన్నట్లు మరో విషయం. నీ అసలు ఉద్దేశ్యం తెలియకపోవడంవల్ల కానీ కట్నం అడక్కుండా, పైసా ఖర్చులేకుండా తన్ను పెళ్ళిచేసుకున్నందుకు నిన్నారాధి స్తోంది నీ భార్య మాలతి. అరత్వ లేకున్నా అది నీ అదృష్టం. నీ భార్యకు నిజం చెప్పకపోవడమొక్కటే ప్రస్తుతానికి నేను చేయగల ఉపకారం...."

"మరి నేను వెళ్ళొచ్చా?"

"రంగా దగ్గరకు వెళ్ళకు. ఇంటికే వెళ్ళు...." అంది అనూరాధ.

విశ్వం వెనక్కు తిరిగాడు.

"ఒక్కమాట గుర్తుంచుకో. నువ్వు మళ్ళీ అనూరాధను చూడవు. చూస్తే మనోరమనే చూస్తావు ..." అంది అనూరాధ.

"అర్థమైంది—" అంటూ విశ్వం అక్కణ్నించి బైట పడ్డాడు.

ఇప్పుడు తనేం చేయాలి?

రంగాను కలుసుకోవాలంటే అతడిప్పుడు నేరస్థుడు.

ఇంటికి వెళ్ళాలంటే—ఇప్పుడొచ్చిన కోడలు శాశ్వతంగా తనకు కోడలు కాబోతోందనీ—తన జీవితం యెప్పటికీ ఇదేవిధంగా వుండబోతోందనీ—తెలిస్తే—తల్లి ఇంట్లో సుఖశాంతులు లేకుండా చేస్తుంది.

అయితే వీటన్నిటి మధ్యా మాలతి అమాయకమైన చిరునగవు అతడికి గుర్తుకొస్తూనే వుంది.—"అర్హత లేకున్నా అది నీ అదృష్టం—" అన్న అనూరాధ హెచ్చరికా అతడి చెవుల్లో గింగురుమంటోంది.

—: అయిపోయింది: —

# టక్కరి దొంగ - చక్కని చుక్క

ప్రతాప రవిశంకర్

ఫ్లోరసెంట్ దీపాలు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. అక్కడక్కడా వున్న ఫాన్లు నెమ్మదిగా తిరుగుతున్నాయి.

బేంక్‌లో ఎక్కువగా మనుషులు లేరు.

ఈవెనింగ్ అవర్స్‌లో యెక్కువగా జనం వుండరు. రద్దీ బాగా తక్కువ.

అద్దాల్లోనించి రోడ్డుమీద రివ్వున దూసుకెళుతున్న మోటారు వాహనాలు కనపడుతున్నాయి. కాని—వాటి శబ్దం వినపడ్డంలేదు.

కేష్ కవుంటర్లో కూర్చున్న నీలిరంగు షర్టు వేసుకున్న మనిషి నోట్లకట్టలు నెమ్మదిగా లెక్కపెడుతున్నాడు.

ఎదురుగా కవుంటర్‌కి ఇవతల నిల్చుని వున్నాడు చక్రపాణి. ఆయన చేతిలో ఖరీదైన సిగరెట్టు వెలుగుతోంది.

పదినిమిషాలు గడిచాయి.

మూడు లక్షల ఇరవై వేల రూపాయలను లెక్క పెట్టి చక్రపాణికి ఇచ్చాడతను. మూడు లక్షలకీ వంద రూపాయల కట్టలే. ఇరవై వేలు ఛేంజ్ ....

సూట్కేసులో డబ్బును సర్దుకుంటూ "థాంక్స్.... సరిపోయింది" అన్నాడు చక్రపాణి.

"నో మెన్షన్" అన్నాడా ఉద్యోగి.

సూట్కేసుతో గ్లాసు డోర్ తెరుచుకుని బయటకు వచ్చాడు.

బాగా నే చీకటిపడింది.

వీధి దీపాలు వెలిగాయి.

రోడ్డుమీద జనం కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

రోడ్డు వారగా పార్కు చేసి వున్న కారు దగ్గరకు నడిచాడు. కార్లో కూర్చుని చక్రపాణి స్టార్టు చేస్తున్నప్పుడు కేష్ కవుంటర్లో కూర్చున్న ఉద్యోగి కొంచెం దూరంలో స్టాండుమీద వున్న ఫోన్ దగ్గరకు నడిచి ఏదో నెంబర్ కు డయల్ చేశాడు. అవతల యెవరో పలికారు. అతను ఒక్క క్షణం మాట్లాడి రిసీవర్ పెట్టేసి వచ్చి తన సీట్లో కూర్చున్నాడు.

అప్పటికే చక్రపాణి కారును ముందుకు దూకించాడు.

ఆ రోజు నాలుగో తారీకు.

ఐదవ తారీకున ప్రతి నెలా చక్రపాణి తన ఫ్యాక్టరీలో పనిచేసే ఉద్యోగులకు జీతాలిస్తాడు.

ఉదయం వేళలో బ్యాంక్ రద్దీగా వుంటుందని సాయంత్రం బ్యాంక్ కు వచ్చాడు చక్రపాణి.... నైట్ బ్యాంకింగ్ ఫెసిలిటీవున్న బ్యాంక్ శాఖ అది.

కారు నెమ్మదిగా వెళుతోంది.

రోడ్లు బాగా రద్దీగా వున్నాయి.

డ్రయివ్ చేస్తూ చేస్తూనే మరో సిగరెట్ వెలిగించాడు చక్రపాణి. వారం రోజులనించీ డ్రయివర్ సెలవులో వున్నాడు.

కారు ట్రాఫిక్ అంతగాలేని రోడ్డుమీదకు మళ్లింది.

నిర్జనంగా వుంది ఆ ప్రదేశం.

రోడ్డుకు రెండువైపులా దట్టంగా పెరిగిన చెట్లు వున్నాయి. వీధి దీపాలు దూరంగా యెక్కడో వెలుగుతున్నాయి.

కారు లైట్లు చీకట్లను చీలుస్తూ వున్నాయి.

వున్నట్టుండి ఎదురునించి రోడ్డుమీద ఎంబాసిడర్ కారు ప్రత్యక్షమయ్యింది. చక్రపాణి దానికి సైడు ఇవ్వబోయాడు. కాని ఆ కార్లో వున్న మనుషులు దాన్ని చక్రపాణి కారుకు ఎదురుగా తీసుకువచ్చారు.

సడన్ బ్రేకుతో కారును ఆపాడు చక్రపాణి.

ఆయనకు శరీరం వణికింది.

తను గొప్ప ప్రమాదంలో ఇరుక్కున్నట్టు ఆయనకు తెలిసిపోయింది.

ఎంబాసిడర్ ఆగి అందులో నించి ముగ్గురు యమకింకరుల్లా వున్న మనుషులు కిందకు దూకారు.

చక్రపాణి దగ్గరకు వచ్చారు.

ఇద్దరి చేతుల్లో పదునైన కత్తులు వున్నాయి. మూడోవాడు కారు డోర్‌ను బలంగా లాగాడు.

ఎవరు మీరు? అని చక్రపాణి వాళ్ళను అడగలేదు. ఎందుకంటే వాళ్ళు ఎవరో ఎందుకు వచ్చారో తెలుస్తూనే వుంది.

"కార్లోనించి దిగు" కర్కశంగా అన్నాడు ఒకడు కత్తిని వూపుతూ.

"ఆ సూట్కేసు ఇలా ఇవ్వు" రెండోవాడు క్రూరంగా చూస్తూ అన్నాడు.

చక్రపాణి వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ సూట్కేసును వాళ్ళకు ఇవ్వకపోతే తనని చంపి దాన్ని తీసుకు వెళతారు. అలాంటప్పుడు అవివేకంగా ప్రాణాలు పోగొట్టుకోవలసిన అవసరంలేదు.

అందుకే ఆయన దాన్ని అందుకున్నాడు.

అయితే చక్రపాణికి ఒక్కటే ఆశ్చర్యంగా వుంది. తను డబ్బుతో వస్తున్నట్టు వీళ్ళకెలా తెలిసింది? వెంటనే అర్థమయ్యింది.

బ్యాంక్ నించే తనని వెంటాడి వుంటారు.

తను గమనించలేదు.

చక్రపాణికి తనమీదే కోపం వచ్చింది.

లక్షల డబ్బును తీసుకువెళుతూ తను తగినంత కేర్ తీసుకోలేదు. తన నిర్లక్ష్యానికి ఇదే శిక్ష.

చక్రపాణి ఆలోచనలు చెదిరిపోయాయి.

కారు పక్కనే నిలబడిన ముగ్గురు గూండాలు కేచు మంటూ అరిచి దూరంగా పడిపోయారు.

మోటార్ సైకిల్ చప్పుడు వినపడుతోంది. ఎవరో యువకుడు దానిమీద వున్నాడు.

కిందపడిన ముగ్గురూ లేచి అతనిమీదకు వచ్చారు. అతను దిగకుండానే కాళ్ళతో వాళ్ళని తన్నాడు. మళ్ళీ దూరంగా పడ్డారు వాళ్ళు.

చక్రపాణి ఆశ్చర్యంగా అతడిని చూస్తున్నాడు. ఆయనకు ఓ సినిమా చూస్తున్నట్టుగా వుంది.

ఆ ముగ్గురూ అతనితో పోరాడలేకపోయారు. గబగబా కార్లోకి ఎక్కి రివ్వున దూసుకుపోయారు.

"ఎవరు నువ్వు? నీకెలా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలీటంలేదు" అన్నాడు చక్రపాణి ధైర్యంగా కార్లో నించి దిగి నిలబడి.

నవ్వాడతను.

"అన్యాయాన్ని, దోపిడీని నేను సహించలేను. అన్యాయం, దౌర్జన్యం యెక్కడ జరుగుతున్నా నేను దాన్ని ఎదుర్కొంటాను" అన్నాడు.

"నీ పేరు?" చక్రపాణి అడిగాడు.

"ఆనంద్."

"ఏం చేస్తున్నావు?"

"శ్రీకాంత్ ఆటోమొబైల్ ఇంజనీరింగ్ కంపెనీలో పనిచేస్తున్నాను."

"ఇలా రోడ్డుమీదనే నీతో మాట్లాడటం న్యాయం కాదు. మా ఇంటికి వెళదాం."

అతను నవ్వి "ఇంకా మీకు ఆ గూండాల గురించి భయంగా వుందా?" అనడిగాడు.

"అవును. మళ్ళీ ఎక్కడైనా వాళ్ళు నన్ను ఎదుర్కోవచ్చు. అంతే కాదు. నువ్వు మా ఇంటికి రావాలి.... నా డబ్బును, ప్రాణాలను కాపాడిన నిన్ను నా కుటుంబ సభ్యులకు పరిచయం చెయ్యాలి."

"మీ కోరికను కాదనలేక పోతున్నాను—పదండి" అన్నాడు ఆనంద్ మోటార్ సైకిలును స్టార్టు చేస్తూ—

ఒక్క నిమిషం తర్వాత చక్రపాణి కారు ముందుకు కదిలింది. ఆ వెనుకే ఆనంద్ కారును అనుసరించాడు తన వాహనంమీద.

# 2

సినిమా హీరోలా వున్నాడు—అనుకుంది రాధ—ఆనంద్‌ను చూడగానే.

ఆమె చక్రపాణి కూతురు. వయసు ఇరవై. బియ్యే చదువుతోంది. ఆమె అందం అపురూపమైనది.

చక్రపాణి అతన్ని తన భార్యకీ కూతురుకీ పరిచయం చేశాడు. ఆనంద్ సాహసం గురించి కూడా ఆయన వాళ్ళకి చెప్పాడు.

అప్పుడు రాధ మిలమిల మెరిసే కళ్ళతో అతనికి కృతజ్ఞతలు చెప్పుకున్నది.

ఓ పదినిమిషాలు ఆ ముగ్గురూ ఆనంద్‌ని అభినందించారు. ఆ తర్వాత అతను వెళ్ళిపోతానని చెప్పాడు.

కాని—ఆ ముగ్గురూ అందుకు ఒప్పుకోలేదు.

"పెళ్ళి కాలేదని — ఒంటరిగానే వుంటున్నానని చెప్పావు. అలాంటి నీకు ఈ రాత్రి ఎక్కడ గడిపినా ఒక్కటే. అందుకు నువ్వు ఈ రాత్రి మా ఆతిథ్యం పొంది ఇక్కడే నిద్రపోక తప్పదు" అన్నాడు.

ఆయన భార్యకూడా అలాగే అన్నది.

తల్లిదండ్రులను సపోర్టు చేసింది రాధ.

వాళ్ళ బలవంతంమీద ఆ రాత్రి అక్కడే వుండి పోవటానికి ఒప్పుకున్నాడు ఆనంద్.

తొమ్మిది గంటలు అవుతున్నప్పుడు నలుగురూ భోజనాలు చేశారు. మరో గంటసేపు రాధ టేప్ రికార్డర్‌లో తను పాడి రికార్డు చేసిన పాటలను అతనికి వినిపించింది.

ఆనంద్ ఆ పాటలు విని ఆమెను మెచ్చుకున్నాడు.

చక్రపాణి వెళ్ళి పడుకున్నాడు.

ఆయన భార్య లేచి నిల్చుని "పదిగంటలు దాటింది. ఇంక పడుకో....అతనుకూడా నిద్రపోతాడు" అన్నది కూతురుతో.

అయిష్టంగానే తల్లితో వెళ్ళిపోయింది రాధ.

భోజనాలు అవటంతోనే ఆనంద్ కి ఏ గదిలో పడక ఏర్పాటు చేసిందీ చెప్పాడు చక్రపాణి.

ఆనంద్ ఆ గదిలోకి వెళ్ళిపోయాడు.

ఫోం బెడ్ మెత్తగా వుంది.

ఆ గదిలో రంగు రంగుల తైలవర్ణ చిత్రాలు వున్నాయి. వాటిల్లో ఏటి ఒడ్డున కూర్చున్న యువతి బొమ్మ అతడికి బాగా నచ్చింది.

ఆ యువతి రాధలా వుంది.

అతను కళ్ళు మూసుకున్నాడు. ఏవో ఆలోచనలు అతని మెదడులో గిర్రున తిరుగుతున్నాయి.

చాలా సేపటివరకూ అతను అసహనంగా గడిపాడు. ఏదో గదిలోనించి గడియారం పన్నెండుగంటలు కొట్టింది.

ఆనంద్ చేతికి వున్న గడియారంలో టైము తెలుస్తున్నా అతను ఆ గంటలను లెక్కించాడు.

బెడ్ మీదనించి లేచాడు ఆనంద్.

ప్యాంటు జేబులోనించి మత్తుమందు వున్న సీసా తీశాడు. అందులో ద్రవాన్ని కర్చీఫ్ మీదకు వంచాడు.

గదిలోనించి బయటకు వచ్చి చక్రపాణి పడుకున్న గది దగ్గరకు వెళ్ళాడు.

నెట్టగానే తెరుచుకుంది తలుపు.

నవ్వుకున్నాడు ఆనంద్.

ఓ హీరో ఇంట్లోనే వున్నాడని బోల్టు వేసుకోకుండా పడుకున్నాడు-యెంత ధైర్యం.

కాని—ఈ హీరో ఓ దొంగని తెలిస్తే?

పిల్లిలా లోపలకు నడిచాడు.

రెండు నిమిషాల్లో చక్రపాణికి స్పృహతప్పించాడు. దిండుకింద వున్న ఐరన్ సేఫ్ కీస్ తీసుకున్నాడు.

పక్కనే వున్న గదిలో చక్రపాణి భార్య, రాధ నిద్రపోతున్నారు. ఆ గదిలోనే ఐరన్ సేఫ్ కూడా వుంది.

ఆనంద్ ఆ గదిలోకి ప్రవేశించాడు.

డబుల్ కాట్ మీద ఇద్దరూ పడుకున్నారు. వెల్లకింతలా పడుకుంది రాధ. నిద్రలో ఆమె గుండెలు చిన్నగా ఎగిరిపడుతున్నాయి.

ఆమెకూడా స్పృహ పోగొట్టిన తర్వాత రెండు నిమిషాలు రాధ అందాన్ని చూస్తూ అక్కడే నిలబడి పోయాడు.

ఆ తర్వాత తన కర్తవ్యం గుర్తొచ్చింది.

క్షణాలమీద సేఫ్ తెరిచాడు.

అందులో సూట్కేసు కనిపించింది. దాన్ని తెరిచాడు. మూడు లక్షల ఇరవై వేలు వున్నాయి. సేఫ్‌లో మరో యాభై వేలు కేష్ వుంది. బంగారం వుంది. అంతా సూట్కేసులో సర్దుకున్నాడు ఆనంద్.

సేఫ్‌ను మూసి మరోసారి రాధ అందాన్ని చూసి బయటకు వచ్చాడు. తిరిగి చక్రపాణి గదిలోకి వెళ్ళి తాళంచెవులను ఆయన దిండుకిందనే వుంచాడు.

సూట్కేసుతో తన గదికి వచ్చాడు. కిటికీలోనించి బయటకు గేటుకేసి చూశాడు.

గూర్ఖా కునికిపాట్లు పడుతున్నాడు.

వాడ్ని స్పృహ తప్పించటం సమస్యకాదు.

ఐదునిమిషాల తర్వాత ఆనంద్ కిందకు దిగివచ్చాడు.

పోర్టికోలోనే కారు ఆగి వుంది.

దాని పక్కనే మోటార్ సైకిలు వుంది.

సూట్కేసు మోటార్ సైకిలుమీద వుంచి కారు పక్కగా ఒంగి నడిచి క్రోటన్ మొక్కల వెనక్కు వెళ్ళాడు.

మొక్కల వెనుకే నడుస్తూ గూర్ఖా వెనకవైపు చేరుకున్నాడు. సన్నగా గుర్రు పెడుతున్నాడు గూర్ఖా.

మత్తుమందు కర్చీఫ్‌తో వాడికి స్పృహ తప్పించి మొక్కల వెనక్కు లాగాడు.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది.

ఎక్కడో దూరంగా వంతెనమీద రైలు నెమ్మదిగా వెళుతున్న చప్పుడు వినపడుతోంది.

గేటు తెరిచాడు ఆనంద్.

మోటార్ సైకిలును స్టార్టు చెయ్యకుండా నడిపించుకు వచ్చి గేటు దాటించాడు. తర్వాత గేటుమూసి కొంత దూరం వెళ్ళిన తర్వాత మోటార్ సైకిలును స్టార్టుచేశాడు.

## 3

అందరికంటే ముందు రాధకి మెలకువ వచ్చింది. బెడ్ మీద నించి లేవగానే ఆమెకు ఆనంద్ గుర్తుకు వచ్చాడు.

అతడిని చూడాలనిపించింది. వెంటనే అతని గదిలోకి వెళ్ళింది.

ఖాళీగా వున్న బెడ్ కనిపించింది.

ఆమెకు ఆశ్చర్యం కలిగింది. ఎవరికీ చెప్పకుండా ఆనంద్ వెళ్ళిపోయాడా? అలా ఎందుకు వెళ్ళాడు?

ఆనంద్ వెళ్ళివుంటే తప్పక గూర్ఖా చూసి వుంటాడు అతన్ని.

రాధ మెట్లు దిగి కిందకు వెళ్ళింది. గేటు దగ్గర గూర్ఖా కనిపించలేదు. ఇంకొంచెం పరిశీలనగా చూసిన తర్వాత బోర్లా పడుకుని క్రోటన్ మొక్కల వెనగ్గా గూర్ఖా కనిపించాడు.

అతడిని లేపింది.

గూర్ఖా లేచి కంగారుగా ఆమెను చూశాడు.

"ఇదా నువ్వు చేస్తున్న ఉద్యోగం?" కోపంగా అడిగింది.

"క్షమించండమ్మా...." అంటూ రాత్రి ఎవరో తనకి మత్తుమందుతో స్పృహ పోగొట్టినట్టుగా చెప్పాడు.

"ఆనంద్ మోటార్ సైకిలుమీద వెళ్ళటం నువ్వు చూడలేదా?"

"లేదు."

రాధ మనసు కీడు శంకించింది.

వెంటనే రివ్వున లోపలకు పరుగుదీసింది.

తండ్రినీ—తల్లినీ నిద్ర లేపింది.

ఆయన లేస్తూనే "ఏం జరిగింది?" అనడిగాడు.

చెప్పింది.

"వాట్! గూర్ఖాను ఎవరో స్పృహ తప్పించారా?"

"అవును డాడీ.... ఆనంద్ ఇంట్లో లేడు. వెళ్ళిపోయాడు."

ఏదో గుర్తుకు వచ్చి చక్రపాణి దిండు పైకెత్తి చూశాడు. కీస్ అలాగే వున్నాయి.

గబగబా వాటిని తీసుకువెళ్ళి ఐరన్ సేఫ్ తెరిచాడు.

"మైగాడ్!" కెవ్వున అరిచాడు.

సూట్కేసులేదు.

ఆ తర్వాత అందులో వున్న డబ్బు, నగలు పోయినట్టు

తెలుసుకున్నాడు.

"మనం మోసపోయాం" అన్నది ఆయన భార్య.

"అవును. మనింటికి వచ్చిన మనిషి హీరో కాదు. ఆ వేషంలో వున్న దొంగ" అన్నది రాధ.

అలా అంటున్నప్పుడు ఆమె కళ్ళముందు ఆనంద్ రూపం కదిలింది. ఎందువల్లనో అతనిమీద ఆమెకు కోపం రాలేదు.

"డామిట్ .... చాలా తెలివిగా నన్ను చీట్ చేశాడు" అన్నాడు చక్రపాణి అక్కడే కూలబడి.

"ఇంకా ఆలోచిస్తారేమిటి? ముందు పోలీసులకు ఫోన్ చెయ్యండి" అన్నది భార్య.

ఆయన నీరసంగా లేచి వెళ్ళి ఫోన్ అందుకున్నాడు.

పోలీసుస్టేషన్‌కు డయల్ చేశాడు.

## 4

క్రితం రోజు సాయంత్రంనించీ ఉదయం వరకూ జరిగింది చెప్పాడు చక్రపాణి.

"అంతా సినిమాలో జరిగినట్టుగా వుంది. నో డౌట్. అతనే దొంగ" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మహేంద్ర.

"ఇప్పుడు నాకు అనిపిస్తోంది ఇన్‌స్పెక్టర్ .... సాయంత్రం ముగ్గురు గూండాలు నన్ను బెదిరించటం కూడా ఇందులో పార్టు ఐవుంటుంది" అన్నాడు చక్రపాణి.

"యస్. తప్పకుండా. ఇదంతా ఓ పెద్ద ముఠా.... వాళ్ళు చాలా తెలివిగా ఇలాంటి దొంగతనాలు చేస్తారు. ఇలాంటి టక్కరి దొంగలు ఆ ముఠాలో చాలామంది వుంటారు. ఇంతకీ అతనెలా వుంటాడో వర్ణించి చెప్పండి."

చక్రపాణి — ఆనంద్‌ని చాలా క్లియర్‌గా వర్ణించి

చెప్పాడు. అన్నీ నోట్ చేసుకున్నాడు మహేంద్ర.

"అతను ఉపయోగించిన మోటార్ సైకిలు నెంబర్ చెప్పండి."

"సారీ.... నేను గమనించలేదు."

ఎన్ని లక్షలు పోయాయో ఇన్‌స్పెక్టర్‌కు చెప్పాడు చక్రపాణి. రిపోర్టు రాసి ఇచ్చాడు.

"ఒక్క విషయం వండర్‌గా వుంది. మీరు లక్ష రూపాయలు బేంక్‌నించి డ్రా చేసి తీసుకు వస్తున్నట్టు అతనికెలా తెలుసు?" అడిగాడు మహేంద్ర.

"ఇలాంటి దొంగలు బేంక్ దగ్గరే వుండి పెద్ద మొత్తాల్లో డబ్బు డ్రా చేసేవాళ్ళను గమనిస్తూ వుంటారని నా ఉద్దేశం."

"అంతేనంటారా? బేంక్‌లో ఎవరైనా ఆ ముఠాకు సంబంధించిన ఉద్యోగి వున్నాడేమో."

"ఏమో! నాకు తెలీదు."

"ఆల్‌రైట్. మిగిలిన విషయాలు నేను దర్యాప్తు చేసి తెలుసుకుంటాను. రాత్రి అతను ఉపయోగించిన వస్తువులను మీరు కదల్చకండి. నేను వేలిముద్రల నిపుణుడ్ని పంపుతాను. ఆ దొంగను పట్టుకోటానికి వేలిముద్రలు ఉపయోగపడవచ్చు" అని చెప్పి ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు.

# 5

హోటల్ డ్రీమ్ ఫ్లవర్ —

రంగు రంగుల దీపాలతో అలంకరించబడి వుంది.

రకరకాల కార్లతో కాంపౌండ్ నిండిపోయి వుంది.

టాక్సీల్లో, ఆటోరిక్షాల్లో రంగు రంగుల దుస్తులు ధరించిన మనుషులు దిగుతున్నారు.

ఆ రోజు జానకీదేవి బర్త్‌డే పార్టీ హోటల్ డ్రీమ్ ఫ్లవర్‌లో జరుగుతోంది. డ్రీమ్ ఫ్లవర్ నగరంలో వున్న ఫైవ్ స్టార్ హోటళ్ళన్నింటిలో మరింత కాస్ట్లీ హోటల్.

జానకీదేవి కోటీశ్వరుడు భవానీ ప్రసాద్ భార్య. ఆమెకు యాభై యేళ్ళు నిండుతున్నా ముప్పయ్అయిదేళ్ళ మనిషిలాగే వుంది.

ఆమె భర్తతో కలసి ఎంట్రన్స్ దగ్గరే నిలబడి అతిథులను రిసీవ్ చేసుకుంటోంది.

లోపల అతిథులంతా ఒకరితో ఒకరు జంటలుగా నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు పానీయాలు సేవిస్తూ.

సన్నని మ్యూజిక్ నెమ్మదిగా వినిపిస్తోంది.

టాక్సీ డ్రీమ్ ఫ్లవర్ ముందు ఆగింది.

అందులోనించి డ్రీమ్ గర్ల్‌లాంటి ఇరవై యేళ్ళలోపు వయసున్న చక్కనిచుక్క దిగింది.

హేండ్ బ్యాగ్ తెరిచి డబ్బుతీసి ఫేర్ చెల్లించి హోటల్లోకి నడిచింది వయ్యారంగా.

అధునాతనంగా అలంకరించుకుంది.

ఎర్రటి ఆమె పెదవులు ఆహ్వానిస్తున్నట్టున్నాయి. ఆమె కళ్ళు మత్తుగా, ఆమె చూపులు మగవాళ్ళను కవ్విస్తున్నట్టుగా వున్నాయి.

ఆమె చేతిలో బుకే వుంది.

"విష్‌యు మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అని చిరునవ్వులు చిందిస్తూ జానకీదేవికి బుకే అందించింది ఆమె.

"థాంక్ యూ" అన్నది జానకీదేవి కృతజ్ఞతగా.

ఆమె ఎవరో జానకీదేవికి తెలీదు. కాని తన కుమార్తె

స్నేహితురాలు అయివుంటుందని అనుకున్నది.

భవానీప్రసాద్ ఆమె అందాన్ని కళ్ళతోనే ఆస్వాదించాడు.

ఆమె ముందుకు వెళుతూ ఒక్కసారి జానకీదేవి మెళ్లో వున్న రత్నాల హారాన్ని చూసింది.

వాళ్ళని దాటి వెళ్ళిపోయింది.

అంతా ఆమెకు కొత్తవారే .... ఐనా ఒక్కసారి అందరినీ కలియజూసింది. ఎవ్వరూ పరిచయస్తులుగా కనిపించలేదు.

తేలిగ్గా గాలి పీల్చుకుంది.

ఒకచోట నిలబడిందామె.

బాయ్ ట్రేలో డ్రింకులు తీసుకువచ్చి ఆమె ముందు వినయంగా నిల్చున్నాడు.

ఓ బాటిలును తీసుకుంది.

స్ట్రాతో నెమ్మదిగా పీలుస్తూ సంగీతం వింటోంది.

ఎంతోమంది మగవాళ్ళ కళ్ళు తనమీద వున్నాయని ఆమెకు తెలుసు.

వాచీ చూసుకుంది.

ఎనిమిది గంటలు కావస్తోంది.

సంగీతంలో వేగం పెరిగింది.

అతిథులంతా రావటం ఆగిపోయిన తర్వాత జానకీదేవి బర్తుడే కేక్‌ను కట్ చేసింది కొవ్వొత్తులను ఆర్పి.

అంతా చప్పట్లు కొట్టారు.

"హేపీ బర్తుడే టూయూ__" అంటూ రాగాలు తీశారు.

ఓ పక్కగా నిలబడి అందరినీ గమనిస్తోంది ఆమె__ తర్వాత ఓ సాంస్కృతిక కార్యక్రమం మొద

లయ్యింది.

క్లాసిక్ డాన్స్—

అతిథులంతా కుర్చీల్లో కూర్చున్నారు.

ముందు వరుసలో భవానీప్రసాద్—జానకీదేవి కూర్చు న్నారు. జానకీదేవికి సరిగ్గా వెనుక ఆ చక్కని చుక్క కూర్చుంది.

నృత్యం జరుగుతోంది.

రంగు రంగుల దీపాలకాంతి ఆమె హావభావాలకు అనుగుణంగా ఆ నర్తకీమణిమీదకు ఫోకస్ చెయ్యబడు తోంది.

ఆసక్తిగా చూస్తున్నారు అంతా—

కాని—ఆమె ఆ నృత్యాన్ని చూడటంలేదు. జానకీదేవి మెడలో వున్న రత్నాలహారాన్నే చూస్తోంది.

నిమిషాలు గడుస్తున్నాయి.

నెమ్మదిగా హేండు బ్యాగ్‌లోనించి ఏదో వస్తువును తీసి చిన్నగా కిందికి వదిలింది. దాన్ని కాలితో చిన్నగా జానకీదేవి కాళ్ళకిందకు నెట్టింది.

మూడు నిమిషాలు గడిచాయి.

ఉన్నట్టుండి కెవ్వున అరిచి వెనక్కు విరుచుకు పడింది జానకీదేవి.

"ఏమయ్యింది?" భ వా నీ ప్ర సా ద్ అడిగాడు కంగారుగా.

అంతా ఒక్కసారిగా నిల్చున్నారు.

"పాము....పాము" అరుస్తోంది ఆమె—

కొంతమంది భయంగా కుర్చీలమీదకు యెక్కి నిల బడ్డారు. ఒకరిమీద ఒకరు పడ్డారు.

నృత్యం ఆగిపోయింది.

ఎవరో కిందికి ఒంగిచూశారు.

రబ్బరు పాము కనిపించింది. అది నిజమైన పాములాగే వుంది చూడగానే.

ఒక యువకుడు దాన్ని పైకెత్తి పట్టుకొని "భయ పడకండి.. ఇది రబ్బరు పాము" అన్నాడు పెద్ద హీరోలా.

"రబ్బరు పామును ఎవరు తీసుకువచ్చారు?"

"ఎవడో అల్లరిబాబు తీసుకువచ్చి వుంటాడు. దయ చేసి అంతా కూర్చోండి" అన్నాడు భవానీప్రసాద్.

కూర్చున్నారు.

నృత్యం మొదలైంది.

"నిజంగా పాము అనే అనుకున్నాను. చాలామందిని భయపెట్టాను" అన్నది జానకీదేవి భర్తతో—

"ఇట్సాల్ రైట్ .... డాన్స్ చూడు" అన్నాడు ముందుకు చూస్తూ—

మరో ఐదునిమిషాలు గడిచాయి.

మళ్ళీ కెవ్వున అరిచింది జానకీదేవి.

"మళ్ళీ పాము వచ్చిందా?" ఎవరో వెనుకనించి పరి హాసంగా అడిగారు.

"కాదు.... నా రవ్వల హారం పోయింది" కంపిస్తున్న గొంతుతో అన్నది జానకీదేవి.

అంతా బిగుసుకు పోయారు.

"మై గాడ్ .... ఇటీజ్ టూ మచ్" అన్నాడు భవానీప్రసాద్ భార్య మెడకేసి చూస్తూ.

మళ్ళీ నృత్యం ఆగిపోయింది.

"ఎలా పోయింది? ఎప్పుడు పోయింది?" ఎవరో అడిగారు.

భవానీప్రసాద్ జవాబు చెప్పలేదు.

గబగబా ఫోన్ దగ్గరకు నడిచాడు. పోలీసులకు ఫోన్ చేశాడు.

ఐదునిమిషాలు మాట్లాడి తిరిగివస్తూ "క్షమించండి.... దయచేసి యెవ్వరూ వాళ్ళ సీట్లలోనించి కదలొద్దు.... కొంచెంసేపట్లో పోలీసులు వస్తారు. నాలుగు లక్షలు విలువచేసే రత్నాల హారం పోయింది. ఇలా జరిగినందుకు చింతిస్తున్నాను" అన్నాడు.

నిశ్శబ్దం.

నృత్యం ఎప్పుడో ఆగిపోయింది.

భయంగా ఒకరినొకరు చూసుకున్నారు.

హాలునిండా దీపాలు వెలుగుతున్నాయి.

హోటల్ మేనేజర్ పరిగెత్తుకుంటూ వచ్చాడు. భవానీప్రసాద్‌తో యేదో మాట్లాడాడు.

ఆయన విసుక్కున్నాడు.

"మీ హోటల్లో ఇలా జరుగుతుందని అనుకోలేదు" అన్నాడాయన.

"ఐయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ....వచ్చిన అతిథులంతా గౌరవ మర్యాదలు కలవాళ్ళు....అలాంటి వాళ్ళలో దొంగలు కూడా వుంటారని ఎవరు వూహించగలరు?" అన్నాడు నొచ్చుకుంటూ—

గుసగుసలు వినిపిస్తున్నాయి.

బయట పోలీసు జీపు ఆగింది. ఇన్‌స్పెక్టర్ మహేంద్ర కొంతమంది కాన్‌స్టేబుళ్ళ లోపలకు వచ్చారు.

ఇన్‌స్పెక్టర్‌కు ఎదురు వెళ్ళాడు మేనేజర్.

వస్తూనే ఎంట్రెన్స్ దగ్గర నలుగురు కాన్‌స్టేబుల్స్‌ను వుంచాడు మహేంద్ర.

భవానీప్రసాద్ — మహేంద్రతో కొన్ని నిమిషాల క్రితం జరిగిన సంఘటన గురించి చెప్పాడు. ఆ రబ్బరు పామును కూడా చూపించాడు.

"జానకీదేవిగారి వెనుక యెవరు కూర్చున్నారు?" అడిగాడు యిన్స్పెక్టర్.

చూశాడు ఆయన.

ఆ చుక్కని చుక్క కూర్చున్న కుర్చీ ఖాళీగా వుంది.

"ఇక్కడ కూర్చున్న అమ్మాయి యేమయ్యింది?" అడిగాడాయన ఆ పక్కనే వున్న ఇద్దరు వయసుమళ్ళిన స్త్రీలను.

"రబ్బరు పాము గొడవ జరిగినప్పుడు వెళ్ళిపోయింది. ఆ తర్వాత రాలేదు."

"ఐతే ఆమే ఆ హారాన్ని కాజేసివుంటుంది" అన్నది జానకీదేవి

"అవును. సందేహంలేదు" అన్నాడు భవానీప్రసాద్.

"ఎవరామె? ఎలా వుంటుంది? మీకు తెలుసా?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"ఎవరో తెలీదు. అందంగా వుంది. ఒంటరిగానే వచ్చింది" అంటూ ఆమె అందాన్ని వర్ణించి చెప్పాడు భవానీప్రసాద్.

"ఈ సంఘటనతో నా పరువు కొంత పోయింది. ఇలా జరుగుతుందనుకుంటే ఆ రత్నాల హారాన్ని బయటకు తీసేవాళ్ళం కాదు. నాలుగు లక్షల ఖరీదు చేస్తుంది."

"వర్రీ అవకండి .... ఎక్కడ వున్నా ఆ హారాన్ని సంపాదించే తీసుకొస్తాను."

"థాంక్స్" అన్నాడు భవానీప్రసాద్.

సోదా చెయ్యబడి బయటకు వెళుతున్న గౌరవనీయు

లైన అతిధులను అనుమానంగా చూస్తోంది జానకీదేవి.

అప్పటికే చక్కని చుక్క గూటికి చేరుకుంది.

# 6

రాధ కారు డ్రయివ్ చేస్తోంది, ఆమె పక్కనే ఆమె క్లోజ్ ఫ్రెండ్ శకుంతల కూర్చుని వుంది. వెనుక సీట్లో మరో ఇద్దరు ఫ్రెండ్స్ కూర్చుని బయటకు చూస్తున్నారు.

పరిసరాలు దాటిపోతున్నాయి.

నగరానికి ఇరవై కిలోమీటర్ల దూరంలో వున్న ఓ ఊళ్ళో ఓ స్నేహితురాలి మేరేజ్ డే పార్టీకి వెళ్ళి తిరిగి వస్తున్నారు.

చీకటి పడబోతున్నది.

రోడ్డుకు రెండువైపులా పచ్చని పొలాలు అక్కడక్కడ ఎత్తుగా పెరిగిన చెట్లు—పొదలు కొంచెం దూరంలో కొండలు ఎత్తుగా కనపడుతున్నాయి.

ప్రకృతి అందాల గురించి మాట్లాడుకుంటున్నారు వాళ్ళు. అప్పటికి వాళ్ళు పదికిలోమీటర్లు ప్రయాణం చేశారు.

రోడ్డు సరిగా లేకపోవటంతో నెమ్మదిగా నడుపుతోంది రాధ కారును.

"ఇంత స్వచ్ఛమైన గాలిని నగరంలో మనం పొందలేం" అన్నది శకుంతల.

"అవును. నగర వాతావరణం కలుషితమైనది" అన్నది రాధ.

"ఇంతకీ మీ ఇంట్లో లక్షలు దోచుకుపోయిన దొంగ ఆచూకీ ఏమైనా తెలిసిందా?" అడిగిందో స్నేహితురాలు అప్పుడే గుర్తుకు వచ్చి.

"లేదు....ఇన్స్పెక్టర్ మహేంద్ర ఎలాగైనా ఆ

దొంగను పట్టుకుంటానని గట్టిగా చెబుతున్నాడు. 'టక్కరి దొంగ' శీర్షికతో పేపర్లో వచ్చిన మా ఇంట్లో దొంగతనం కేసు చాలామందిని ఆశ్చర్యంలో ముంచింది" అన్నది రాధ డ్రయివ్ చేస్తూ—

"అవును. ఈ రోజు పేపర్లో 'చక్కని చుక్క చోరీ' అనే పేరుతో వచ్చిన ఇంకో వార్త చదివావా?" అడిగింది శకుంతల.

"చదివాను. అందమైన అమ్మాయి నాలుగు లక్షలు ఖరీదు చేసే రత్నాల హారాన్ని కోటీశ్వరుడి భార్య మెళ్ళో నించి కొట్టేసిందిట."

"చిత్రమైన దొంగతనాలు .... దేశంలో దొంగలు ఎక్కువైనారు" ఓ యువతి అన్నది భయంగా.

ఆమె అలా అన్నప్పుడే వున్నట్టుండి ఎంబాసిడర్ కారు వేగం తగ్గిపోయి ఆగిపోయింది.

"ఏమయ్యింది?" అడిగింది శకుంతల.

"ఏమో!" అని మళ్ళీ స్టార్టు చేసింది.

బరబరమని చప్పుడయ్యింది కాని స్టార్టుకాలేదు.

కొంచెంసేపు ప్రయత్నించి కారు దిగింది రాధ.

ఆమెతో వాళ్ళుకూడా దిగారు.

బోనెట్ పైకెత్తి వంగి లోపలకు చూసింది.

ఆమెకు ఏమీ అర్థంకాలేదు.

"నీకు రిపేర్ తెలుసా?"

"నా మొహం .... డ్రయివింగ్ ఒక్కటే తెలుసు. మైనర్ రిపేర్ కూడా తెలీదు. ఐనా ఈ కారు ఇలా ఆగి పోతుందని ఎవరనుకున్నారు?" అన్నది విసుగ్గా.

"ఇప్పుడేమిటి చెయ్యటం?"

"డాన్స్" నవ్వుతూ అన్నది.

మిగిలినవాళ్లు కూడా వచ్చారు.

చీకట్లు ముసురుకుంటున్నాయి.

దూరంగా చెట్లమీద ఏవో పిట్టలు పెద్దగా అరుస్తున్నాయి.

సరిగ్గా అప్పుడే ఏదో మోటార్ సైకిల్ వెనుకవైపు నించి వస్తున్న చప్పుడు వినపడింది.

నలుగురూ వెనక్కు తిరిగి చూశారు.

దూరంనించి వస్తున్న మోటార్ సైకిలు దగ్గరవుతోంది.

"ఎవరో వస్తున్నారు. అతనికి కారు మెకానిజం తెలిస్తే బావుండు" అన్నది రాధ.

మోటార్ సైకిలు దగ్గరకు వచ్చి ఆగిపోయింది. దాని మీద ఓ ముప్పయ్యేళ్ళ యువకుడు వున్నాడు.

నల్లటి ప్యాంటులో ఎర్రటి టీ షర్టు టక్ చేశాడు. సన్నని మీసాలు....కొంచెం గుబురుగా పెరిగిన గడ్డం. కళ్ళకు పలుచని తెల్లని ప్రొటెక్షన్ అద్దాలు.

"ఏమయ్యింది? ఎనీ ట్రబుల్?" అడిగాడు.

అతడినే చూస్తోంది రాధ.

అందంగా వున్నాడు.

"అవును. కారు ఆగిపోయింది. ఏదో చిన్న ట్రబుల్. మీకు మెకానిజం తెలిస్తే ఒకసారి చూడండి" అన్నది శకుంతల.

"ఏమిటే అలా అయిపోయావ్?" అన్నది ఓ ఫ్రెండ్ రాధని.

"ఏమీ లేదు. ఈయన్ని యెక్కడో చూసినట్టు వుంటేనూ" అన్నది రాధ.

"నన్నా .... భలేవారే .... ఏ కాలేజీలోనో చూసి వుంటారు."

"మీరు మ్యూజెంటా?!" అడిగింది.

"అవును. లైఫ్ మ్యూజెంటును."

"అదేమిటి? అదో కోర్సు వుందా?"

"వుంది. అదే జీవితం" నవ్వేడు.

"గుడ్ జోక్...." అంతా నవ్వారు.

కాని రాధ నవ్వలేదు.

అతను లోపలకు ఒంగి పరీక్షగా చూశాడు.

ఐదునిమిషాలు గడిచాయి.

చిన్నగా నిట్టూర్చాడు. అలా నిట్టూరుస్తూనే తలతిప్పి రాధని చూశాడు.

ఆమె అతడినే చూస్తోంది.

"కాంపిటీని నేను నిజంగానే మీకు తెలుసా?" నవ్వుతూ అడిగాడు.

ఆమె కంగారుపడి "తెలుసున్న మనిషనే అనిపిస్తోంది" అన్నది.

"ఊ....ఇప్పుడు స్టార్టు చెయ్యండి."

రాధ కార్లో కూర్చుని స్టార్టు చేసింది.

బరబర చప్పుడుతో స్టార్టు అయ్యింది.

అమ్మాయిలు సంతోషంతో అరిచారు.

కాని రాధ అరవలేదు—సంతోషంతో.

అతడి ఎడమ కణతమీది నల్లని పుట్టుమచ్చ ఆమెకు పరిచయమైనదిగా అనిపిస్తోంది.

హటాత్తుగా గుర్తొచ్చింది.

అవును. ఆనంద్!

మై గాడ్! ఇతను ఆనందేనా??

కిందికి దిగింది.

"మీరు ఆనంద్‌లా వున్నారు" అన్నది గబుక్కున.

"ఆనంద్ ఎవరు? మీ బాయ్ ఫ్రెండా?" అడిగాడతను నవ్వుతూ—

వాళ్ళు నవ్వారు.

"కాదు. ఒక దొంగ...."

"చంపేశారు. ఒక దొంగకీ నాకూ పోలికలా.... కొంపతీసి పోలీసులకు పట్టించేరు" అన్నాడు జేబులోంచి సిగరెట్ పాకెట్ - లైటర్ బయటకుతీస్తూ-

సరిగ్గా అప్పుడే అతని జేబులోనించి ఓ చిన్న కార్డు కిందపడటాన్ని రాధ గమనించింది.

సిగరెట్టు వెలిగించుకొని "ఓకె....బై....జాగ్రత్తగా వెళ్ళండి. చీకటిపడుతోంది. అంతా అందమైన అమ్మాయిలు" అంటూ అతను మోటార్ సైకిలును స్టార్టు చేసి రివ్వున ముందుకు దూకించాడు.

"థాంక్యూ యంగ్ మాన్" అరిచారు ముగ్గురు అమ్మాయిలు వెనకనించి.

కార్లో ఎక్కి స్టార్టుచేసింది రాధ మౌనంగా. వాళ్ళు కూడా ఎక్కారు.

పక్కనే వున్న హాండ్ బాగ్ అందుకొని అందులో చిన్న స్లిప్ తీసి బాల్ పెన్‌తో 'ఎమ్.జడ్.ఎక్స్. 4114' అని రాసింది

"ఏమిటే రాస్తున్నావ్?"

"అతను ఎక్కి వెళుతున్న మోటార్ సైకిలు నెంబరు."

"ఎందుకు?"

"ఎందుకంటే మా ఇంట్లో లక్షలు కాజేసిన టక్కరి దొంగ ఆనంద్ అతనే."

ఒక్కసారి భయంతో నోరు తెరిచారు వాళ్ళంతా.

"రియల్లీ" అన్నది శకుంతల.

"నిజం....అతన్ని నేను గుర్తించాను. కాని అతను ప్రస్తుతం ఆ గడ్డాన్ని అతికించుకొని తన వేషాన్ని మార్చుకున్నాడు" అంటూ నే డోర్ తెరుచుకొని గబుక్కున కిందకు దిగింది.

ఒక్క నిమిషం వెతికి కిందనించి చిన్న కార్డును తీసింది.

"ఏమిటి?"

అతని జేబులోనించి కిందపడింది.

దానిమీద ఏదో అడ్రసు వుంది.

"మనం త్వరగా వెళ్ళాలి....ఎలాగైనా అతడిని పోలీసులకు పట్టించాలి" అంటూ యాక్సిలేటర్‌ను నొక్కింది రాధ.

ముందుకు దూకింది కారు.

ఇరవై నిమిషాల్లో రాధ కారును ఇంటిముందు ఆపి గబగబా లోపలకు పరిగెత్తింది.

చక్రపాణి భార్యతో మాట్లాడుతున్నాడు.

తండ్రితో జరిగినదంతా చెప్పింది.

"ఏమిటీ....నువ్వు ఆనంద్‌ను చూశావా?"

"అవును డాడీ - అతను మారువేషంలో వున్నాడు. ఐనా నేను గుర్తుపట్టాను. ఇదిగో అతని మోటార్ సైకిలు నెంబర్ నోట్ చేసుకున్నాను."

"గుడ్ .... తెలివైనదానివి. ఇప్పుడే ఇన్‌స్పెక్టర్‌కు ఫోన్ చేస్తాను" అని మహేంద్రకు డయల్ చేశాడు.

"వెహికల్ నెంబర్ నోట్ చేశారా? చెప్పండి" ఆత్రంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్ మహేంద్ర అవతలినించి.

"నోట్ చేసుకోండి. ఎమ్. జడ్. ఎక్స్. 4114."

"వాట్! మీరు జోక్ చేస్తున్నారా?" కోపంగా

అడిగాడు మహేంద్ర.

"జోక్ .... కాదు. నిజంగానే."

"వాటీజ్ దిస్ ....మీరు చెప్పిన నెంబర్ నా మోటార్ సైకిలుది."

షాకై పోయాడు చక్రపాణి.

"సారీ..ఐతే దొంగ మీ మోటార్ సైకిలు నెంబర్‌తో తిరుగుతున్నాడు. అమ్మాయి పొరపాటు పడలేదు. చాలా దగ్గరగా నించి ఆగివున్నప్పుడు చూసిందిట. అతనికి సంబంధించిన అడ్రసు వున్న ఓ కార్డుకూడా దొరికింది."

"అడ్రసా? చెప్పండి."

"ప్లాట్-127. నార్త్ స్ట్రీట్-టెంపుల్ లాండ్స్."

రెండు నిమిషాలకు ఫోన్ పెట్టేశాడు చక్రపాణి.

"తప్పకుండా దొంగ దొరుకుతాడు. అతను ఇన్‌స్పెక్టర్ నించి తప్పించుకోలేడు" అన్నాడు చక్రపాణి రాధతో

"నాకు నమ్మకంలేదు. అతను చాలా తెలివైనవాడు" అన్నది రాధ.

ఓ గంట తర్వాత ఫోన్ మోగింది.

"ఇన్‌స్పెక్టర్ అయివుంటాడు" అంటూ చక్రపాణి రిసీవర్ యెత్తి "హలో .... ఇన్‌స్పెక్టర్ గారేనా?" అడిగాడు.

"నేనే....నిజంగా అతను టక్కరి దొంగ. మనల్ని ఫూల్స్‌ని చేశాడు. ఆ కార్డులో వున్న అడ్రసుగల ఇల్లు ప్రముఖ లీడింగ్ లాయర్ పరాంకుశంగారిది."

నోరు తెరిచాడు చక్రపాణి.

## 7

భామిని బార్ అండ్ రెస్టారెంట్ —

మనుషులు హుషారుగా లోపలకు నడుస్తున్నారు.

ఆడ, మగ జంటలుగా కదులుతున్నారు.

ఆ రాత్రి తొమ్మిది గంటలకు ప్రముఖ నర్తకి మిస్ చంచల కేబరే వుంది. అందుకని ముందుగానే రెస్టారెంట్ లో సీట్లు రిజర్వు చేయించుకున్నారు.

రెస్టారెంట్ బయట టాక్సీ ఆగింది.

అందులోనించి దిగిన చక్కనిచుక్క ఫేర్ చెల్లించి వయ్యారంగా నడుస్తూ రెస్టారెంట్ లోకి ప్రవేశించింది.

ఒక్కసారిగా ఆ ప్రదేశాన్ని వింత పరిమళం చుట్టు ముట్టింది. అందరి చూపులూ ఆమె మీదకు మళ్ళాయి.

ఆశగా ఆమెనే చూశారు.

ఆమె రిజర్వు చేసుకున్న టేబిల్ ఖాళీగా వుంది.

కూర్చుంది.

ఆమె పాలనురగలాంటి చీరను ధరించింది. స్లీవ్ లెస్ జాకెట్ వేసుకుంది.

భుజానికి నీలిరంగు ఫ్యాషన్ హాండ్ బాగ్ వేల్లాడు తున్నది.

ఆమె ఎవ్వరినీ చూడలేదు.

పాశ్చాత్య సంగీతం మంద్రస్థాయిలో వినపడుతోంది.

వాచీకేసి చూసుకున్నది ఆమె.

పావు తక్కువ ఎనిమిది!

జనం ఒక్కొక్కరే లోపలకు వస్తున్నారు.

బీర్ కీ-కాజునట్స్ కీ ఆర్డరిచ్చిందామె.

వెళ్ళిపోయాడు.

లోపల కొన్ని లైట్లు వెలుగుతూ ఆరిపోతున్నాయి. డయాస్ ను ఆ రోజు ప్రత్యేకంగా తీర్చిదిద్దారు.

రెండునిమిషాల తర్వాత ఖరీదైన దుస్తులు ధరించిన మనిషి నెమ్మదిగా నడుస్తూ వచ్చి ఆమె యెదురుగా

కూర్చున్నాడు.

అతని పేరు బలదేవ్.

లక్షాధికారి.

నగరంలో ఆయనకు యెన్నో వ్యాపార సంస్థలు వున్నాయి. ఆయన భార్య ఏడాదిక్రితం చనిపోయింది. ఉన్న ఒక్క కొడుకు ఆరునెల్లక్రితం అమెరికా వెళ్ళి పోయాడు.

బీర్ తీసుకొచ్చాడు బేరర్.

ఓపెన్ చేసి గ్లాసులోకి వంచాడు.

కళ్ళార్పకుండా ఆమె అందాన్నే చూశాడు బలదేవ్. అతనికి మతిపోయింది.

చక్కనిచుక్క.

ఇంతకుముందు యెప్పుడూ బార్‌లో చూడలేదు. కొత్తగా వచ్చిందేమో!

"మే ఐ నో యువర్ స్వీట్ నేమ్" అన్నాడు అతను కొంచెం చొరవతీసుకొని.

ఆమె అదోలా నవ్వి "రోజా" అన్నది.

"మార్వెలెస్....మీ అందానికి తగిన పేరు. మీరు పూర్తిగా విచ్చుకున్న రోజాపువ్వులా వున్నారు" అన్నాడు సంతోషంతో.

"థాంక్స్." అందామె.

"ఏం చేస్తున్నారు?"

"డిగ్రీ తీసుకున్నాను. ప్రస్తుతం పై చదువు చదివే ఆలోచనలో వున్నాను."

"గుడ్" అన్నాడతను.

ఆమె - అతని గురించి అడుగుతుందని భావించాడు. కాని అడగలేదు. యెలాగైనా ఆమెతో సంభాషణను

పొడిగించాలని—

"నా పేరు బలదేవ్. ఈ నగరంలో నాకు ఎన్నో వ్యాపార సంస్థలు వున్నాయి. అయామె ఫేమస్ ఫిగర్" అంటూ నవ్వాడు.

ఆమెకూడా చిన్నగా నవ్వింది.

బేరర్ విస్కీ, సోడా చిప్స్ తీసుకవచ్చి బలదేవ్ ముందు వుంచి వెళ్ళిపోయాడు.

గ్లాసులోకి డ్రింక్ వంచుకొని సిగరెట్టు వెలిగించుకో బోతూ "ఎనీ అబ్జెక్షన్" అన్నాడు.

"నో అబ్జెక్షన్. కాల్చండి" అన్నది ఆమె చిరునవ్వుతో.

"థాంక్ యూ."

ఇద్దరూ తాగటం మొదలుపెట్టారు.

కొంచెంసేపట్లో కాబరే డాన్సర్ మిస్ చంచల డయాస్ మీదకు రాబోతున్నట్టు ఎనౌన్స్ చేశారు.

మ్యూజిక్ స్థాయి మారిపోయింది.

ఉన్నట్టుండి డయాస్ మీద చంచల ప్రత్యక్షమయింది. అంతా సంతోషంతో అరిచారు.

అందరూ ఆమెను ఆత్రంగా చూశారు.

తాగుతూ మాట్లాడుతున్నాడు బలదేవ్, తన ఫామిలీ గురించి, ఏడాదిక్రితం చనిపోయిన తన భార్య గురించి ఆమెతో చెబుతున్నాడు.

కేబరే మొదలయ్యింది.

చూస్తోంది ఆమె.

ఆమె అందాన్ని చూస్తున్నాడు బలదేవ్. ఆ అందాన్ని విస్కీలో కలుపుకొని తాగుతున్నాడు. అంతే కాని చంచల కేబరే డాన్సును చూడటంలేదు.

డాన్స్‌ను చూస్తూనే అతడి చూపులను గమనిస్తోంది ఆమె.

అరగంట గడిచింది.

విసుగ్గా వాచీ చూసుంది ఆమె.

ఆమె మొహంలోని విసుగును గమనించి "మీకు కేబరే అంతగా నచ్చలేదనుకుంటాను" అన్నాడు బలదేవ్.

"ఇంతకంటే గొప్ప కేబరేలను చూశాను. ఇది బోర్‌గా వుంది. వెళ్ళిపోతాను" అన్నది వాచీ చూసుకుంటూ.

"నాకూ అంత ఇంట్రెస్టింగ్‌గా లేదు. పదండి. నేను కూడా వస్తాను. మీరు కార్లో వచ్చారా?"

"లేదు. ఓ ఫ్రెండ్ కార్లో ఇక్కడ డ్రాప్ చేసి వెళ్ళింది."

"ఫర్వాలేదు. నేను నా కార్లో మిమ్మల్ని డ్రాప్ చేస్తాను. రండి."

"మీ కెందుకు శ్రమ? టాక్సీలో వెళతాను."

"శ్రమలేదు. విత్ ప్లెజర్. మీలాంటి అందమైన యువతిని డ్రాప్ చెయ్యటం నిజంగా ఆనందం."

ఆమె నవ్వింది.

కొంత డబ్బుతీసి ట్రేలో వుంచి ఆమెతో బయటకు నడిచాడు బలదేవ్.

తెల్లటి ఎంబాసిడర్ దగ్గరకు నడిచారు.

ఆమె అతడి పక్కనే కూర్చుంది.

స్టార్టు చేసి ముందుకు పోనిచ్చాడు.

ఎటువైపు వెళ్ళాలని అతను అడగలేదు. ఆమె చెబుతుందేమోనని ఎదురుచూశాడు. కాని ఆమె చెప్పలేదు.

కొంచెం దూరం వెళ్ళిన తర్వాత "సారీ....మరచి

పోయాను. నా అడ్రస్ చెప్పలేదుకదూ? ఏదో ఆలోచనలో మునిగిపోయాను" అన్నది.

"ఫర్వాలేదు. తర్వాత చెప్పండి. ఇప్పుడు మీరు మా ఇంటికి వస్తున్నారు."

"మీ ఇంటికా? ఎందుకు?"

"ఉయ్ విల్ హేవ్ సమ్ డ్రింక్..కొంచెంసేపు నాతో గడపండి..మీరు నా హృదయాన్ని బాగా ఆకర్షించారు. డినీజ్ మై రిక్వెస్ట్..ప్లీజ్.."

ఆమె మాట్లాడలేదు.

పదినిమిషాల తర్వాత కారు ఒక పెద్ద భవనం ముందు ఆగింది.

బలదేవ్ ఆమెను తన ప్రయివేటు గదిలోకి తీసుకు వెళ్ళాడు. రెండునిమిషాలు అక్కడ కూర్చున్న తర్వాత ఆమెకు ఆ భవనమంతా చూపించాడు.

భార్య ఫోటోలు చూపించాడు.

చివరికి తన ఒంటరితనం గురించి చెప్పాడు. తనకో మంచి ఆత్మీయురాలు కావాలన్నాడు.

అన్నింటినీ మౌనంగా విన్నది ఆమె.

తిరిగి వాళ్ళు ఆ గదిలోకి వచ్చారు.

అతనే విస్కీ, బీర్ సీసాలను తీసుకు వచ్చాడు.

"సారీ.... నేను హాట్ డ్రింక్స్ తీసుకోను."

"ఇట్సాల్ రైట్....యు విల్ హేవ్ బీర్" అని రెండు గ్లాసుల్లోకి వంచి "మరచిపోయాను....సిగరెట్లు.. వన్ మినిట్" అంటూ అక్కడినించి వెళ్ళిపోయాడు.

ఆ సమయాన్ని చక్కగా వుపయోగించుకుంది ఆమె.

బలదేవ్ తిరిగివచ్చాడు.

సిగరెట్టు వెలిగించాడు.

తిరిగి ఇద్దరూ తాగటం మొదలుపెట్టారు. నెమ్మదిగా తాగుతూ అతడి కళ్ళలోకి చూస్తోంది ఆమె.

ఆ గ్లాసు పూర్తయ్యేసంకి అతని కళ్ళు మూసుకోవటం మొదలు పెట్టాయి.

"మీరు ఎక్కువ తాగారు....ఇక నేను వెళతాను" అని లేచి నిల్చుంది ఆమె.

"వద్దు....నువ్వు వెళ్లొద్దు....ఈ రాత్రికి ఇక్కడే..." అంటూ నే పక్కకు ఒరిగిపోయాడు కుర్చీలో.

నవ్వుకుంది ఆమె.

ఇంకో ఐదు గంటలవరకూ బలదేవ్ నిద్రలేవడని ఆమెకు తెలుసు.

ఆ గదిలోనించి బయటకు నడిచింది.

ఒక చిన్న లెదర్ బ్యాగ్ ను సంపాదించింది.

మరో అరగంట తర్వాత ఆ చక్కనిచుక్క ఐదు లక్షల రూపాయల నగలు — డబ్బుతో ఆ ఇంట్లోనించి తాపీగా బయటకు నడిచింది.

బలదేవ్ మత్తులో జోగుతున్నాడు.

# 8

మోటార్ సైకిలు దిగి శ్రీ ఏసెస్ క్లబ్ లోకి నడిచాడు ఆనంద్.

లోపల జూదం జోరుగా సాగుతోంది.

సిగరెట్ల పొగ పైకి లేస్తోంది.

ఆనంద్ నల్లటి ప్యాంటు-నల్లటి షర్టు వేసుకున్నాడు. ఇప్పుడు అతనికి గుబురుగా వున్న గడ్డం లేదు.

నున్నగా షేవ్ చేసుకున్నాడు.

ఒక టేబిల్ దగ్గర కూర్చున్నాడు.

వాళ్ళెవరో అతనికి తెలీదు.

మందు సేవిస్తూ ఆడుతున్నారు.

ఆనంద్ కూడా వాళ్ళలో కలిశాడు.

అతనికూడా కార్డ్సు పంచారు. అతను కార్డ్సు తియ్యలేదు.

ఇంతలోనే పెద్దగా మాట్లాడుకుంటూ ముగ్గురు గూండాలు లోపలకు వచ్చారు.

తలెత్తి వాళ్ళను చూశాడు ఆనంద్. చూస్తూనే వాళ్ళని గుర్తించాడు. వాళ్ళుకూడా అతన్ని చూశారు. గుర్తుపట్టారు.

చక్రపాణిని అడ్డగించిన ఆ ముగ్గురు గూండాలను ఆ రోజు తను చితుగా తన్నాడు.

"ఒరేయ్, ఇప్పటికి దొరికాడురా .... ఇవాళ వీడు ప్రాణాలతో బయటకు వెళ్ళకూడదు" అంటూ ఒకడు కర్కశంగా నవ్వాడు.

మిగిలిన ఇద్దరూ అప్పటికే జేబుల్లోనించి బటన్ నైఫ్‌లను బయటకుతీసి ఝుళిపించారు.

మూడోవాడు నడుముకు వున్న వెడల్పాటి బెల్టును వూడదీశాడు. దాన్నిండా ముళ్ళలాంటి ఇనుపముక్కలు వున్నాయి. శరీరానికి తగిలితే చర్మం రేగిపోతుంది.

స్ప్రింగ్‌లా నిలబడ్డాడు ఆనంద్.

వికృతంగా నవ్వుతూ పళ్ళు బయటపెట్టి ముగ్గురూ ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ అతని దగ్గరగా రాబోయారు.

అప్పటికే జూదం ఆడుతున్న మనుషులు భయంతో లేచి నిల్చున్నారు. కొంతమంది ఆసక్తిగా చూస్తున్నారు.

ఊహించని వేగంతో ఆనంద్ టేబుల్‌ను యెత్తి

విసురుగా వాళ్ళమీదకు విసిరాడు.

కవ్వుమన్నారు ముగ్గురూ.

వెనక్కు విరుచుకు పడిపోయారు.

ఇంతలోనే రెట్టించిన కోపంతో టేబుల్ను పక్కకు నెట్టి లేచి అతనిమీదకు దూకారు.

ఆనంద్ ఎగిరి ఒకడి మొహంమీద తన్నాడు. బాధగా అరిచాడు వాడు.

రెండోవాడిమీదకు కుర్చీ విసిరాడు.

మూడోవాడు కత్తితో ఎగిరి దూకాడు ఆనంద్ మీదకు. చటుక్కున పక్కకు తప్పుకుని అరచేతిని కత్తిలా చేసి వాడి చేతిమీద బలంగా కొట్టాడు. వాడి చేతిలో కత్తి ఎగిరి దూరంగా పడింది.

కిందపడిన ఇద్దరూ మళ్ళీ అతనిమీదకు వచ్చారు. వాళ్ళమీదకు పట్టీకొట్టి, కిందపడిన బెల్టును అందుకున్నాడు ఆనంద్.

దగ్గరకు రాబోయిన ఒకడి మొహంమీద ఛెళ్ళుమని పించాడు బెల్టుతో—

ప్రాణం పోయినట్టు అరిచాడు వాడు. మొహం చెక్కుకుపోయి నెత్తురు బయటకు వచ్చింది.

ఆ దృశ్యాన్ని చూడటంతోనే మిగిలిన ఇద్దరూ ఆవేశంతో దూసుకువచ్చారు.

ఎవరు ఎప్పుడు ఫోన్ చేశారో పోలీసులు లోపలకు పరిగెత్తుకుంటూ వచ్చారు విజిల్స్ వూదుకుంటూ.

అంతే—ముందుకు వస్తున్న ఇద్దరు గూండాలూ పరుగు తీశారు. బెల్టుదెబ్బతిన్న గూండా పోలీసులకు దొరికి పోయాడు.

ఆనంద్ ఎగిరి బయటకు దూకాడు.

అతన్ని ముగ్గురు పోలీసులు వెంబడించారు.

మోటార్ సైకిలు దగ్గరకు వెళ్ళే అవకాశంకూడా లేదు.

అందుకే ఆలోచించకుండా పరిగెత్తాడు రోడ్డుమీదకు.

పోలీసులు అతన్ని వదల్లేదు.

తరుముతూనే వున్నారు.

పదినిమిషాల తర్వాత ఆనంద్ ఓ ఇరుగ్గా వున్న వీధిలోకి ప్రవేశించాడు.

# 9

తలుపుమీద చప్పుడయ్యింది.

సన్నని సందులోనించి చూసి తెర్చింది ఆమె—

ఆనంద్ లోపలకు వచ్చాడు.

అతను ఆయాసంతో రొప్పుతున్నాడు. తలుపులను మూస్తూ "ఎవరైనా తరుముతున్నారా?" అన్నది.

"పోలీసులు" అన్నాడు లోపలకు వచ్చి కూర్చుంటూ.

ఐదు నిమిషాలవరకూ ఇద్దరూ మాట్లాడుకోలేదు. పోలీసులు ఆ రోడ్డులోకి రాలేదనీ వెళ్ళిపోయారనీ అనుకున్న తర్వాత ఆనంద్ శ్రీ ఏ.సిస్ క్లబ్‌లో జరిగిన గొడవ గురించి చక్కని చుక్కతో చెప్పాడు.

ఆమె నవ్వి "ఇంకా ఎందుకు నీకీ ఫైట్స్....మనం మన టార్గెట్ రీచ్ అయ్యాం. ఇక ఈ దేశాన్ని వదిలి వెళ్ళిపోవాలి" అన్నది.

"అవును. ఇప్పటికే మన దొంగతనాలు నగరంలో సంచలనాన్ని కలిగించాయి. ఈ దేశంలో మనం ఎక్కడ వున్నా వల విసిరి పట్టుకుంటారు. అందుకే మనం త్వరగా ఈ దేశాన్ని వదిలి వెళ్ళిపోవాలి. అందుకు అవసరమైన ఏర్పాట్లు త్వరగా పూర్తి చేసుకోవాలి."

"ఇప్పటికే పోలీసులు మనకోసం గాలిస్తున్నారు. ఇన్‌స్పెక్టర్ మహేంద్ర స్టేట్‌మెంట్లను పేపర్లో చూశావా .... ఎలాగైనా మనల్ని పట్టుకొని చట్టానికి అప్పగిస్తానని అంటున్నాడు."

నవ్వాడు ఆనంద్.

"ఆయన నమ్మకం అలాంటిది. అలాంటి స్టేట్‌మెంట్లు ప్రజల భయాన్ని పోగొట్టటానికి చేసేవి. వాటిని మనం లెక్క చేయాల్సిన అవసరంలేదు. ఐతే—ఈ దేశాన్ని వదిలి వెళ్ళబోయే ముందు చివరిసారిగా మనిద్దరం కలిసి ఒ మనిషిని దోచుకోవాలనే కోరిక వుంది" అన్నాడు ఆనంద్.

"ఎవరా మనిషి?"

"మంత్రి నాగలింగం ...."

"నిజమే. నాగలింగం ఇంట్లో మనకు కనీసం పది లక్షలు దొరుకుతాయి. తృప్తిగా ఈ దేశంనించి వెళ్ళిపోవచ్చు" అన్నది ఆమె.

"రైట్ .... త్వరలోనే ముహూర్తం పెడతాను" అన్నాడు అతను నవ్వుతూ.

ఆమెకూడా అందంగా నవ్వి అతడికి దగ్గరగా జరిగింది.

## 10

సోఫా వెనక దాక్కున్నారు, ఇద్దరూ.

ఎదురుగా వున్న గదిలోంచి ఎవరో వస్తున్న అలికిడి అయ్యింది.

చూస్తున్నారు.

మంత్రి నాగలింగం బయటకు వచ్చాడు.

వాళ్ళు మరింత దాక్కున్నారు ఆయనకు కనిపించ

కుండా.

నాగలింగం సీరియస్‌గా నడుచుకుంటూ పక్కనే వున్న మరో గదిలోకి వెళ్ళాడు.

వాళ్ళు ఆయన్ని అనుసరించారు.

నాగలింగం ఆ గదిలో పరచి వున్న కార్పెట్‌ను పైకెత్తాడు. ఆ తర్వాత మాయమైపోయాడు.

ఆనంద్ — ఆమె ఆ గదిలోకి వచ్చి రెండు నిమిషాలాగి కార్పెట్‌ను పైకెత్తారు.

కిందకి ఇనుప నిచ్చెన వుంది.

చప్పుడు అవకుండా కిందికి దిగారు.

ఎదురుగా ఓ గదిలో అప్పుడే తలుపు మూసుకుంది. నాగలింగం ఆ గదిలోకే వెళ్ళాడని అనుకున్నాడు.

ఆ గది కాకుండా ఇంకో రెండు గదులు వున్నాయి ఆ భూగృహంలో.

ఇంకెవ్వరూ లేరు.

హాల్లో రెండు కుర్చీలు ఒక టేబిల్ వున్నాయి. ఓ మూలగా ఏవో అట్టపెట్టెలు వున్నాయి. వాటికి నైలాన్ తాళ్ళు బిగించి వున్నాయి.

తలుపుల దగ్గరకు నడిచారు.

ఏదో శబ్దం వస్తోంది.

"హలో... హల్లో" అంటున్నాడు నాగలింగం లోపల.

ఒక్క నిమిషం గడిచింది.

చెవులు రిక్కించారు.

"యస్. నాగలింగంని మాట్లాడుతున్నాను. మన దేశం ఆయుధాల కొనుగోలు విషయంలో మరో దేశంతో ఒప్పందం కుదుర్చుకున్న ముఖ్యమైన పత్రం నా దగ్గరకు

చేరింది. అవును ... దాని వేల్యూ మీకు తెలుసు కదా....
డబ్బు తీసుకొని రేపు రాత్రి సరిగ్గా ఇదే టైముకు అంటే
పదకొండు గంటలకు రండి.... ఇంకొన్ని రహస్యపత్రాలు
కూడా వున్నాయి. అన్నీ ఇక్కడ చూడొచ్చు,"

ఆనంద్ ఆశ్చర్యంగా ఆమెను చూశాడు.

"మై గాడ్! మంత్రి నాగలింగం దేశద్రోహి."

ఇంకొంచెం సేపు ఎవరితోనో మాట్లాడాడు.

ఫోన్ పెట్టేశాడు.

నాగలింగం బయటకు వస్తున్నాడని గ్రహించి
పక్కకు తప్పుకున్నారు ఇద్దరూ.

బయటకొచ్చాడు నాగలింగం.

అంతే. సిద్ధంగా వున్న ఆనంద్ రెండు చేతులూ
బిగించి ఆయన మెడమీద కొట్టాడు.

చిన్నగా అరుస్తూ ముందుకు పడ్డాడు.

క్షణంకూడా ఆలస్యం చెయ్యలేదు ఆనంద్. బోర్లా
పడిన నాగలింగం రెండు చేతులనూ వెనక్కు విరిచి
పట్టుకున్నాడు.

ఆమె నైలాన్ తాడుతో చేతులు—కాళ్ళు కట్టే
సింది.

"ఎవరు మీరు?" అన్నాడు నాగలింగం ఆశ్చర్యంగా.

"దొంగలం.... ఈమధ్య పేపర్లో వస్తున్న 'టక్కరి
దొంగ—చక్కని చుక్క' దొంగలం మేమే!"

"నా ఇంటికి దొంగతనం చేయటానికి వచ్చారా?"

"అవును. ఇంతకుముందు నువ్వు దేశద్రోహివని తెలీదు.
ఇప్పుడు తెలిసింది. అందువల్ల ఇప్పుడు నీ ఇంటిని దోచు
కోవటమేకాకుండా నిన్ను చట్టానికి అప్పగించి వెళతాము"
అన్నాడు ఆనంద్.

"వద్దు. ఇక్కడ మీరు విన్నదంతా మరచిపొండి. మీకు ఐదు లక్షలు ఇస్తాను" అన్నాడు నాగలింగం.

"నువ్వు ఐదు లక్షలిచ్చేదేమిటి? నీ ఇంటిని పూర్తిగా దోచుకుంటాం. ఎంత దొరికినా అంత తీసుకుంటాం. ఐనా నీతో చేతులు కలపటానికి మేము నీలాగా దేశద్రోహులం కాదు. దేశభక్తులం."

"దోపిడీలు, దొంగతనాలు చేసే మీరు దేశభక్తులా!"

"నువ్వు పొరబడుతున్నావు. మేము దేశాన్ని దోచుకోవడంలేదు. లక్షల రూపాయల్ని నల్లముసుగులో వుంచిన కొంతమంది ధనవంతులనే దోచుకుంటున్నాము. అందువల్ల దేశానికి నష్టంలేదు. కాని నువ్వు దేశద్రోహివి. దేశ ప్రజలందరికీ నువ్వు ద్రోహం చేస్తున్నావు. అందువల్ల నిన్ను వదిలిపెట్టం.... సరే.... ఐరన్ సేఫ్ కీస్ ఎక్కడ వున్నాదో చెప్పు. మాకు ఎక్కువగా టైమ్‌లేదు."

"నేను చెప్పను" అన్నాడు మొండిగా నాగలింగం.

నవ్వింది ఆమె—

"నువ్వు చెప్పకపోయినా మాకు ఇబ్బందిలేదు. మా దగ్గర మాస్టర్ కీ వుంది. దాంతో ఎటువంటి తాళాన్నైనా ఐదు నిమిషాల్లో తెరుస్తాం" అన్నది.

ఆనంద్-నాగలింగం వెనగ్గా వెళ్ళి అరచేతిని కత్తిలా చేసి ఆయన మెడమీద కొట్టాడు. అంతే, ఆయన తల వాల్చేశాడు.

ఇద్దరూ ఆ భూగృహంలోనించి తిరిగి పైకి వచ్చారు. అరగంటసేపు ఇల్లంతా తిరిగారు.

అంతా దోచుకొని రెండు సూట్కేసుల్లో సర్దుకున్నారు.

ఆనంద్ ఫోన్ దగ్గరకు వెళ్ళి డైరక్టరీ వెతికి పోలీస్

కమీషనర్‌కు డయల్ చేశాడు.

"హలో..ఎవరు?"

"కమీషనర్‌తో మాట్లాడాలి."

"ఎవరు మీరు?"

"హోం మినిష్టర్ పి.ఏ.ని."

"వన్ మినిట్."

"హల్లో..కమీషనర్ స్పీకింగ్" క్షణం తర్వాత వినపడింది.

"సారీ.. నేను హోం మినిష్టర్ పి.ఏ.ని కాదు. మీతో ఓ ముఖ్యమైన రహస్యం మాట్లాడటానికి అబద్ధం చెప్పాను."

"ఏమిటా రహస్యం?"

"మంత్రి నాగలింగం దేశద్రోహి. ఆయన మనదేశ రహస్యాలను, రహస్య పత్రాలను విదేశీయులకు అందజేస్తున్నాడు."

"వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్, ఆర్ యూ జోకింగ్" కోపంగా అరిచాడు కమీషనర్.

"మీరిలా అంటారని నాకు తెలుసు. అందుకే నాగలింగాన్ని ఆయన ఇంట్లోనే వున్న భూగృహంలో స్పృహ తప్పించి కాళ్ళు—చేతులు బంధించి వుంచాను."

"ఇంతకీ నువ్వెవ్వరు?"

"టక్కరి దొంగగా పేపర్లోకి ఎక్కిన కేవలం ధనవంతులను దోచుకు నే దొంగను. అయినా నేను దేశభక్తుడిని. అందుకే నాగలింగంలాంటి దేశద్రోహితో చేతులు కలపకుండా మీకు అప్పగించాలనుకుంటున్నాను. మీరు కూడా నాలాంటి దేశభక్తులైతే వెంటనే వచ్చి నాగలింగాన్ని బంధించండి. ఆ భూగృహంలోనే మన దేశా

నికి సంబంధించిన రహస్య పత్రాలు మీకు చాలా దొరుకు తాయి. బై" అని రసీవర్ పెట్టేశాడు.

మరో ఐదు నిమిషాల తర్వాత ఇద్దరూ వచ్చిన దారి నే యెవరికంటా పడకుండా బయటకు వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిన సరిగ్గా పదిహేను నిమిషాలకు కమీషనర్ తన సిబ్బందితో నాగలింగం ఇంటిమీద రెయిడ్ చేశాడు.

ఆయనకు భూగృహంలో స్పృహలేకుండా పడివున్న మంత్రి నాగలింగం కనిపించాడు. తర్వాత ఆ గదుల్లోని రహస్య అరల్లో దేశానికి సంబంధించిన అనేక రహస్య పత్రాలు దొరికాయి.

కమీషనర్ టక్కరి దొంగకోసం ఇల్లంతా వెతికాడు.

కొంతమంది నాగలింగానికి స్పృహ తెప్పించే ప్రయత్నం చేస్తున్నారు.

సరిగ్గా అదే సమయానికి 'టక్కరి దొంగ చక్కని చుక్క' ఎక్కిన టాక్సీ విమానాశ్రయంవైపు పరుగు దీస్తోంది.

—: అయిపోయింది :—

# ప్రేమించిన యువతి

## టెంపోరావ్

హాల్లోని ఫ్లోర సెంట్ లైట్లు వెలుగుతున్నాయి. తల్లి పక్కనే జయ కూర్చుని వుంది.

"బీచ్ కి వెళ్దామన్నాడు. ఎనిమిది దాటింది. నాన్న యింకా రాలేదు" అంది జయ.

"ఆయనకి వెయ్యి పనులమ్మా. పది ఫ్యాక్టరీలకు ఆయన అధిపతి. తీరికేవుండదు" అంది తల్లి రామాయమ్మ.

అప్పుడే బ్యూక్ కారొచ్చి పోర్టికోలో ఆగింది. డ్రయివర్ తలుపును తెర్చాడు. మెరుస్తూన్న సూటులో వున్న ధర్మారావు దిగి ఠీవిగా హాల్లోకి వెళ్ళాడు.

భార్య, కూతురువంక నవ్వుతూ చూశాడు.

"ఇంత ఆలస్యంగా వచ్చావేమిటి నాన్నా?" అంది జయ.

"సారీ, రాలేకపోయానమ్మా. బీచ్ కి రేపు వెళ్దాంలే" అన్నాడు తండ్రి సోఫాలో కుర్చుంటూ.

వంటామె ట్రేని తెచ్చి టీపాయిమీద పెట్టింది

కాఫీ కప్పును రామాయమ్మ భర్తకు అందించింది.

ఆఫీసులో అనేకసార్లు కాఫీ, టీ సేవించినా యింటి కొచ్చాక భార్య యిస్తే అతడు వద్దనడు.

కాఫీ తాగుతూ అతడు కూతురివంక చూశాడు.

"బీచ్‌కి వెళ్దాం నాన్నా" అంది జయ.

"ఇప్పుడా?"

"అర్ధరాత్రి కాదుగా!" అందామె.

"ఇవాళ నాకు చాలా బిజీగా వుంది నువ్వూ అమ్మా వెళ్ళిరండి."

"నేను రాను" అంది రామాయమ్మ.

జయ రుసరుస తల్లివైపు చూసింది.

"అయితే నేను ఒక్కర్తెనే నా కారులో వెళ్ళి వస్తాను" అంది జయ.

"డ్రయివర్ వెళ్ళిపోయాడు!" అంది తల్లి.

"నేనే డ్రయివ్ చేస్తాను."

ధర్మారావు కూతురుకేసి నవ్వుతూ చూశాడు.

"ఈ సమయంలో ఒంటరిగా వెళ్ళడం మంచిదికాదు. నా సెక్రటరీని నీతో పంపుతాను."

ధర్మారావు బయటకు చూశాడు.

"రామ్!" అని పిల్చాడు.

బయటనున్న రామ్ హాల్లోకి వచ్చాడు. ధర్మారావు ముందు వినయంగా నిలబడ్డాడు.

"సార్, పిల్చారా?" అడిగాడతను.

"అమ్మాయి బీచ్‌కి వెళ్తుందట. ఆమెతో వెళ్ళి భద్రంగా తీసుకురా! కారును నువ్వే డ్రయివ్ చెయ్యి" అన్నాడు ధర్మారావు.

"అలాగే సార్" అన్నాడు రామ్.

రామ్ వెళ్ళి కారులో కూర్చున్నాడు. జయ సోఫా లోంచి లేచింది.

"గంటలోపల తిరిగి వచ్చేయి" అన్నాడు తండ్రి.

జవాబివ్వకుండా జయ వెళ్ళిపోయింది. ప్రీమియర్ కారువైపు నడిచింది. స్టీరింగ్ వీల్ వెనక కూర్చున్న రామ్ సిగరెట్ పీలుస్తున్నాడు. ఆమె ముందు సీటుమీద కూర్చుని తలుపు మూసింది. రామ్ సిగరెట్ పారేయబోయాడు.

"సిగరెట్ కాల్చుకోవచ్చు!" అందామె.

"థాంక్స్, జయ గారూ" అని అతను కారును పోనిచ్చాడు.

కారు స్పీడుగా బీచ్ వైపు ప్రయాణం చేస్తోంది. సిగరెట్ పొగపీల్చి వదుల్తూ అతడు కారును పోనిస్తున్నాడు.

రామ్‌ని గురించి ఆమె ఆలోచిస్తోంది. యువకుడు అతడి వయస్సు 24 దాటివుండదు. మనిషి చక్కగా వుంటాడు. అతడు తన తండ్రి దగ్గర సెక్రటరీగా చేరి ఆరు నెలలు అయింది.

రామ్ ఎమ్.ఎ. పాసయ్యాడు. పొద్దుట ఎనిమిదిలోపల యింటికి వస్తాడు. నాన్నతో ఆఫీసుకు వెళ్తాడు. రాత్రి ఆలస్యంగా తనింటికి పోతాడు.

బీచ్ లోపలరోడ్డుమీద కారు ఆగింది. ఆమె దిగ లేదు. కార్లోనే కూర్చుంది. అతడు దిగి కారు పక్కనే యిసుకలో కూర్చున్నాడు.

జయ నలువైపులా చూసింది. లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. ఎనిమిది కావడం వలన బీచ్‌లో ఎక్కువ మంది లేరు.

ఆమె మెల్లిగా స్టీరింగ్ వీల్ వెనక్కి జరిగింది. ఇసుకలో కూర్చున్న అతడివంక చూసింది సముద్రంవైపు తిరిగి కూర్చువున్నాడతను. సముద్రపు హోరు వినపడ్తోంది. చల్లగాలి వీస్తోంది.

ఒక యువకుడు, యువతి నవ్వుతూ, చేతులు కలిపి సముద్రంవైపు పోతున్నారు. వాళ్ళవైపు ఆమె సూటిగా చూసింది.

శర్మారావు ఒక్కగా నొక్క కూతురు జయ. బి ఎ. పూర్తిచేయడానికి రెండేళ్ళనుంచి ప్రయత్నిస్తోంది. ఆమె వయస్సు 22 వుంటుంది. పచ్చటి రంగు. కాని ఆమె అంత అందగత్తె కాదు. ఖరీదైన దుస్తుల్లో ఆమె ఆకర్షణీయంగా కనిపిస్తుంది.

అంత అందంగా లేకపోయినా ఆమెవైపు పదేపదే చూడాలనిపిస్తుంది.

"రామ్ గారూ!" పిల్చిందామె.

అతడు పరుగెత్తుకొచ్చాడు.

"పోదామా?" ప్రశ్నించిందామె.

"మీ యిష్టం" అన్నాడతను.

ఆమె కిలకిలా నవ్వింది.

"మీ పూర్తి పేరు ఏమిటి?"

"రామారావు."

"మీకు ఆకలేస్తోందా?" అడిగిందామె.

"ఆకలిగానే వుంది."

"ఇంటికెళ్ళి భోజనం చెయ్యొచ్చుగా?"

"మీ తండ్రిగారిచ్చిన పని పూర్తిచేసి తర్వాత భోజనానికెళ్తాను."

"అయితే పదండి."

"నేను డ్రయివ్ చేస్తాను. మీరు పక్క నే కూర్చోండి" అన్నాడతను.

"నాన్న యేమీ అనడు నేను కారును నడిపితే. కూర్చోండి" అందామె.

"ప్లీజ్" అన్నాడతను.

"మీకు చేద స్తం ఎక్కువ!" అని ఆమె పక్కకు జరిగింది.

అతడు స్టీరింగ్ వీల్ వెనక కూర్చున్నాడు. దేని కోసమో సీటుమీద వెతికాడు.

"ఏం కావాలి?" అందామె.

"ఇక్కడ అగ్గి పెట్టె వుండాలి."

కారు లోపల లైటు ఆన్ చేసి చూశాడు.

అగ్గి పెట్టె ఎక్కడా లేదు.

"పోనీయండి!" అని కారును పోనిచ్చాడతను.

"మీరు యెక్కడుంటున్నారు?" ప్రశ్నించింది ఆమె.

"అయినావరంలో."

"చాలా దూరం."

అతడు జవాబివ్వకుండా కారును పోనిచ్చాడు.

"మీతో ఎవరుంటున్నారు?"

"అమ్మ, నలుగురు చెల్లెళ్ళు."

"బిగ్ ఫామిలీ! నాకూ చెల్లెళ్ళు వుంటే యెంతో బాగుండేది!" అందామె.

కారు స్పీడుగా వెళ్తోంది.

"కారు ఆపండి!" అందామె హఠాత్తుగా.

అతడు కారును ఆపాడు.

"అగ్గి పెట్టె కొనుక్కోండి!" అందామె.

"తర్వాత కొనుక్కుంటాను."

"అన్నీ తర్వాతే!" అని నొక్కి పల్కుతూ ఆమె కిందకు దిగింది.

పక్కనున్న సిగరెట్ కొట్టుకు వెళ్ళి తిరిగి వచ్చి, కూర్చుని ఒక అగ్గిపెట్టెను ఆమె అతడికిచ్చింది.

"సిగరెట్ వెలిగించుకొని, కారును పోనీయండి" అందామె.

"నేను సిగరెట్ కాలిస్తే మీకేమిటి వస్తుంది?"

"సిగరెట్ కాలుస్తూ కారు నడిపే వాళ్ళను చూస్తే నాకు ముచ్చటగా వుంటుంది" అందామె.

అతడు సిగరెట్ వెలిగించి కారును పోనిచ్చాడు.

"మీరు చాలా మంచివారు" అందామె.

"నామీద మీకు మంచి అభిప్రాయం ఏర్పడినందుకు సంతోషం."

అమాంతంగా ఆమె అతడి చెయ్యిని పట్టుకుంది. అతడు తృళ్ళిపడ్డాడు.

"ప్లీజ్, నన్ను వదిలేయండి!"

"ఎందుకలా కంగారుపడ్తారు? మీ చెయ్యిని పట్టుకున్నది నా చెయ్యి. త్రాచుపాము కాదు!"

"ప్లీజ్, వదలండి!" అన్నాడతను.

"నేను వదలను! మీరే వదిలించుకోండి!"

"మిమ్మల్ని వేడుకుంటున్నాను. నా గురించి ఎవరేనా చెడుగా మాట్లాడితే నేను భరించలేను."

"ఎవరు మాట్లాడతారు?"

అతడు సీటు మూలకు జరిగాడు, కాని ఆమె అతడి చెయ్యిని వదల్లేదు.

ధర్మారావు యిల్లు దగ్గరవుతోంది. అతడు కారును ఆపాడు.

"నన్ను వదిలేయండి!"

ఆమె వదిలేసి వ్యంగ్యంగా నవ్వింది.

"ప్రాణం పోతున్నట్లు మీరు భయపడతారు. ముట్టుకుంటే ఏమవుతుంది?"

"జయగారూ, జీతంకోసం నేను మీ నాన్నగారి దగ్గర పనిచేస్తున్నాను. తల్లి, నలుగురు చెల్లెళ్ళు నామీద ఆధారపడి వున్నారు. నేనెందులోనైనా ఇరుక్కుంటే వాళ్ళందరూ కష్టపడ్తారు" అని అతడు కారును పోనిచ్చాడు.

"మీ వాళ్ళకోసం మీరు జీవిస్తున్నట్లు వున్నారు?" అందామె.

"నిజం చెప్పారు. నాన్నగారు బ్రెయిన్ యాక్సిడెంట్‌లో పోయారు. అటుపైన వాళ్ళ బాధ్యత నాదే."

ఆమె అతడివైపు తిరిగి చూసింది.

"మీది బానిస బతుకు!" అందామె కష్టంగా.

అతడు నవ్వాడు.

"ఈ లోకంలో స్వేచ్ఛ, నిజమైన స్వేచ్ఛ ఎవ్వరికీ వుండదు. ఆశయాలతో, ఆశలతో బానిసయి మనిషి జీవిస్తూ వుంటాడు" అన్నాడతను గంభీరంగా.

"మీరు చెప్పింది వినడానికి బాగుంది. మళ్ళీ చెప్పండి!"

చెప్పాడతను.

పోర్టికోలో అతడు కారును ఆపాడు. ఆమె కార్లోనే కూర్చుంది. అతడు దిగి తలుపు తెర్చాడు.

ఆమె దిగి తటాలున అతడితో కరచాలనం చేసింది.

"థాంక్యూ" అని ఆమె హాల్లోకి వెళ్ళిపోయింది.

హాల్లో లైట్లు వెల్గుతున్నాయి. వంటామె సోఫాలో

కూర్చుని వుంది.

"వాళ్ళు పైన వున్నారమ్మా" అందామె.

మెట్లెక్కి ఆమె పైకి వెళ్ళింది. కాస్సేపట్లో కిందకు దిగింది. ముందు వరండామీదకు నడిచింది.

"రామ్‌గారూ, మీరు ఇంటికి వెళ్ళొచ్చు" అందామె.

"అలా మీ నాన్నగారు చెప్పారా?"

"నాన్నే చెప్పాడు."

కారు యిగ్నిషన్ కీని ఆమెకిచ్చి అతడు వెనక్కి తిరిగాడు.

"గుడ్‌నైట్" అందామె.

"గుడ్‌నైట్ జయగారూ" అని అతడు గేటువైపు కదిలాడు.

జయ ఆలోచిస్తూ హాల్లోకి నడిచింది.

## 2

మేడ మెట్లు దిగి, సోఫాలో కూర్చుని ఫైలులోని వుత్తరాలను చూస్తున్న రామ్ వంక ఆమె నవ్వుతూ చూసింది.

"వచ్చి ఎంతసేపయింది?"

"ఇప్పుడే వచ్చానండి," అన్నాడతను.

"కాఫీ తాగారా?"

"మా యింట్లో తాగాను."

ఆమె లోపలకు వెళ్ళింది. కాఫీ తెచ్చి అతడి కిచ్చింది.

"మీ కెందుకీ శ్రమ? వంటామె యిచ్చేవారుగా?" అన్నాడతను.

"ఇటుపైన మీకు కాఫీ నేనే యిస్తాను. మీకు కాఫీ యివ్వడమంటే నాకెంతో ఆనందం."

"అటువంటి పనులు చెయ్యకండి. నేనొక చిన్న వుద్యోగిని. మీరు రాజకుమారి, ఈ యింటికి!"

అతడు కాఫీ తాగి, కప్పునూ సాసరునూ తీసుకెళ్ళి డైనింగ్ టేబుల్ మీద పెట్టి వచ్చాడు. ఫైలు తీసుకుని కిందనున్న సెక్రటరీ గదిలోకి వెళ్ళి అతడు కూర్చున్నాడు.

తొమ్మిదింటికల్లా ధర్మారావు నుంచి కబురు వచ్చింది. అతడు హాల్లోకి వెళ్ళాడు. ధర్మారావు ఎదురుగా నిలబడ్డాడు.

"రామ్, ఇవాళ జయ ఏదో పిక్‌నిక్‌కి వెళ్తుందట. ఆమె కాలేజి వాళ్ళు బస్సులో వెళ్తారు. నువ్వు ఆమెను కారులో బస్సు వెనకనే తీసుకెళ్ళు."

"అలాగే సార్," అన్నాడతను.

"మీరు కూడా భోజనం అక్కడ మాతో చేయొచ్చు," అంది జయ.

అతడు తలాడించాడు.

"రామ్, సిమెంట్ ఫ్యాక్టరీ ఫైలు డ్రయివర్‌కి యిచ్చేయి," అన్నాడు ధర్మారావు.

"యస్సార్," అని రామ్ వెళ్ళిపోయాడు.

తల్లి కోపంగా కూతురి వంక చూసింది. "కాలేజి కెళ్ళడం మానేసి సంవత్సరం దాటింది. నీ క్లాస్‌మేట్సు ఎవ్వరూ లేరు. ఎందుకీ పిక్‌నిక్?" అరిచింది రామాయమ్మ.

"క్లాస్‌మేట్సు లేకపోవచ్చు. కాని మా లెక్చరర్సు వున్నారు. వాళ్ళే నన్ను రమ్మన్నారు. వాళ్ళు నాకు ట్యూషన్లు చెప్తున్నారుగా!" అంది జయ.

రామాయమ్మ భర్త వైపు తిరిగింది.

"ఒక్కగానొక్క కూతురని మీరు దాన్ని గారం చేసి పాడు చేస్తున్నారు. ఏది కావాలన్నా వెంటనే ఇచ్చే

స్తారు," అందామె.

"ఊరుకోవే! నీకు నాకూ మన పెద్దలు అలా యివ్వ లేకపోయారు," అన్నాడు ధర్మారావు.

"మనం అందుకే బాగుపడ్డాం," అందామె.

"నేను పిక్నిక్కి వెళ్ళను, నాన్నా" అంది జయ.

"అదేమిటమ్మా?"

"నేనెక్కడికేనా వెళ్తానంటే వద్దు వద్దని అమ్మ మద్దెల వాయిస్తుంది!"

"అది అమ్మకు అలవాటేగా! అమ్మ వద్దన్నదని నువ్వు ఏదేనా మానేశావా?" అడిగాడు ధర్మారావు.

"లేదులే."

"నేను ఆఫీసుకు వెళ్తాను. విష్ యు ఎ జాలీ పిక్నిక్," అని ధర్మారావు బయటకు నడిచాడు.

కారులో ధర్మారావు కూర్చున్నాడు. డ్రయివర్ తలుపు మూశాడు. కాస్సేపట్లో కారు కదిలింది.

పోర్టికోలో నిలబడిన రామ్ వైపు జయ చూసింది.

"మనం పదింటికి బయల్దేరుదాం," అందామె.

"అలాగేనండి," అన్నాడతను.

మౌనంగా అతడు తన గదికి వెళ్ళి కూర్చున్నాడు. ఏదో ఫైలు తీసి అందులోని వుత్తరాలను చదవసాగాడు.

# 3

రామ్ కారును పోనిస్తున్నాడు. పక్కనే జయ కూర్చుంది.

"మీ కాలేజి బస్సు ఎక్కడ నుంచి స్టార్ట్ అవుతుంది?" ప్రశ్నించాడు రామ్.

"మా కాలేజి నుంచి," అందామె.

"మనం ఎక్కడకు వెళ్ళాలి?"

"కాలేజీకి," అందామె.

ఆమె కాలేజి కాంపౌండులో అతడు కారు ఆపాడు. ఎక్కడా బస్సులేదు. కార్లోంచి దిగి ఆమె బిల్డింగులోకి వెళ్ళింది. విద్యార్థినులు యిటూ అటూ కాంపౌండులో తిరుగుతున్నారు.

సిగరెట్ పీలుస్తూ అతడు కారులోనే కూర్చున్నాడు. జయ తిరిగి వచ్చింది. కారులో కూర్చుని తలుపు మూసింది.

"పదండి," అందామె.

కారు బయటకు దూసుకుపోయింది.

"ఏదా బస్సు?" అడిగాడతను.

"నా కోసం చూసి చూసి వాళ్ళు వెళ్ళిపోయారు. నన్ను రమ్మన్నారు. చెంగల్ పట్ వైపు వెళ్ళండి. తోవలో ఎక్కడో ఆ బస్సు మనకు తప్పక కనిపిస్తుంది" అందామె.

సిగరెట్ పీకను అతడు బయటకు విసిరాడు. కారును వేగంగా పోనిచ్చాడు.

"బస్సు డ్రయివర్లు స్పీడుగా పోతారు. ఆ బస్సు మనకు కనిపించదేమో!"

"కనిపించకపోతే ఫరవాలేదు. మనం పిక్ నిక్ చేసుకుని యింటికి తిరిగి వద్దాం," అందామె.

అరగంటపైన కారు ప్రయాణం చేసింది. బస్సు ఎక్కడా కనబడలేదు. ట్రంక్ రోడ్డమ్మట లారీలు, ప్రయాణీకులున్న బస్సులు దూసుకుపోతున్నాయి.

"మనం యింటికి పోవడం మంచిదేమో!" అన్నాడతను.

"పిక్ నిక్ కి వెళ్ళితీరాలి. వాళ్ళు ఆ కొండ ప్రదేశంలో

వుంటారు."

ట్రంక్ రోడ్డమ్మట కారు కదుల్తోంది. రోడ్డుకిరువైపులా చింతచెట్లు వున్నాయి.

ఆమె అతడి చెయ్యి పట్టుకుంది. మెల్లిగా అతడి మీదకు వాలింది.

"ప్లీజ్ దూరంగా కూర్చోండి. జయమ్మగారూ!" అన్నాడతను.

"జయమ్మ ఏమిటి? నన్ను జయ అని పిలవండి!"

"ప్రతి యువతినీ నేను అమ్మగా భావిస్తాను!"

"యువతులకు ఎంత అవమానం? మీ దృష్టిలో యువతులందరూ ముసలమ్మలా?" అడిగిందామె.

"అలా నేననలేదు. వాళ్ళు దేవతలు. మీరిలా నా మీదకు వాలకండి. దూరంగా జరగండి."

"రామ్‌గారూ, మీరంటే నాకెంతో యిష్టం. ఐ లవ్ యు!"

"నేను మిమ్మల్ని ప్రేమించలేను."

"ఎందువలన?"

"నేను ఎన్నో బాధ్యతలున్న మనిషిని. నా నలుగురు చెల్లెళ్ళకీ పెళ్ళిళ్ళు అయితేగాని నేను పెళ్ళాడను. అదంతా అయ్యేదాకా నేను ఎవర్నీ ప్రేమించలేను."

ఆమె అతడి జుత్తును నిమిరింది.

"మీరిలా బానిసగా పడుండడం నా కిష్టంలేదు. మీరు బాగా వృద్ధిలోకి వస్తారు. మనం చాలా ఆనందంగా వుండొచ్చు."

అతడు కారును ఆపాడు. ఆమె వంక సూటిగా చూశాడు.

"నేను మీకు ఏ విధంగానూ సరిపోను, జయగారూ.

నా పేరు ఎత్తితే మీ నాన్నగారు మిమ్మల్ని తిట్టి నన్ను తన్ని పొమ్మంటారు. ప్లీజ్ నన్నిలా బతకనివ్వండి!" అన్నాడతను.

ఆమె అతడిని వదిలేసింది. అతడు కారును పోనిచ్చాడు.

"మీరు ఎమ్మే యెలా పాసయ్యారో నాకు అర్థం కావడంలేదు. మన ప్రేమ గురించి నాన్నతో నేను చెప్పాను. నాన్న ఏమీ అనడు. మన పెళ్ళికి ఒప్పుకుంటాడు," అందామె.

గంటపైన కారు వెళ్తూనే వుంది. ఇరువైపులా కొండ ప్రదేశం.

"ఇంకా ఎంత దూరం వెళ్ళాలి, ఆ బస్సుకోసం?" అడిగాడతను.

అతడి కళ్ళలోకి ఆమె సూటిగా చూసింది. "రామ్ గారూ, నాన్నతో అబద్ధం చెప్పాను. బస్సులో పిక్నిక్కి ఎవ్వరూ వెళ్ళలేదు. మీతో కాలం గడపాలని నాన్నతో అలా చెప్పాను," అందామె.

తటాలున అతడు కారును ఆపాడు.

"ఇంటికెళ్ళాక మీరు నిజాన్ని నాన్నగారికి చెప్తారా?" అడిగాడతను.

"చెప్పవలసిన అవసరం వస్తేగాని చెప్పను," అందామె.

"కాని నేను నిజం చెప్పాలి," అన్నాడతను.

ఆమె కారులోంచి దిగింది. రామ్ కూడా దిగాడు. ఆమె అతడి వంక సూటిగా చూసింది.

"వెనక కేరియర్ దగ్గిరా వున్న ప్లాస్టిక్ బుట్టవుంది. దాన్ని తీసుకోండి. ఆ కొండ ప్రదేశంలో కూర్చుని

ఏం చేయవలసిందీ ఆలోచించుదాం," అందామె.

"వెనక్కుపోదాం," అన్నాడతను.

"నాకు చాలా ఆకలిగా వుంది. ఏదేనా తింటేగాని కదల్లేను," అందామె.

మరేం గత్యంతరం లేక అతడు ప్లాస్టిక్ బుట్టను తీసుకున్నాడు. ఇద్దరు కొండవైపు నడిచారు. కొండ మొదట్లో వున్న ఒక చెట్టుకింద కూర్చున్నారు.

ఒక ప్లేట్లో పదార్థాలు అన్నీ పెట్టి ఆమె అతడికిచ్చింది.

"మీరు బాగా తినాలి," అందామె.

"బాగా ఆకలిగా వుందని మీరన్నారు. నేను అనలేదు."

"మీకు ఆకలిగా లేదా?"

"నాకు ఆకలి తక్కువ. నేను ఎక్కువగా ఎప్పుడూ తినను," అన్నాడతను.

ప్లేటువైపు చూస్తూ వుండిపోయాడతను. "మీకు పెట్టనా?" ప్రశ్నించాడు.

"నేను పెట్టుకుంటానులెండి."

మరో ప్లేటులో ఆమె వడ్డించుకుంది. ఇద్దరూ తినడం ప్రారంభించారు.

"నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. నాన్న దగ్గర పనిలో చేరినప్పటి నుంచీ మీరు నాకు నచ్చారు. మిమ్మల్ని గాఢంగా ప్రేమిస్తున్నాను. నా గురించి మీకెలా వుందో చెప్పండి!"

"జయగారూ, మీరు చాలా అందంగా వుంటారు. కోటీశ్వరుల కొడుకులు ఎందరో మిమ్మల్ని పెళ్ళాడ్డానికి ముందుకొస్తారు. ప్రేమ నే పదానికి అర్థంలేదు. మీకు

నేను ఏ విధంగానూ సరిపోను."

"మీ బాధ్యతలన్నీ నేను తీసుకుని మీ చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు చేయిస్తాను. మీకు ఏ బెంగా లేకుండా చూస్తాను. మీరు సరే అంటే నాన్నతో మాట్లాడతాను. మన పెళ్ళి జరిగిపోతుంది."

"ప్లీజ్ నన్ను బలవంత పెట్టకండి. ఏ ధనవంతుడూ తన బిడ్డను ఒక పేదవాడి కివ్వడానికి అంగీకరించడు. నాతో మీరు సుఖంగా వుండలేరు."

లంచ్ ముగించి వాళ్ళు చేతులు కడుక్కున్నారు. పాత్రలను రామ్ ప్లాస్టిక్ బుట్టలో పెట్టాడు. ఆమె అతడి వంక అలాగే చూస్తూ వుండిపోయింది.

"ఇక పోదామా?"

ఇద్దరూ లేచారు. అమాంతంగా ఆమె చేతుల్తో అతడిని చుట్టేసింది. అతడి బుగ్గ మీద ముద్దెట్టుకుంది.

"నన్ను వదలండి ప్లీజ్!" అని అర్చాడతను.

ఇద్దరూ కారువైపు నడవసాగారు.

మార్గంలో వుంది ట్రంక్ రోడ్డు. సిగరెట్ కాలుస్తూ రామ్ నడుస్తున్నాడు.

"మీరు సినిమాలు చూస్తారా?"

"నేను సినిమాలు ఎప్పుడూ చూడను."

"టీవీలో వచ్చే సినిమాలను చూడరా?"

"మా యింట్లో టీవీలేదు."

"రామ్‌గారూ' ప్రేమతో యింత దూరం నేను మీతో వచ్చాను. నా ప్రేమను మీతో చెప్పుకున్నాను. కాని మీరు నన్ను చులకనగా చూస్తున్నారు!"

"అలా అనకండి! మిమ్మల్ని దేవతలా నేను చూస్తున్నాను. మీకోసం మరో దేవత భూమ్మీదకు దిగి వస్తే

డని అంటున్నాను," అన్నాడతను.

"ఆ దేవత మీరే!" అందామె.

"మీరు పొరబడ్డారు."

ఇద్దరూ కారులో కూర్చొన్నారు. అతడు కారును వెనక్కి తిప్పి పోనిచ్చాడు.

"ఈ పిక్‌నిక్ విషయం నాన్నతో నేను చెప్పుకుంటాను. మీరేమీ మాట్లాడవద్దు," అందామె.

"అలాగేనండి," అన్నాడతను.

జయ మాట్లాడకుండా మౌనంగా కూర్చుండిపోయింది. రామ్ కారు నడపడంలో నిమగ్నుడయ్యాడు.

కారు పట్నానికి దగ్గరవుతోంది. కన్నీళ్ళతో ఆమె అతడి వంక చూసింది.

"మీలాంటి దద్దమ్మను నే నీ జీవితంలో మళ్ళా చూడను. అవకాశం దొరికితే కోతి కొమ్మెక్కి కూర్చుంటుంది. మీలా బురదలో దొర్లుతూ కూర్చోదు!" అర్చిందామె.

"జయగారు, దయచేసి ఏడవకండి. మిమ్మల్ని నేను ఏడిపించానని లోకం అనుకుంటుంది."

"లోకం! ఎక్కడుంది లోకం! మీకు జీతం యిస్తున్నది నాన్న," అందామె.

అమాంతంగా ఆమె అతడి వంక కోపంగా చూసింది. కాళ్ళతో అతడిని కొట్టింది.

"మిమ్మల్ని నాశనం చెయ్యాలనిపిస్తోంది! మీలాంటి బానిసలు యీ లోకంలో వుండకూడదు!"

"జయగారూ, పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా? నేను మిమ్మల్ని ప్రేమించలేను, మీతో పోరాడలేను. నేను బలహీనుడిని," అన్నాడతను మెల్లగా.

పోర్టికోలో కారు ఆగింది. ఆమె దిగి లోపలకు వెళ్ళిపోయింది. ప్లాస్టిక్ బుట్ట పట్టుకొని రామ్ యింట్లోకి నడిచాడు.

# 4

పరుపుమీద పడుకుని ధర్మారావు ఏదో ఆంగ్లపత్రిక చదువుతున్నాడు.

జయ మెల్లగా గదిలోకి వెళ్ళి అతడి పక్కనే కూర్చుంది.

"ఏమిటమ్మా?" అన్నాడతను.

"నాన్నా, నిన్నొకటి అడగాలి!"

"ఒకటేమిటి వెయ్యి అడుగు!"

"రామ్‌గాడ్ని డిస్‌మిస్ చేసి పొమ్మను నాన్నా."

అతడు ఆశ్చర్యంగా కూతురి వైపు చూశాడు. "ఆరు నెలల క్రితం అతడు ఇక్కడికి వొచ్చాడు. మొదట నువ్వే అతడితో మాట్లాడి నా దగ్గరకు పంపావు. అతడికి ఉద్యోగం ఇయ్యమన్నావు. ఇచ్చాను. ఇప్పుడు పొమ్మంటే బాగోదమ్మా" అన్నాడు ధర్మారావు.

"ఆయనంటే నాకు అసహ్యం నాన్నా. ఆయన్ని చూస్తే గొంగళీ పురుగులు ఒంటిమీద పాకుతున్నట్లు వుంటుంది."

"అతడు చెడ్డవాడా?"

"ఎందుకూ పనికిరాని వాడు. అసమర్థుడు."

కూతురి వంక అతడు సాలోచనగా చూశాడు.

"అయితే అతడిని పొమ్మంటానులే" అన్నాడు.

"నాన్నా, ఐ లవ్ యూ," అని తండ్రి నుదురు మీద ముద్దెట్టుకుని ఆమె వెళ్ళిపోయింది.

ఏర్ కండిషండ్ గదిలో ధర్మారావుకి ఎదురుగా

రామ్ నిలబడివున్నాడు.

"అలా కూర్చో!" అన్నాడు ధర్మారావు.

"ఫరవాలేదు లెండి," అన్నాడతను.

"మా అమ్మాయికీ నీకూ ఏదేనా పోట్లాట జరిగిందా?"

"నేనెవరితోటీ పోట్లాడను, సార్."

"అది నాకు తెలుసు. అమ్మాయితో బీచ్‌కి వెళ్లావు. పిక్‌నిక్‌కి వెళ్ళావు. అక్కడ యేం జరిగిందో నాకు చెప్పు!"

"నన్ను ప్రేమిస్తున్నట్లు ఆమె చెప్పారు. మీకు తెలియకుండా, మీ వెనక ఆమెతో సంబంధం పెట్టుకోవడం నాకిష్టంలేదు. నాకు వుద్యోగమిచ్చి మీరు ఎంతో సహాయం చేశారు. నేను పేదవాడిని. ఆమెకు ఏ విధంగానూ తగనివాడిని. అదంతా ఆమెతో చెప్పాను సార్."

ధర్మారావు నవ్వాడు.

"ఆ నాడు పిక్‌నిక్ లేదుసార్. ఏ బస్సూ రాలేదు. మేమిద్దరమే కొండ ప్రదేశానికి వెళ్ళి, అక్కడ భోజనం చేసి తిరిగి వచ్చాం."

ధర్మారావు అతడి వంక సూటిగా చూశాడు.

"ఇటుపైన నువ్వు నా పెర్సనల్ సెక్రటరీగా వుండ నక్కరలేదు," అన్నాడు ధర్మారావు.

రామ్ తృళ్ళిపడ్డాడు.

"నేను ఏ తప్పూ చెయ్యలేదు సార్. నాకు ఉద్యోగం లేకుండా చెయ్యకండి," అన్నాడు రామ్.

ధర్మారావు అతడి వంక నవ్వుతూ చూశాడు.

"రామ్, నీకు ప్రమోషన్ యిస్తున్నాను. బెంగుళూరులో వున్న నా బాటరీస్ కంపెనీకి నిన్ను మేనే

జర్ గా నియమిస్తున్నాను. జీతం నాలుగు వేలు యిస్తాను. మంచి యిల్లు, కారు అన్నీ సేకిస్తాను."

"మిమ్మల్ని పూజించాలి, సార్."

"మనం పూజించవలసింది దేవుడిని, మనుషులను కాదు," అన్నాడు ధర్మారావు.

ఆ నాటి రాత్రి రామ్ ధర్మారావు కారులో ఇంటికి వచ్చాడు. సెక్రటరీ ఆఫీసు గదిని వెతకసాగాడు. తన బాగ్ వుంది. అందులోని పాంట్, షర్ట్ కనిపించలేదు.

తన బాగ్ పట్టుకుని అతడు హాల్లోకి వెళ్ళాడు. అక్కడ జయ కూర్చుని వుంది.

"జయగారూ, వెళ్ళివస్తానండి," అన్నాడతను.

"వెళ్ళండి. మళ్ళీ రావద్దులెండి," అందామె కోపంగా.

"అలాగేనండి," అని అతడు బయటకు నడిచాడు.

గేటు వైపు పోతున్న రామ్ కేసి విచారవదనంతో చూస్తూ ఆమె వుండిపోయింది.

## 5

ధర్మారావు బీరువా ముందు నిలబడి చూస్తున్నాడు. భార్య పక్కనుంది.

"నా బ్లూ కూట్ యేమైంది?" అడిగాడతను.

"అక్కడే వుంటుంది చూడండి."

"లేదే!"

"లాండ్రీకి పంపారేమో!"

"జయను అడిగి చూడు," అని అతను వరో కూటు ధరించాడు.

మెట్లు దిగి హాల్లోకి వచ్చాడు. ఒంటరిగా జయ అక్కడ కూర్చుని వుంది.

ఆమె మొహంలో నవ్వులేదు. జయ అదోలా వుంది.

"ఏమిటమ్మా, అలా వున్నావు?" అడిగాడు తండ్రి.

"బాగానే వున్నాను," అందామె.

"పెళ్ళి చేస్తేగాని దీని రోగం కుదరదు!" అంది రామాయమ్మ.

"నాకు యే రోగం లేదులే!" అంది జయ.

రామాయమ్మ, ధర్మారావు, జయ డైనింగ్ గదిలోకి నడిచారు.

ముగ్గురూ బ్రేక్‌ఫాస్టు సేవించారు.

"అమ్మాయి నా బ్లూ సూటు లాండ్రీకి పంపావా?"

"లేదు, నాన్నా."

"అనేక వస్తువులు యింట్లో మాయమవుతున్నాయి. ఎవరు పట్టుపోతున్నారో!" అంది రామాయమ్మ.

"అరడజను మంది నౌకర్లు ఎప్పుడూ యింట్లో తిరుగుతూ వుంటారు. పబ్లిక్ పార్కులా వుంది మన ఇల్లు," అంది జయ.

"రామ్ బాగ్‌లో వుండవలసిన పాంటు, షర్టు పోయాయట. అతడు నాతో చెప్పాడు," అన్నాడు ధర్మారావు.

"ఆయన ధరించే చౌకబారు దుస్తులు ఎవరికి కావాలి?" అంది జయ.

"నేను మీతో చెప్పలేదు. వారం రోజుల క్రితం కొత్త స్లిప్పర్సు నేను కొనుక్కున్నాను. అవి ఎక్కడా కనపడ్డంలేదు," అంది రామాయమ్మ.

"నీకు డజన్ల మీద జోళ్ళు వున్నాయమ్మా. కొని యెక్కడో పారేస్తావు," అంది జయ.

"పోయినవాటిని గురించి చర్చించి బుర్ర పాడు చేసుకోకండి," అని ధర్మారావు లేచాడు.

అతడు బయటికి నడిచాడు. కారులో కూర్చున్నాడు. కారు కదిలింది.

తల్లీ కూతురు హాల్లోకి వచ్చారు.

"అమ్మా, నేనోకసారి మా ఫ్రెండు కమల ఇంటికి వెళ్ళివస్తాను" అంది జయ.

"లంచ్ టైముకు వచ్చేయి" అంది తల్లి.

"అలాగే వస్తాను" అని జయ తన కారులో వెళ్లి పోయింది.

ఒంటిగంట దాటాక ఆమె తన ఇంటికి తిరిగి వచ్చింది.

టెలిఫోన్ మ్రోగింది. జయ వెళ్ళి రిసీవర్ని ఎత్తింది.

"హలో!" అంది.

"నేను కమలని" అందో యువతి అటువైపునుంచి.

"హై కమలా, ఏమిటి సంగతి?"

"నీకు ఒక పార్కర్ పెన్ను చూపించాను. నా పుట్టిన రోజున నా భర్త నాకు ప్రెజెంటుగా ఇచ్చారని నీతో చెప్పాను, గుర్తుందా?"

"వుంది" అంది జయ.

"ఆ పెన్ను కనబడ్డంలేదు. నీ హేండ్ బాగ్ లో వుందేమో చూడు!"

"నా హేండ్ బాగ్ లో ఎలా వుంటుంది, సిల్లీ!" అర్చింది జయ.

"జయా, ప్లీజ్! అది పోయిందని వింటే మా ఆయన తిడతారు. ఒకసారి నీ బాగ్ లో చూడు!"

జయ బాగ్ లో చూడలేదు.

"కమలా, బాగ్ లో చూశాను. ఎక్కడా లేదు. నువ్వు బెంగెట్టుకోకు! నీ యింట్లో వెతుకు. ఎక్కడో వుంటుంది. దొరక్కపోతే నాకు ఫోన్ చేసి చెప్పు. అటు

వుంటివే నేను కొని నీకిస్తాను" అంది జయ.

"థాంక్స్ జయా, చూస్తాను."

జయ రిసీవర్ పెట్టేసి, మెట్లెక్కి తన గదివైపు నడిచింది.

# 6

ధర్మారావు కోపంగా భార్య, కూతురివైపు చూశాడు.

"అది చాలా ఖరీదైన వాచ్. అమెరికాలో కొన్నాను. ఎవరో దొంగిలించారు!" అర్చాడతను.

"పనిమనిషి కామిన్ని అడిగిచూద్దాం" అంది రామాయమ్మ.

కాసేపట్లో కామిని గదిలోకొచ్చింది.

"అయ్యగారి వాచ్ ఆ టేబుల్ మీద వుండాలి. నువ్వు యీ గది తుడిచావు. ఆ వాచ్‌ని చూశావా?" అడిగింది రామాయమ్మ.

"చూడలేదమ్మా" అంది కామిని.

"ఈ యింట్లోని వస్తువులు ఎన్నో పోయాయి. పోలీసు రిపోర్టు యిస్తున్నాను" అన్నాడు ధర్మారావు కోపంగా.

"నాకేం తెలవదయ్యా ఎన్నేళ్ళగానో యిక్కడ పనిచేస్తున్నాను. ఎన్నడూ నేనేదీ తీయలేదయ్యా."

ధర్మారావు కూతురివైపు చూశాడు.

"డైరక్టరీలో వున్న నంబరు చూసి యిన్‌స్పెక్టర్ నాయర్‌ని యిక్కడకు రమ్మను. నా పేరు చెప్పు!"

"అలాగే నాన్నా" అని జయ ఫోన్ దగ్గరకు నడిచింది.

ఇన్‌స్పెక్టర్ నాయర్‌తో మాట్లాడి ఆమె తిరిగి వచ్చింది.

"ఇన్‌స్పెక్టర్ నాయర్ వస్తున్నారు, నాన్నా" అంది

జయ.

పదినిమిషాల తర్వాత ఇన్‌స్పెక్టర్ నాయర్ ధర్మారావును కలుసుకున్నాడు.

"ఏం జరిగిందో చెప్పండి!"

"నా అమెరికన్ రిస్టువాచ్‌ని యెవరో దొంగిలించారు మిష్టర్ నాయర్. అది స్పెషల్ టైపు వాచ్. డే, డేటు వుంటాయి. ఇండియన్ టైమ్నీ, గ్రీన్‌విచ్ టైమ్నీ చూపిస్తుంది. చంద్రుడు ఆకాశంలో యే రూపంలో వున్నదీ ఆ వాచ్‌లో చూడొచ్చు. అలారామ్ కొడ్తుంది. దాని ఖరీదు వెయ్యి డాలర్స్" అన్నాడు ధర్మారావు.

"మీరు ఎవర్ని అనుమానిస్తున్నారు?"

"ఈ యింట్లో ఆరు మంది నౌకర్లు వున్నారు. వాళ్ళందర్నీ అనుమానించాలి. మీరు వాళ్ళతో మాట్లాడి చూడండి. అందర్నీ ముందు వరండాలో వుండమన్నాను."

ఇన్‌స్పెక్టర్ నాయర్ బయటకు నడిచాడు. వరండా మీద ముగ్గురు స్త్రీలు, ముగ్గురు పురుషులు వున్నారు. రామాయమ్మ వాళ్ళను యిన్‌స్పెక్టర్ నాయర్‌కి పరిచయం చేసింది.

"అతను పుల్లయ్య. ఇంటికి కావలసిన వస్తువులు కొని తెస్తూ వుంటాడు. రెండో అతను రాముడు. ఇంట్లో పనులు చూస్తూవుంటాడు. మూడోవాడు రాజు. బాత్ రూమ్‌లను శుభ్రపరుస్తూ వుంటాడు. ఓవర్ హెడ్ టాంక్ లనుకూడా అతడే చూస్తాడు."

ఇన్‌స్పెక్టర్ నాయర్ తల పంకించాడు.

"ఆమె కామిని. పై గదులు తుడుస్తూ వుంటుంది. రెండోది కాంత. కింద గదులను తుడుస్తుంది. మూడోది రమణి. అంటుపాత్రలను కడుగుతూ వుంటుంది."

ఇన్‌స్పెక్టర్ నాయర్ వాళ్ళను ప్రశ్నించడం ప్రారంభించాడు. అందరి మొహాల్లోనూ భయం గోచరిస్తోంది.

రామాయమ్మ హాల్లోకి వెళ్ళింది. భర్తవంక నవ్వుతూ చూసింది.

"వాళ్ళందరూ భయపడుతున్నారు. ఇన్‌స్పెక్టర్ని పొమ్మనడం మంచిదేమో!" అందామె.

"ఇన్‌స్పెక్టర్ని చూసి భయపడి యిటుపైన దొంగతనాలు మానేస్తారు" అన్నాడు ధర్మారావు.

అరగంట తర్వాత ఇన్‌స్పెక్టర్ నాయర్ హాల్లోకి వచ్చాడు.

"ఇదే కాంపౌండ్‌లో ఆ నౌఖర్లు వుండే గదులన్నీ సోదాచేసి వచ్చాను సార్. మీ వాచ్ ఎక్కడా లేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ధర్మారావు గంభీరంగా నవ్వాడు.

"మిస్టర్ నాయర్, దొంగలించబడిన వస్తువు అంత సులువుగా మన కంటబడదు. అది యెక్కడికో అమ్మకానికి వెళ్ళొచ్చు. యూ మస్టు బి వాచింగ్!" అన్నాడతను.

"తప్పకుండా వాచ్ చేస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

జయ అప్పుడే హాల్లోకి వచ్చింది. ఆమెవంక ఇన్‌స్పెక్టర్ ఓరగా చూశాడు.

"ఈమె నా కూతురు జయ" అన్నాడు ధర్మారావు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమెకు నమస్కరించాడు. ఆమె ప్రతినమస్కారం చేసింది.

"ధర్మారావుగారూ, ఈ నౌఖర్లు కాక మరెవరేనా యిక్కడ వున్నారా?"

"ఇద్దరు డ్రయివర్లు వున్నారు. వంటామె వుంది. గూర్ఖా వున్నాడు. కాని వాళ్ళు యింట్లోకి సాధారణంగా రారు" అన్నాడతను.

ఇన్‌స్పెక్టర్ నాయర్ తల ఆడించాడు.

ధర్మారావు అతడికి ఒక కవర్ను అందించాడు. "మీ అమ్మాయి పెళ్ళికి డబ్బు కావాలన్నారు. అందులో వుంది. ఇరవైఐదువేలు" అన్నాడు ధర్మారావు.

"థాంక్స్ సార్! మీ వాచ్ యేమైందో నేను కనుక్కుంటాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

## 7

రామాయమ్మ, ధర్మారావు సోఫాలో పక్కపక్కనే కూర్చున్నారు.

"జయ యేదీ?"

"బీచ్ కని వెళ్ళింది. ఇంకా రాలేదు!"

"డ్రయివర్ని పంపావా?"

"డ్రయివర్ వద్దంటుంది! దాన్ని గురించి ఆలోచిస్తూంటే నా బుర్ర పాడవుతోంది. ఏదో సంబంధం చూసి దానికి పెళ్ళి చేసేస్తే మన కే బెంగా వుండదు."

"చూద్దాం" అన్నాడు ధర్మారావు సాలోచనగా.

ముగ్గురూ డిన్నర్ సేవిస్తున్నారు. జయ మౌనంగా తింటోంది.

"జయా, నీ ఆరోగ్యం బాగాలేదా?" తండ్రి ప్రశ్నించాడు.

"డాక్టర్ కేశవ్ నిన్ననే చెకప్ చేశారు. గుండు

పిక్కలా వున్నానన్నారు" అంది జయ.

"కాని నీలో యేదో మార్పుంది!"

"నాలో లేదు, మీరు వూహించుకొంటున్నారు."

"చేంజ్ ఆఫ్ ప్లేస్ నీకు బాగుంటుంది. నేను రేపు బెంగుళూరు వెళ్తున్నాను. నువ్వు నాతో రా!"

"ప్లేన్‌లో అయితే వస్తాను. ఆకాశంలో యెగురుకు పోవాలని వుంది నాకు!" అందామె.

"ప్లేన్‌లోనే పోదాం" అన్నాడు తండ్రి.

ఆమె సంతోషంగా తండ్రివైపు చూసింది. "జాలిగా వుంటుంది, నాన్నా" అందామె.

మర్నాడు ధర్మారావు, జయ బెంగుళూరు చేరుకున్నారు. హోటల్ రియోలో డబుల్ రూమ్ విత్ డ్రాయింగ్ రూమ్ తీసుకొన్నారు.

ధర్మారావు యేదో మీటింగ్‌కి వెళ్ళాడు. స్నానం చేసి జయ పత్రికను చూస్తోంది.

టెలిఫోన్ మ్రోగింది.

"హలో!" అందామె.

"ధర్మారావుగారికి కాల్ మిస్" అంది టెలిఫోన్ ఆపరేటర్.

"ఎవరు కాల్ చేస్తున్నారు?"

"రామారావుగారు!"

ఆ పేరు విని ఆమె తృళ్ళిపడింది.

"కనెక్షన్ యివ్వండి!" అందామె.

అటువైపునుంచి రామ్ కంఠం వినబడింది.

"నేను జయను. రామ్‌గారా?" అందామె.

"జయగారూ, నమస్కారం. నేను రామ్‌నే."

"ఈ పట్నంలో యేం చేస్తున్నారు?"

"ఇక్కడో బేటరీస్ కంపెనీకి మేనేజర్ గా వుంటు న్నాను."

"మీ చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు అయ్యాయా?"

"ఇద్దరికి పెళ్ళిళ్ళు అయ్యాయి."

"కొంతవరకూ బాధ్యత తీరింది" అందామె.

"ఇంకా యిద్దరు వున్నారు. వాళ్ళు చదువుకుంటు న్నారు."

"మీరు ఎక్కడనుంచి మాట్లాడుతున్నారు?"

"మా ఆఫీసునుంచి."

"వెంటనే యిక్కడకు రండి. మీతో మాట్లాడాలి" అందామె.

"వస్తానండి" అన్నాడతను.

రిసీవర్ పెట్టేసిందామె. మేకప్ చేసుకొని చక్కటి దుస్తులు ధరించింది. సోఫాలో కూర్చుని అతడి రాక కోసం యెదురుచూసింది.

ఎవరో తలుపును తట్టారు.

"కమిన్!" అందామె.

తలుపు తోసి రామ్ లోపలకొచ్చాడు. క్షణకాలం ఆమెవంక చూస్తూ వుండిపోయాడు.

జయ అతడివంకే చూస్తోంది. చక్కటి సూటులో వున్నాడతను. యెంతో ఆకర్షణీయంగా కనిపిస్తు న్నాడు.

"ఇలా కూర్చోండి" అందామె తన పక్క సీటు చూపిస్తూ.

ఎదురుగా వున్న మరో పెద్ద సోఫాలో అతడు కూర్చున్నాడు.

"మిమ్మల్ని చూసి సంవత్సరం దాటింది....!"

అందామె.

"కాలం దొర్లిపోతూ వుంటుంది, జయగారూ" అన్నాడతను.

ఆమె లేచి నిలబడింది. అతడి వంక నవ్వుతూ చూసింది.

మెల్లిగా వెళ్ళి అతడి పక్కనే కూర్చుంది.

"అక్కడ బోరు కొట్టి బెంగుళూరు వచ్చాను. మీరు నన్ను కారులో తిప్పాలి" అందామె.

రామ్ నవ్వాడు.

"జయగారూ, నా కంతగా తీరిక వుండదు. కంపెనీ పనితో సరిపోతుంది."

"ఆ కంపెనీ ఎవరిది?"

"మీ నాన్నగారిది!"

ఆమె తృళ్ళిపడింది. రామ్ గురించి ఆమె ఆలోచిస్తోంది. నాన్న అతడిని డిస్‌మిస్ చేసి పొమ్మనలేదు. మరో ఉద్యోగం యిచ్చి తనకు దూరంగా పంపేశాడు!

తటాలున ఆమె అతడి చెయ్యి పట్టుకొంది. అతడి కళ్ళలోకి చూసింది.

"సంవత్సరం దాటినా నా ప్రేమ తరగలేదు!" అందామె.

అతడు మౌనం వహించాడు. చేతులో చుట్టేసి ఆమె అతడి పెదిమలను ముద్దెట్టుకుంది. అతడు దూరంగా జరగలేదు.

"రామ్, నాన్నతో మన పెళ్ళి గురించి మాట్లాడుతాను" అందామె.

"మీ యిష్టం" అన్నాడతను.

# 8

రామ్ తన యింటి అల్లుడు కాకూడదని రామాయమ్మ యెంతగానో మురబెట్టుకుంది. కాని ఆమె పెళ్ళిని ఆప లేకపోయింది.

"రామ్ బుద్ధిమంతుడు, తెలివైనవాడు. అమ్మాయి అతడితో సుఖంగా బతుకుతుంది," అన్నాడు ధర్మారావు.

రోజులు వేగంగా గడిచిపోయాయి. రామ్, జయలు భార్యాభర్తలయ్యారు.

రామ్ తల్లి, యిద్దరు చెల్లెళ్ళు పెళ్ళి తర్వాత ధర్మారావు యింటికి మారిపోయారు. కింద భాగంలో వున్న గదుల్లో వాళ్ళు వుంటున్నారు.

రామ్, జయ హనీమూన్‌కి ఊటీ వెళ్ళారు. స్పెన్సర్ హోటల్లో గది తీసుకున్నారు.

రామ్ హోటల్ గదిలో అన్ని చోట్లా వెతుకుతున్నాడు.

"రామ్, దేనికోసం చూస్తున్నావు?" అంది జయ.

"నా సిగరెట్ కేస్ కనపడ్డంలేదు! పెళ్ళిలో మీ నాన్నగారు నాకిచ్చారు. గోల్డు కేసు!"

"ఏ హోటల్ నౌఖరో పట్టుకుపోయి వుంటాడు" అందామె.

"హోటల్ మేనేజర్కి కంప్లెయింట్ యిస్తాను" అన్నాడతను.

"పోతేపోనీ గొడవ చెయ్యకు!"

"మన వస్తువులు పోతూంటే వూరుకోకూడదు. నోరు మూసుకు కూర్చుంటే యింకా యెన్నో పోతాయి" అన్నాడతను.

"రామ్, నాకిక్కడ నచ్చలేదు. మనం కాశ్మీర్ పోదాం" అందామె.

"అలాగే పోదాం. రెండు నెలలపాటు తిరిగి ఇంటికి రమ్మన్నారు నీ నాన్నగారు" అన్నాడతను.

కాశ్మీర్, డార్జిలింగ్ మొదలగు ప్రదేశాలన్నీ తిరిగి రామ్, జయలు యింటికి తిరిగివచ్చారు.

రోజులు సుఖంగా సాగిపోతున్నాయి. ధర్మారావుతో కలిసి రామ్ అన్ని కంపెనీలనూ మేనేజ్ చేస్తున్నాడు.

ఆ రోజు శనివారం. పొద్దుటే రామాయమ్మ అరవడం ప్రారంభించింది.

"నా బంగారు గాజులు రెండు కనబడ్డంలేదు" అర్చిందామె.

"ఎవరు యీ గదిలోకి వచ్చారు?...." అడిగాడు రామ్.

"అందరూ వస్తారు. నీ చెల్లెళ్ళు వచ్చారు. జయ వచ్చింది. ఎవర్ని అనుమానించడం?" అందామె వ్యంగ్యంగా.

రామ్ కోపంగా ఆమెవైపు చూశాడు.

"నా చెల్లెళ్ళు ధనవంతులు కాకపోవచ్చు. కాని వాళ్ళు పరాయి సొత్తును ఎన్నడూ ముట్టుకోరు" అన్నాడు రామ్.

"వాళ్ళ గదులు సోదా చేస్తే నిజం బయటపడుతుంది" అంది రామాయమ్మ.

ధర్మారావు అప్పుడే వచ్చాడు. భార్య మాటలు అతడి చెవిన పడ్డాయి.

"సోదా యేమిటి? నోరు మూసుకో! పిచ్చిగా వాగకు!" అర్చాడు ధర్మారావు.

"ఎవరుండవలసిన స్థలంలో వాళ్ళుంటే ఏ సమస్యలూ వుండవు!" అందామె.

"ఎవర్నీ నొప్పించకుండా జీవించడం నేర్చుకోవాలి నువ్వు! వాళ్ళు యీ మధ్యనే వచ్చారు. ఇంతకుముందు నా వాచ్ పోయింది! గుర్తుందా?"

"పోలీసు రిపోర్టు యివ్వండి!" అందామె.

"అదంతా అనవసరం. ఆ గాజులను గురించి యింక మాట్లాడకు!" అన్నాడు ధర్మారావు.

ధర్మారావు మెల్లిగా రామ్ ముందుకు నడిచాడు.

"రామ్, ఎన్నేళ్ళుగానో యీ యింట్లో దొంగతనాలు జరుగుతున్నాయి. నువ్వు చాలా తెలివైనవాడివి. యేం జరుగుతుందో కనుక్కో" అన్నాడు ధర్మారావు.

"కనుక్కుంటాను" అన్నాడు రామ్.

## 9

ఏదో పీడ కలొచ్చి గాఢనిద్రలోంచి రామ్ మేల్కొన్నాడు. పక్క పడుకున్న జయ మీదకు చెయ్యిని పోనిచ్చాడు.

కళ్ళు తెర్చి చూశాడు. పక్కమీద జయ లేదు. ఆమె యేమైంది? ఇంత రాత్రివేళ యెక్కడికెళ్ళింది?

రామ్ కిందకు దూకాడు. పక్క గదిలోకి నడిచాడు. నిలబడి వెనకగది గుమ్మంవంక చూశాడు. తలుపు దగ్గర వున్న జయకేసి అతడు ఆశ్చర్యంగా చూశాడు.

తాళం తీసి ఆమె లోపలకు వెళ్ళింది. ఏవో వస్తువులను గదిలో పడేసి తాళం వేసిందామె.

రామ్ వెనక్కు వెళ్ళాడు. ఏమీ తెలియనట్లు తన పరుపుమీద పడుకున్నాడు. కాస్సేపట్లో జయ వచ్చింది. తాళంచెవిని పరుపు కింద పెట్టి పక్కనే ఆమె పడు

కొంది.

రామ్ నిద్రబోయినట్లు నటిస్తున్నాడు. గంట తర్వాత అతను లేచాడు. పక్క నున్న భార్యవైపు చూశాడు. కనురెప్పలు కదలడంలేదు. ఆమె గాఢనిద్రలో వుంది.

రామ్ కిందకు దిగాడు. పరుపుకింద దాచిన తాళం చెవిని తీశాడు. మెల్లిగా వెనుక నున్న గదివైపు నడిచాడు.

తలుపుకు పెద్ద తాళంకప్ప వేసివుంది. అతడు తాళాన్ని తెర్చాడు. లోపల చీకటిగా వుంది. గదిలోకి వెళ్ళి స్విచ్ ఆన్ చేశాడు. లైటు వెల్గింది.

మొజయిక్ ఫ్లోర్ మీద వున్న వస్తువులవైపు ఆశ్చర్యంగా చూశాడు.

బట్టలు! వాచ్‌లు! పెన్నులు! బంగారం నగలు, రకరకాల చెప్పులు, ఊటీలో మాయమైన తన గోల్డు సిగరెట్ కేసు నేలమీద పడుంది. సంవత్సరం క్రితం పోయిన తన పాంటు, షర్టు అక్కడ పడున్నాయి.

ఆశ్చర్యంతో అతడు గదిలోని వస్తువులవైపు చూస్తూ వుండిపోయాడు. రామాయమ్మ పోయాయన్న బంగారు గాజులు నేలమీద పడున్నాయి!

ఎన్ని వస్తువులనో దొంగిలించి జయ రహస్యంగా ఆ గదిలో పడేసి తాళం వేస్తోంది. ఆమె ఎందుకిలా చేస్తోంది?

రామ్ బయటకొచ్చి తలుపు మూసి తాళం వేశాడు. తాళంచెవిని పరుపుకింద వుంచి తన భార్య పక్కనే పడుకున్నాడు. చాలాసేపటివరకూ అతడికి నిద్ర పట్టలేదు. ఆమెను గురించే ఆలోచిస్తున్నాడు!

ప్రొద్దుటే రామ్ లేచాడు. జయ ఎనిమిదిదాకా

లేవదు. వరండాలో కూర్చుని గడ్డం గీసుకుంటున్న ధర్మా రావు ముందుకు నడిచాడు.

రామ్‌వైపు ధర్మారావు నవ్వుతూ చూశాడు.

"నిన్న మీరు నాకొక పని కల్పించారు. రాత్రి విచిత్ర మైన పరిస్థితుల్లో దొంగ యెవరో గుర్తించగల్గాను" అన్నాడు రామ్.

"ఎవరు?" అడిగాడు ధర్మారావు.

"మీరు నాతో రండి. ఆ గదిలోకి వెళ్ళిచూద్దాం" అన్నాడు రామ్.

షేవింగ్ మానేసి ధర్మారావు లేచి నుంచున్నాడు.

"పద!"

తాళం తెర్చి ఆదే గదిలోకి యిద్దరూ వెళ్ళారు. అక్కడ పడున్న వస్తువులవైపు ధర్మారావు ఆశ్చర్యంగా చూశాడు. తన అమెరికన్ వాచ్‌ని తీసుకుని చేతికి కట్టు కున్నాడు.

"ఈ గదిలో వీటిని ఎవరు పడేశారు?"

"మీ అమ్మాయి జయ!"

ధర్మారావు ఉలిక్కిపడ్డాడు.

"దొంగిలించవలసిన ఖర్మ దానికెందుకు పట్టుంది? ఏది కావాలన్నా ఆమె క్షణంలో కొనగలదు!"

"కొనడంలో ఆమెకు త్రిల్ లేదు. ఇలా దొంగిలించి దాచడంలో యేదో త్రిల్‌ను ఆమె పొందుతూవుండాలి. ఆమె దొంగ కాదు. క్లెప్టో మేనియాక్! అదొక మానసిక రోగం. దొంగిలించవలసిన అవసరం ఆమెకు లేదు. వాటిని ఆమె వాడడం లేదు. దొంగిలించిన వస్తువులను యీ గదిలో పడేస్తోంది" అన్నాడు రామ్.

ధర్మారావు రామ్ భుజంమీద చెయ్యివేశాడు.

"రామ్ దీన్ని గురించి యెవ్వరికీ చెప్పకు. నా భార్యకు కూడా తెలియకూడదు. ఇటువంటి అమ్మాయి ఇలా చేయకుండా మనం జాగ్రత్తపడాలి. ఏం చేద్దాం."

"ఇదే పట్నంలో నా ఫ్రెండ్ వున్నాడు. అతడు అమెరికాలో చదువుకుని వచ్చాడు. చాలా పేరున్న సైకియాట్రిస్టు. అతడిని కలుసుకుంటే ఏం చేయవలసిందీ చెప్తాడు" అన్నాడు రామ్.

"వెంటనే కల్సుకోడం మంచిది" అన్నాడు ధర్మారావు.

ఇద్దరూ బయటకొచ్చారు. రామ్ తాళం వేశాడు. తాళంచెవిని పరుపుకింద పెట్టాడు.

ధర్మారావు షేవ్ చేసుకోసాగాడు.

"ఆ గదిని నువ్వెలా కనుక్కున్నావు?"

క్రితం రాత్రి జరిగినదంతా రామ్ వివరంగా చెప్పాడు.

"రామ్, దీన్ని గురించి యే ప్రచారం లేకుండా మనం జాగ్రత్తపడాలి" అన్నాడు ధర్మారావు.

రామ్ నవ్వుతూ అతడివైపు చూశాడు.

"ఆమె నా భార్య. మీ కూతురు. బయట వాళ్ళకు యేమీ తెలియకుండా నేను వ్యవహరిస్తాను" అన్నాడు రామ్.

—:అయిపోయింది:—

# మతి తప్పిన ఆఫ్రికా ఏనుగు!

కె. వి. రమణ

మధ్య ప్రదేశ్ అడవులన్నిటినీ మించగల కీకారణ్యప్రాంతమది. సన్నని తారు రోడ్డు పొడవాటి నల్ల త్రాచులా వుంది. జాతీయ రహదారిని అరణ్యంతో కలిపే పిల్లమార్గమది. అడవి జంతువులు పట్టపగలే ఆ మార్గం మీద పెలాపచ్చీసుగా తిరుగుతూ వుంటాయి. దారి పొడవునా రాక్షసుల్లా నిలిచివుండే బ్రహ్మాండమయిన వృక్షాలు ఆ రహదారికి అహర్నిశలూ చల్లని నీడను ప్రసాదిస్తూ వుంటాయి.

కన్ను పొడుచుకున్నా కానరాని అమావాస్య రాత్రులవి. క్రూరమృగాల అరుపులు అడపాదడపా కర్ణకఠోరంగా వినవస్తున్నాయి.

రోడ్డుకి ఎడంగా ఆగివుందొక జీపు. స్టీరింగు వీలుమీద ఛాతీ ఆనించి గడ్డాన్ని చేతులమీద వుంచి తదేకంగా ముందుకు చూస్తున్నాడు మంగల్ సేన్. చూసి చూసి కళ్ళు నొప్పులు పెడుతున్నాయి. చీకటి తప్ప మరేదీ

లేదు ఎదురుగా. చిరాగ్గా కళ్ళు నులుముకొని వాచీకేసి చూశాడు. రేడియమ్ డయల్ పన్నెండు చూపిస్తోంది. సీటుమీద పడిగాపులు కాస్తున్న విస్కీ బాటిల్ని ఎత్తి గడగడ తాగేసాడు మంగల్ సేన్. బుడ్డి ఖాళీ! పక్కకు విసిరికొట్టాడు.

రోడ్డుమీద దూరాన లైట్లు వెలుగుతూ ముందుకొస్తున్నాయి. చటుక్కున ముందుకు వంగాడు మంగల్. లైట్లు మూడుసార్లు వెలుగుతూ ఆరాయి. పైలట్ కారది.

“అరేయ్!” హుషారుగా అరిచాడు మంగల్. జీపు వెనక కూర్చున్న మంగల్ అనుచరలు నలుగురూ ఒకేసారి “జీ! సర్దార్” అన్నారు.

“పైలట్ వచ్చేస్తోంది. సిద్ధంగా వుండండి” అన్నాడు మంగల్. అనుచరులు నలుగురూ హడావుడిగా జీపు దిగారు.

రయ్యిన వస్తూ జీపు దాటి రోడ్డుప్రక్క ఆగింది కారు. కారులోనుండి దిగారిద్దరు. వారిలో ఒకడు పరుగున వచ్చి మంగల్కి సెల్యూట్ చేస్తూ “లారీ వస్తోంది సర్దార్” అన్నాడు వినయంగా.

“అచ్ఛా! ముందు రోడ్డు బ్లాక్ చెయ్యండి” కేకేసాడు మంగల్. మంగల్ అనుచరులు రోడ్డుకి అడ్డంగా పెద్ద బండరాళ్ళను దొర్లించసాగారు. దూరంగా లైట్ల వెలుతురు ప్రత్యక్షమయింది.

“లారీలో ఎందరున్నారు?” కారులో వచ్చినవాణ్ణి ప్రశ్నించాడు మంగల్.

“ఇద్దరే సర్దార్.”

“అచ్ఛా! మన పని మరింత సులువన్న మాట.”

“అంతా రెడీ సర్దార్!” రోడ్ని పూర్తిగా బ్లాక్ చేసి

వచ్చి చెప్పాడో కదు.

"అచ్ఛా! అంతా జాగ్రత్తగా వినండి. కొందరు యిక్కడే రాళ్ళముందు కాపుకాయండి. ఓ ఇద్దరు బాగా ముందుకుపోయి లారీ ఆగిన వెంటనే వెనకనుండి కవర్ చెయ్యండి. ఎట్టి పరిస్థితిల్లోనూ తుపాకులు పేల్చవద్దు. తుపాకీ పేలిందా? ఏనుగు బెదిరిపోతుంది. వాటిని కేవలం లారీ సిబ్బందిని బెదరగొట్టేందుకే వుపయోగించాలి. అర్థమయిందా?" అనుచరుల మొహాలుచూస్తూ అన్నాడు మంగల్. వారంతా తలలూపారు బుదిగా.

"అచ్ఛా లారీ వచ్చేసింది. పరుగెత్తండి."

మంగల్ అనుచరులు తుపాకులు చేతబట్టి వెనక్కి పరుగుతీసారు. లైట్లు క్రమేపీ చేరువయ్యాయి. రోడ్డుకి అడ్డంగా వున్న బండరాళ్ళకు సుమారు యాభై అడుగుల దూరంలో కీచుమనే రొదతో ఒక్కసారిగా ఆగిందా భారీ వాహనం.

"డ్రైవర్!" కంచు గంటలా మోగింది మంగల్ కంఠం. అటునుండి యే అలికిడీలేదు. మంగల్ తిరిగి గట్టిగా!

"డ్రైవర్! నే చెప్పేది సరిగా విను. లారీని మా కప్పగించి లొంగిపోండి. కాదంటే మిమ్మల్ని చంపి లారీని స్వాధీనం చేసుకోవలసి వుంటుంది. యే సంగతీ చెప్పేందుకు మీకు రెండే నిమిషాలు గడువిస్తున్నాను" అన్నాడు.

లారీ కేబిన్‌నుండి ఓ శిరస్సు బయటకు వంగి "అరే భాయ్! లారీలో సామ్మా గిమ్మా లేదు భాయ్! వుత్తా ఖాళీగా వుంది" అంది గట్టిగా.

"ఆ సంగతి మాకు తెలుసు. మీకిచ్చిన గడువులో

అప్పుడే ఒక నిమిషం గడిచిపోయింది" వాచీ వంక చూస్తూ అన్నాడు మంగల్ హెచ్చరికగా.

లారీ డ్రైవరు, క్లీనరు రెండో నిమిషం గడవకముందే చేతులెత్తి బయటకొచ్చేసారు. మంగల్ మనుషులు వారిద్దరినీ తుపాకులతో కవర్ చేస్తూ వెనక్కి నడిపిస్తున్నారు.

ఈలోగా అదనుచూసి లారీ క్లీనరు మంగల్ అనుచరుడొకణ్ణి ప్రక్కకుతోసి పారిపోయే ప్రయత్నం చేసాడు. అటువంటి సంఘటన వూహించని మంగల్ అనుచరుడు తత్తరపాటులో తుపాకీ పేల్చాడు. అయితే అది కాస్తా గురి తప్పి లారీ ముందు టైరును పేల్చేసింది.

తుపాకీ చప్పుడు, వెనువెంటనే టైరు పేలిన చప్పుడు కలిసి ఏనుగును బెదరగొట్టేసాయి. ఏనుగు భయంతో చిందులు తొక్కడం అదే సమయంలో టైరు పేలి బండి ఒకప్రక్కకు ఒరగడం జరిగి సుమారు వంద అడుగుల పల్లంలోకి దొర్లిపోయింది లారీ.

ఈ హడావుడిలో లారీ డ్రైవరు, క్లీనరు పత్తా లేకుండా చీకట్లో కలిసిపోయారు. ఇదంతా చూసి మంగల్ పిచ్చివాడిలా జుత్తు పీక్కుంటూ

"రాస్కెల్, ఇడియట్స్! మిమ్మల్ని నరికి పోగులు పెట్టినా పాపంలేదు. వెళ్ళండి. కిందకుపోయి చూడండి. ఏనుగు తప్పించుకుందా మీ చర్మం వలిచి మాంసాన్ని కాళీమాతకు నైవేద్యం పెడతాను వెళ్ళండి.... వెళ్ళండి" గొంతు బొంగురుపోయేలా అరిచాడు మంగల్.

మంగల్ అనుచరులు పడుతూ లేస్తూ పల్లంలోకి దాదాపుగా దొర్లుతూ పోయారు. ఖాళీ లారీ వెక్కిరిస్తూ

అగుపడింది వారికి. ఏనుగు యెక్కడా అయిపులేదు. మంగళ్ అనుచరుల మొహాలు నల్లగా మాడిపోయాయి:

## 2

జీపు దిగి సిగరెట్టు వెలిగించి గట్టిగా ఓ దమ్ము లాగాను.

అరుణోదయ కాంతుల మధ్య ఇంద్రభవనాన్ని మించి వెలిగిపోతుందా తెల్లని భవంతి. ప్రతాప్ సింగ్ ఆ ప్రాంతంలో మకుటం లేని మహారాజు. కొన్ని సంవత్సరాల క్రితం వీధుల్లో చిల్లరమల్లర రౌడీయిజం నడిపిన ప్రతాప్ సింగ్ ఇవ్వాళ ఇంతటి ధనవంతుడెలా కాగలిగాడో యెవరికీ అంతుపట్టని రహస్యం. ఏమయితేనేం అతనిప్పుడొక ప్రముఖ వజ్రాల వ్యాపారి.

వజ్రాల వ్యాపారిగా ప్రతాప్ సింగ్ తరచూ దేశ విదేశాల్లో సంచరిస్తూ విశ్రాంతి లేకుండా వుంటాడు. అయితే అతనికీ నాలాగే వేట పిచ్చి వుంది. ఏమాత్రం వీలుచిక్కినా తుపాకీ చేతబట్టి అడవుల్లో వాలతాడు ప్రతాప్. అలా అపుడపుడూ మేమిద్దరం యే కొండ కోనల్లోనో కలిసి వేటముచ్చట్లు చెప్పుకునే వాళ్ళం.

"థాంక్స్ విక్రమ్! కబురు పెట్టగానే వచ్చినందుకు చాలా సంతోషం. ప్రయాణంలో బాగా అలసినట్టున్నారు. విశ్రాంతి తీసుకోండి. తర్వాత మాట్లాడదాం" అన్నాడు ప్రతాప్ నవ్వుతూ నా చేతులు రెండూ ఆప్యాయంగా పట్టుకొని.

నిజమే! రాత్రంతా ఏకబిగిన మధ్యప్రదేశ్ కీకారణ్యాలగుండా ఒంటరిగా జీపు నడుపుకు వచ్చానేమో చాలా బడలికగా వుంది. ప్రతాప్ నా కోసమని కేటాయించిన గదిలో దూరి మంచమెక్కాను.

ఆ పడుకోవడం తిరిగి మధ్యాహ్నం రెండుగంటల వేళకు లేచాను.

పనివాడు నేను యెప్పుడు లేస్తానో అని యెదురు తెన్నులు చూస్తున్నట్టున్నాడు. వెంటనే వచ్చి "బాబూ! స్నానం కానివ్వండి. భోజనం చల్లారిపోతోంది" అన్నాడు.

భోజనం మాట వినపడడమే తడవు కడుపులో మంటలు విజృంభించాయి. స్నానం అయిందనిపించి తిండి పనిలో పడ్డాను. బ్రేవుమని త్రేన్చుతూ సోఫాలో వాలి సిగరెట్ వెలిగిస్తుండగా ప్రతాప్ వచ్చాడు.

ప్రతాప్ వెంట ఓ ఇరవయ్యేళ్ళ యువతి వుంది. తెల్లగా మిసమిసలాడుతూ మెరుపుతీగలా వుంది. ప్రతాప్ ఆ యువతిని నాకు పరిచయం చేస్తూ!

"విక్రమ్! ఈమె నా సెక్రటరీ! పేరు సవిత" అన్నాడు. సవిత నవ్వుతూ నాకు నమస్కరించింది.

"బాస్ అపుడపుడూ చెబుతుంటారు మీ విషయం. ఒక వేటగాడు మరొక వేటగాణ్ని పొగడడం చాలా అరుదయిన విషయం. ఒకవేళ అదే జరిగితే అవతలి వ్యక్తి నిశ్చయంగా గొప్ప వేటగాడన్నమాట. మిమ్మల్ని కలిసినందుకు నేను చాలా ఆనందపడుతున్నాను" అంది సవిత.

నేను నవ్వుతూ "అంతగా పొగిడెయ్యకండి. నేనొక మామూలు వేటగాణ్ని మాత్రమే" అన్నాను.

ప్రతాప్ సింగ్ సంభాషణ మారుస్తూ "విక్రమ్! మనం అసలు విషయానికి వద్దాం. నువు రెడీయే కదూ?" అన్నాడు. మౌనంగా తల వూపాను రెడీయే నన్నట్టు.

"అయితే నా గదికి పోదాం రండి" అంటూ లేచాడు ప్రతాప్. ముగ్గురం ప్రతాప్ గదిలోకి నడిచాం. ప్రతాప్

గది చాలా ఆధునాతనంగా విలాసవంతంగా వుంది. కేవలం అలంకరణకోసమే కొన్ని లక్షలు ఖర్చుచెయ్యా యంటే అతిశయోక్తి కాదు.

ముగ్గురం కుర్చీల్లో ఆశీనులయ్యాం.

"విక్రమ్! నేను నీకొక ప్రమాదకరమయిన పని అప్ప గించాలనే ఉద్దేశంతో పిలిపించాను. మొన్న సీలేరు అడవుల్లో నువు నరమాంస భక్షకుణ్ణి ఎదుర్కొని చంపిన సంగతి విన్నాను. కంగ్రాచ్యులేషన్స్. చెప్పాలంటే నేను ప్రస్తుతం నా పనికోసం నిన్ను ఎన్నుకోవడానికి కారణంకూడా అదే. అయితే ఇది అంతకు పదిరెట్లు ప్రమాదభరితమయినది...." అంటూ నా మొహంలోకి చూసాడు ప్రతాప్.

నేను చెప్పమన్నట్టు ఉత్సాహంగా ముందుకి వంగడం చూసి, తృప్తిగా నవ్వుతూ తిరిగి చెప్పసాగాడు ప్రతాప్!

"విక్రమ్! నేనీమధ్య వ్యాపారరీత్యా కొన్నాళ్ళు ఆఫ్రికాలో వుండడం తటస్థించింది. అక్కడ నేను 'హిల్మన్' అనే ఏనుగును చూసి ముచ్చటపడి కొన్నాను. దానిని ఇక్కడికి పంపే యేర్పాట్లను ఒక ట్రాన్సుపోర్టు కంపెనీకి అప్పగించి తిన్నగా మనదేశం వచ్చేశాను.

అంతా సవ్యంగా సాగితే ఓ వారం రోజులకు పూర్వమే హిల్మన్ యిక్కడికి చేరాలి. కానీ దురదృష్టం యేమిటంటే దారిలో ఓ అనూహ్యమయిన ప్రమాదం జరిగి హిల్మన్ని మోసుకొస్తున్న లారీ అడవిలో బోల్తాపడి హిల్మన్ తప్పించుకుపోయింది. దీనికంతటికీ కారణం ఆ బందిపోటు మంగల్ సేన్! వాడు తన ముఠాతో దారి కాచి హిల్మన్ను అదృశ్యం చెయ్యాలని చూశాడు,

అయితే అది కాస్తా చెడిసికొట్టి హిల్మన్ యెవరికీ దక్కకుండా పోయింది" నిట్టూర్చాడు ప్రతాప్.

"డాకూ మంగల్ సేనకి ఆ ఆఫ్రికన్ ఏనుగుతో పనేమిటి?" ఆశ్చర్యంగా అడిగాన్నేను.

ప్రతాప్ అదోలా నవ్వుతూ "ఏముంది విక్రమ్! కేవలం కోతిపని. అతనికి నేనంటే పడదు. అంతే!" అన్నాడు.

చెప్పాలంటే ఇది కేవలం సరిపెట్టుకోవలసిన సమాధానమే అనిపిస్తోంది నాకు. మంగల్ సేన్ లాంటి బందిపోటు ఎంత విరోధముంటేమాత్రం పనిగట్టుకొని ప్రతాప్ సింగ్ తో ఆటలాడుతూ కూర్చోడు. నిజానికి ఎక్కడో యేదో తిరకాసు వుంది. కొంచెం ఓపికపడితే ఏదో చోట దానంతట అదే బయటపడుతుందనుకొని,

"అచ్ఛా ప్రతాప్! మనం ఇప్పుడు హిల్మన్ ను బంధించాలి. అంతేకదా?" అన్నాను వుత్సాహంగా.

తల అడ్డంగా వూపాడు ప్రతాప్. "నో విక్రమ్! హిల్మన్ ను సాధ్యమయినంతతొందరలో చంపాలి మనం" అన్నాడు ప్రతాప్ తాపీగా.

"అదేం?" నివ్వెరపోయాన్నేను.

ప్రతాప్ విషాదంగా "హిల్మన్ కు పిచ్చెత్తిపోయింది విక్రమ్! ప్రమాదం జరిగి పల్లంలోకి దొర్లినప్పుడు హిల్మన్ తలలో యేదో గుచ్చుకుంది. పర్యవసానంగా హిల్మన్ పిచ్చెత్తి అరణ్యవాసుల జీవితాలకు మహమ్మారిగా మారిపోయింది. కారణం ఎవరయితే నేం, యేదయితే నేం దీని కంతటికీ బాధ్యత వహించవలసింది నేను.

విక్రమ్ యిదీ విషయం. నాకు ఏనుగుల వేటలో అనుభవం లేదు. అదీగాక నేను అడవిలో అడుగుపెట్టిన మరు

క్షణం మంగల్ యేదోలా నన్ను దెబ్బతీయాలని చూస్తాడు. కావాలంటే యెంత డబ్బయినా యిస్తాను. ఆ హిల్మన్ పీడ విరగడయిపోవాలి నాకు" అన్నాడు ప్రతాప్.

ప్రతాప్ విషయం అంతా బాగుంది. కానీ ఆఖరున అతడి మాటల ధోరణి నాకు నచ్చలేదు. నన్ను కేవలం ఓ కిరాయి వేటగాడిగా జమకట్టాడాయన. నిజానికి నే నొక ఔత్సాహిక వేటగాణ్ణి. ఈ కారణంగా నేను కొన్ని లక్షలు నష్టపోయిన సందర్భాలు వున్నాయి. ఇది నా స్వవం!

సీరియస్‌గా లేచి "మిస్టర్ ప్రతాప్! మీకు కావాలంటే నాకు తెలిసిన కిరాయి బాపతు వ్యక్తుల్ని పంపిస్తాను. మాట్లాడుకోండి" అన్నాను.

ప్రతాప్‌సింగ్ తన మాటలో పొరపాటును అర్థం చేసుకొని సర్దుకుంటూ "విక్రమ్‌గారూ! నా మాటల్ని మీరు మరోలా అర్థం చేసుకున్నారు. ఈ విషయంలో మీకయ్యే ఖర్చును నేను భరిస్తానని చెప్పడమే నా వుద్దేశం. దయచేసి కూర్చోండి" అన్నాడు నా చేతులు రెండూ పట్టుకొని.

సబిత సయితం ఆ సమయంలో జోక్యం చేసుకుంటూ "సార్! మీమీద గౌరవభావమే తప్ప, మరోటి వుండదు బాస్‌కి. కూర్చోండి! ప్లీజ్!" అంది ప్రాధేయంగా.

అంతకు మించి బిగుసుకోవడం సభ్యత కాదు గనక శాంతించి తిరిగి సోఫాలో కూర్చున్నాను. హిల్మన్ విషయంలో మా సంభాషణ తిరిగి కొనసాగింది.

# 3

మరుసటిరోజు సూర్యోదయం వేళకు ప్రయాణానికి సిద్ధమయ్యాను. గన్ తీసి టేబిల్ మీద పెడుతుండగా వచ్చాడు ప్రతాప్ సింగ్. గన్ వంక ఆసక్తిగా చూస్తూ చేతికి తీసుకున్నాడు దానిని ప్రతాప్.

"విక్రమ్! ఇది 'ఫారూన్' కదూ?" అన్నాడు ప్రతాప్.

నవ్వుతూ తల వూపాను నేను. ఆ తుపాకీ చూసి ప్రతాప్ అంతలా ఆశ్చర్యపోవడానికి కారణం వుంది. అది చాలా అరుదయిన తుపాకీ. పూర్వం ఎప్పుడో మహా తరమైన చైనా గోడ వెలుపల దానిని ఆనుకొని జీవించిన మంగోలియన్ తండాలు స్వహస్తాలతో తయారుచేసి వాడిన తుపాకీ అది. చెప్పాలంటే అతిపురాతనమయిన ఆ సంచారజాతి తయారుచేసిన ఆ తుపాకీ ఈ నాటి అధునాతన ఆయుధాలను సయితం ప్రక్కకు తోయ గలదు. ఎలక మొదలు ఏనుగు వరకూ వేటాడొచ్చు దీనితో.

సుమారు వెయ్యి గజాల దూరంలో వున్న లక్ష్యాన్ని సూదిమొన భేదమయినా లేకుండా భేదించగలదు. వాతావరణంలో కలిగే మార్పుల్ని లెక్క చెయ్యదు. అరుగుదల, తుప్పు అనే మాటలకు దానికి అర్థమే తెలియదనేందుకు ఇన్నేళ్ళ దాని పనితనమే రుజువు.

"ఎంతో ప్రయత్నం మీద ఒక విదేశీ మిత్రుడి వద్ద సంపాదించాను."

"విక్రమ్! దొరికితే యిలాంటిది నాకూ ఒకటి సంపాదిద్దూ! కావాలంటే ఎంతయినా యిస్తాను...." అంటూనే "అమ్మో! అలా అంటే మళ్ళీ నీకు కోపం వస్తుందేమో"

అన్నాడు భయంగా.

నేను నవ్వేసానా మాటకు. ప్రతాప్ తేలికపడుతూ తనూ నవ్వాడు. ప్రతాప్ సింగ్ నేనూ గది బయటకు నడిచాం. సరిత అప్పుడే వస్తూ కనిపించింది. ఇద్దరినీ ఒకే మారు విష్ చేసింది.

బయట ఒక జీపు ఆగివుంది. డ్రయివర్ సీట్లో కూర్చొని వుండగా బయట నిలబడి అతనితో మాటాడుతూ కనిపించాడొక వ్యక్తి.

సుమారు యాభై యేళ్ళుంటాయతనికి. అయినా దృఢంగా కండలు మెలితిరిగి వస్తాదులా వున్నాడు. పెద్దవయిన మీసాలు అక్కడక్కడా తెల్లబడ్డాయి. గడ్డం నున్నగా వుంది. చూపులు కఠినంగా చురుక్కుమనేలా వున్నాయి. చేయెత్తు మనిషి.

ప్రతాప్‌తో ఎవరితడన్నట్టు చూశాను.

"విక్రమ్ భాయ్! ఇతడు నీకు అడవిలో సహాయకారిగా వుంటాడు. అక్కడ ఆ ప్రాంతమంతా ఇతనికి కొట్టిన పిండి. మంచి నమ్మకమయిన మనిషి. పేరు భైరవ్ సింగ్" అన్నాడు ప్రతాప్.

భైరవసింగ్ నవ్వుతూ పలకరింపుగా కుడిచేయి పైకెత్తాడు. అతని నడుమున కట్టిన బెల్టునుండి సుమారు అడుగున్నర పొడవు గల వేటకత్తి ఒరతోబాటు వేలాడుతోంది.

నా బుర్రలో యెన్నో ప్రశ్నలు ఆ క్షణంలో గజిబిజిగా కదులాడాయి. ప్రస్తుతం హిల్మన్ సంచరిస్తున్న అడవులు నాకు తెలియనివేం కావు. ఆ సంగతి ప్రతాప్‌కి తెలియదని నే ననుకోను. అయినా ప్రతాప్ నా వెనక తన మనిషిని అందునా భైరవ్‌లాంటి మనిషిని దేనికి పంపు

తున్నట్టు?

అంతలోనే నా అనుమానం కేవలం అపోహే నేమో అనిపించింది. భైరవ్ సింగ్ ని ప్రతాప్ నిజంగానే నాకు సహాయంగా పంపుతున్నాడేమో?

అనుమానాలను ప్రక్కకు నెట్టి భైరవ్ సింగ్ ని చిరునవ్వుతో పలకరించాను. భైరవ్ సింగ్ నేనూ జీపెక్కి కూర్చున్నాం. జీపు స్టార్టయింది. ప్రతాప్ సవితలు మేం కనుమరుగయ్యేంత వరకూ చేతులు వూపుతూనే వున్నారు.

మధ్యాహ్నం వేళకు జీపు అడవిని చేరి భైరవ్ ని, నన్ను అక్కడ దించి వెనుతిరిగి పోయింది. భైరవ్ సింగు సామాన్ల బేగు భుజానికి తగిలించుకున్నాడు. తుపాకీ చేత బట్టి ముందు నే నడవగా భైరవ్ నన్ననుసరించి వస్తున్నాడు. ఇద్దరం అడవిదారి పట్టాం.

మార్గ మధ్యంలో చిన్నా పెద్దా గ్రామాలను సందర్శిస్తూ చీకటిపడే వేళకు యేదో ఒకచోట మకాం వేస్తూ ముందుకి పోతున్నాం.

ప్రతిచోటా కొండజాతి యువకులు, పురుషులు ఈటెలు బాణాలు చేతబట్టి సర్వసన్నద్ధంగా వుండడం కనిపించింది. వారంతా ఆ మతితప్పిన ఆఫ్రికా ఏనుగు ఏ క్షణాన తమమీద దాడి చేస్తుందోననే భయంతో బిక్కుబిక్కుమంటూ కాలం గడుపుతున్నారు.

ప్రతి రోజూ యేదో ఒక మారుమూల గ్రామం హిల్మన్ దాడికి గురవుతున్నదనే వార్తలు వారిని మరింత క్రుంగదీస్తున్నాయి. భయపడవలసినదేమీ లేదనీ ఇక రెండు మూడు రోజుల్లో దానిని పట్టుకోబోతున్నామని వాళ్ళకు భరోసా యిస్తున్నాడు భైరవ్. మేం అడుగు

పెట్టిన ప్రతిచోటా ఆ అమాయక మన్యప్రజలు మమ్మల్ని అపూర్వ రీతిలో ఆదరిస్తున్నారు.

కొన్ని గ్రామాల ప్రజలయితే ఆ ఏనుగుని అంతం చేసే వరకూ తమ గ్రామంలోనే వుండిపోవలసిందిగా పదే పదే కోరడం జరిగింది కూడా! అలా ఎన్నిచోట్ల వుండగలం. అయినా ఆ ప్రాంతాల్లో హిల్మన్ ఏ వారం పది రోజుల క్రిందటనే సంచరించి ఒకరిద్దర్ని చంపి భయోత్పాతాన్ని కలిగించింది. అంతే తప్ప ఈమధ్య అదిక్కడ సంచరిస్తున్న దాఖలాలేం లేవు. దానినిబట్టి హిల్మన్ ఎక్కడా ఆగకుండా ఓ పద్ధతిలో తన బీభత్సాన్ని కొనసాగిస్తూ ముందుకు పోతున్నదని నా వూహ.

మేమూ ఆ దేపద్ధతిలో కేవలం రాత్రులందు మాత్రమే యేదో ఒక గూడెంలో విశ్రమిస్తూ పగలంతా ఏకబిగిన ప్రయాణం కొనసాగిస్తూ వీలయినంత తొందరలో హిల్మన్ని ముఖాముఖి యెదుర్కోవాలనే తపనతో ముందుకు పోతున్నాం.

అలా పోతూ పోతూ మిట్టమధ్యాహ్నం వేళకు ఎత్తైన గుట్టమీదున్న ఓ చిన్న గ్రామాన్ని చేరాం. అక్కడ మాకు ఎదురయిన దృశ్యం నిజంగా మా గుండెల్ని కలచి వేసింది.

ఆ గ్రామం మొత్తంమీద వుండే సుమారు పాతిక ముప్పై యిళ్ళు దాదాపు నేలమట్టమయి వున్నాయి. ఆ ప్రాంతంలో చెదురుమదురుగా వున్న బలమయిన వృక్షాలు సయితం తుఫాను తాకిడికి నేలకూలినట్టు వ్రేళ్ళతో సహా పెకలించబడ్డాయి.

మూలుగుతూ, రోదిస్తూ దిక్కుతోచక అటూ యిటూ తిరిగేవారు, కాళ్లూ, చేతులూ విరిగి స్పృహ లేకుండా

పడివున్నవారు కొందరయితే యేకంగా ప్రాణాలు కోల్పోయినవారు సుమారు పదిమంది వున్నారు. ఆ పరిస్థితిని చూస్తూనే అది హిల్మన్ పనిగా వూహించి యేం జరిగిందంటూ ప్రశ్నించాం వారిని.

వాళ్ళు ఏడుస్తూ "ఆ రాకాసి ఏనుగు ఎక్కడ దాపురించిందో ఒక్కమ్మడి పిడుగులా వచ్చిపడింది. తిండితినే వేళ కదా ఎవరి గుడిసెల్లో వారున్నారు. గుడిసెల్ని నేల మట్టం చేసేసింది. మనిషి లేదు మానులేదు ఎదురుపడిందల్లా నేల రాలిపోవడమే! కన్ను మూసి తెరిచేలోగా ఇంత దారుణం చేసిపోయింది" అన్నారు.

"ఏనుగు వెళ్ళి ఎంతసేపవుతుంది?" ఆదుర్దాగా ప్రశ్నించాను.

"గంటకు పైమాటే దొరా!" అన్నా డొక యువకుడు.

పెదవి విరుస్తూ నిట్టూర్చాను. అప్పటికి ఏనుగు మాట మరిచి, బాధల్లో వున్న ఆ అమాయక ప్రజలకు సహాయపడే పనిలో పడ్డాం భైరవ్, నేనూ. అక్కడ పని ఒక కొలిక్కి వచ్చేసరికి సాయంత్రం కాబోతోంది. ఆ వేళ్టికి అక్కడే మజలీ చేసి మరుసటిరోజు ఉదయం యథాప్రకారం మా ప్రయాణం కొనసాగించాం.

## 4

ఎండ నడినెత్తిన వుండగా వెదురుపొదలు దట్టంగా వున్న ఓ ప్రాంతాన్ని చేరాం. నలుదిక్కులా వెదురు పొదలు కనుచూపుమేర వ్యాపించి వున్నాయి. ఒక్కొక్క అడుగే నెమ్మదిగా వేస్తూ ముందుకు పోతున్నాం. వెదురు పొదలు నిజానికి మనుషులు జాగ్రత్తగా మెసలవలసినవి. నానా రకాల విషసర్పాలకు అవి వాసయోగ్యంగా

వుంటాయి.

ఇంతలో చెవులు దద్దరిల్లేలా ఒక ఆర్తనాదం వినపడి అదిరిపడుతూ భైరవ్, నేను ఎక్కడివాళ్ళ మక్కడే నిల బడిపోయాం. ఏమయింది? ఎవరయినా పాముకాటు తిన్నారా? చెవులు రిక్కించాను. అంతే! ఆ ఒక్క కేకే! మరిక తాత్సారమూ లేకుండా ధ్వని వినవచ్చిన దిక్కు పరుగుతీశాను. ఎటువంటి పరిస్థితినయినా ఎదుర్కొనేం దుకు నా చేతిలో "ఫారూన్" సిద్ధంగానే వుంది. భైరవ్ చేతిలో వేటకత్తితో నన్ననుసరించి వస్తు న్నాడు.

ఓ వెదురుపొద చేరువలో కొండజాతి యువకుడొకడు అచేతనుడయి పడివున్నాడు. అతని ప్రక్కనే కొన్ని వెదురు కర్రలు చెల్లాచెదురుగా పడివున్నాయి. తళతళ లాడుతూ పదునయిన వంపు కత్తి పిడి, నిర్జీవమయి తెరవ బడిన అతని పిడికిలి మధ్య ఇమిడి వుంది. యువకుడి తల, పైనుండి పెద్ద బండిరాయి పడినట్టు నజ్జయివుంది.

పాముకాటు కాదిది! చుట్టూ చూసాను. బండరాయి కాదుగదా బెడ్డరాయికూడా లేదక్కడ!

"విక్రమ్! అటు చూడు!" అన్నాడు భైరవ్ కాస్త యెడంగా మట్టినేలమీద పడిన వెడల్పాటి జాడల్ని చూపుతూ.

"సందేహంలేదు. అవి ఏనుగు పాదాల గుర్తులు. యువకుడి ప్రాణాలను కాపాడే అవకాశంలేదు. తొండం దెబ్బతగిలిన మరుక్షణం అతడి ప్రాణాలు గాలిలో కలిసి పోయాయి. తొందరగా వెళితే ఏనుగు కంటబడే అవ కాశం వుంది.' నేలమీద అడుగుజాడలు సాగిన దిశగా ముందు నేనూ ఆ వెనక భైరవ్ పరుగుతీసాం.

సుమారు మైలున్నరా రెండుమైళ్ళు పరుగెత్తివుంటాం. ఏనుగు పత్తాలేదెక్కడా! ఆయాసం మాత్రం ముంచుకు వస్తోంది. నెమ్మదిగా అడుగులు వేస్తూ నలుదిక్కులా జాగ్రత్తగా పరికిస్తూ ముందుకు సాగుతున్నాం. ఏనుగు అప్పటికిక కనిపించే అవకాశంలేదని నా నమ్మకం.

కొండజాతి యువకుణ్ణి చంపింది హిల్మన్ కావచ్చు. పాదాల గుర్తులమధ్య దూరాన్ని అంచనావేస్తే అది మామూలు ఏనుగు కాదని తెలుస్తూనే వుంది. ఇప్పటి వరకూ హిల్మన్ను గూర్చి సేకరించిన విషయాలనుబట్టి అది యెక్కడా ఎవరినీ ప్రత్యక్షంగా ఎదుర్కొన్న సందర్భాలు లేవు. దానివన్నీ దొంగదాడులే! నిజానికి ప్రస్తుతం మేం నడుస్తున్న మార్గమూ అందుకు అవకాశమున్నదే.

అదే వుద్దేశంతో భైరవ్ని హెచ్చరిద్దామని తల కాస్త వెనక్కి తిప్పి మాట్లాడబోయాను. అంతే! గుండె గుభేలుమంది. భైరవ్ వెనకనే వుంది నల్లని పర్వతాకారం.

సుమారు పధ్నాలుగు పదిహేనడుగుల ఎత్తు! మొహం భీకరంగా వుంది. మెడలో అరచేయి వెడల్పున ఓ తోలు పటకా.

భైరవ్ గుడ్డిగా నన్నే అనుసరించివస్తూ అసలు వెనక తలంపే లేకుండా వున్నాడు. కన్నుమూసి తెరచేంతలో హిల్మన్ తొండం భైరవ్ తలను పచ్చడి చేయబోతోంది. తుపాకీ ఎత్తే అవకాశమే లేదు.

బిగ్గరగా అరుస్తూ, భైరవ్ని అమాంతంగా ప్రక్కకు తోసి నేనూ అటే పడిపోయాను. భైరవ్ నేనూ చిన్న గోతిలోకి దొర్లిపడిపోయాం. నేను వెనువెంటనే లేచి తుపాకీని పొజిషన్లో వుంచి చూశాను. హిల్మన్ కనపడలేదు. ఇంతలో ఎటు పోయింది?

గోతిలోనుండి బయటపడి నలుదిక్కులా చూశాను. దట్టంగా వున్న ఆ వెదురు పొదలమధ్య ఏ దిక్కున హిల్మన్ దాటిపోయిందీ వూహించడం కష్టం. తిరిగి గోతిదగ్గరకొచ్చేసరికి భైరవ్ ఇంకా అందులోనే చతికిల బడి వున్నాడు. నేను అతణ్ని ఎంత వేగంగా ప్రక్కకు తోసినా హిల్మన్ తొండం అతని ఎడమచేతిని దాదాపుగా ఒరుసుకుంటూ కిందికి దిగింది.

ఆమాత్రం దెబ్బకే అంత భారీ మనిషీ ఇంకా చలి జ్వరం వచ్చినవాడిలా వణికిపోతున్నాడు. భైరవ్ని నెమ్మదిగా ఆ గోతిలోనుండి పైకిలాక్కొచ్చి ఓ బండ రాతిమీద కూర్చోబెట్టాను. ఎడమచేతిని భుజంనుండీ మణి కట్టువరకూ బాగా మాలిష్ చేశాను. ఎటూ వంగకుండా కొయ్యలా బిగుసుకుపోయిన ఆ చేయి కాస్తా ఓ అర గంటలో తిరిగి అతని స్వాధీనంలోకొచ్చింది.

ప్రక్కనే వున్న సెలయేటినుండి ఆకుదొన్నెలో నీళ్ళు తెచ్చి భైరవ్ మొహాన్ని శుభ్రంగా కడిగి మిగిలిన నీళ్ళు త్రాగించాను. భైరవ్ అప్పటిగ్గానీ ఈ లోకంలో పడలేదు.

కృతజ్ఞతతో నా రెండు చేతులూ పట్టుకొని "బేటా! నువ్వు నా ప్రాణాలు కాపాడావు" అన్నాడు భైరవ్ సింగ్.

నేను నవ్వుతూ "భైరవ్ దాదా! ఇటువంటివి వేటలో సర్వసామాన్యం. మనలో మనకి కృతజ్ఞతలు దేనికి. ఇంతకీ నువ్విప్పుడు నడవగలవా" అన్నాను.

భైరవ్ సింగ్ ఫరవాలేదన్నట్టు తల వూపుతూ లేచాడు. ఇద్దరం తిరిగి హిల్మన్ అడుగుజాడలు ఆరాతీసి ఆ దిక్కుగా ముందుకు సాగాం.

చీకటి పడేవేళకు ఓ చిన్న గ్రామం చేరాం. ఆ వూరు దాటి రెండు మైళ్ళు ప్రయాణంచేస్తే ఒక బ్రహ్మాండమయిన నది తగులుతుంది. ఎంతో అవసరమయిన పరిస్థితి విషమిస్తే తప్ప హిల్మన్ ఆ నదిని దాటిపోదని నా నమ్మకం.

కనుక హిల్మన్ ఈ మార్గాన గనక వచ్చిందంటే నదికి అవతల అరణ్యంలోనే యేదో ఒకచోట తిరుగుతూ వుంటుంది. అదీగాక ఏనుగులకు నీరు ప్రాణంతో సమానం. వీటిన్నిటి దృష్ట్యా కొద్దిరోజులపాటు ఆ గ్రామంలోనే మకాం వేయాలని భైరవ్ నేనూ నిర్ణయించుకున్నాం.

# 5

ఆ గ్రామంలో వుండే కొండజాతి ప్రజలు అక్కడ మా వునికిని ఎంతగానో హర్షించారు. మా యిద్దరికీ ఒక పెద్ద గుడిసెను వారు అప్పటికప్పుడు నిర్మించి యిచ్చారు.

గుడిసెలో ప్రవేశిస్తూనే ఓ మూల తుంగ చాప పరచి నడుం వాల్చాను. క్షణాలమీద నిద్రపట్టేసింది నాకు.

తిరిగి తెలివి వచ్చేసరికి బారెడు పొద్దెక్కి వుంది. భైరవ్ ఆసరికి స్నాన పానాదులు ముగించి సిద్ధంగా వున్నాడు.

"భలేవాడివి విక్రమ్! బాంబులు పేలే చప్పుడులో కూడా నిశ్చింతగా నిద్రపోతావు. చీమచిటుక్కుమన్నా చటుక్కున కళ్ళు తెరుస్తావు. వెధవది రాకాసి ఏనుగు రాకుండా వుండడానికట రాత్రంతా వీళ్ళు ఒకటే డప్పుల మోత. నిద్రపట్టక చచ్చాననుకో!" అన్నాడు భైరవ్ దాదా నవ్వుతూ.

నేను లేచి అరగంటలో తయారయ్యాను. ఇద్దరం అడవిదారి పట్టాం. మిట్టమధ్యాహ్నం వరకూ కాళ్లా

తిరిగాం. ఎండతీవ్రంగా వుండి ఇక ఏ మాత్రం నడిచినా శోష వచ్చేట్టుంది. గుబురుగా పందిరిలా అల్లుకున్న పొదల్ని చూసి కాసేపు అక్కడ విశ్రాంతి తీసుకునే వుద్దేశంతో అటు కదిలాం. ముందు భైరవ్ సింగ్ నడుస్తున్నాడు.

ఇంతలో పొదల మధ్యనుండి ఒక పులిపిల్ల చెంగున దూకి పైకొచ్చింది. చిన్నగా అరుస్తూ మా వేపు చూసుకు వస్తోంది.

నేను పులిపిల్ల వంక సరదాగా చూస్తున్నాను. జన్మతః పౌరుషంతప్ప గదమాయిస్తే వెనక్కి పారిపోయే వయసుదానిది. అయినా మేము పొదలను చేరే వుద్దేశాన్ని విరమించుకొని వెనక్కి తిరిగి పోవాల్సి వుందిక. పులిపిల్ల ఉన్నచోట ఆడపులి లేకుండా ఉండదు గదా! పిల్లల పులి తనచుట్టూ ఓ అరఫర్లాంగు దూరంలో కూడా ఇతర ప్రాణుల ఉనికిని సహించదు. తన పిల్లల క్షేమాన్ని కోరి అది ఎంతటి సాహసమయినా చేస్తుంది. తుదకు ప్రాణత్యాగమయినా!

నేను తలతిప్పి భైరవ్‌తో వెనక్కిపోదాం రమ్మనేంతలో అతడి చేయి వేగంగా కదలడం చూసి ఉలిక్కిపడుతూ వారించబోయాను. కానీ అప్పటికే ఆలస్యమయిపోయింది. భైరవ్ చేతిలో వేటకత్తి విసురుగా వెళ్ళి పులిపిల్ల తలను రెండుగా చీల్చేసింది. పులిపిల్ల గిజగిజలాడుతూ ప్రాణాలు వదిలేసింది. నేను నిశ్చేష్టున్నయ్యాను.

"ఎంత పనిచేశావ్ దాదా!" అన్నాను బాధగా. కత్తి విసరడంలో నా నేర్పు చూసావా అన్నట్టు నా వంక తిరిగిన భైరవ్ మొహం ఆ మాటకు నల్లబడి

పోయింది వెంట నే.

ఏది యేమయినా జరిగింది జరిగిపోయింది. ఆలస్యం ప్రమాదం.

నేను గిరుక్కున వెనుతిరుగుతూ భైరవ్ చేతినికూడా వెనక్కిలాగాను. ఎదురుగా ఆడపులి! ఎక్కడి అడుగు అక్కడే వుండిపోయింది. భైరవ్ కూడా రెండడుగులు ముందుకు వేసి పులిని చూస్తూనే ఒక అడుగు వెనక్కి తగ్గాడు.

నాకు ఒళ్ళు మండిపోయింది. "భయం దేనికి దాదా! విసురు వేటకత్తి!" అన్నాను వెటకారంగా.

పులి నిస్తేజంగా పడివున్న తన పిల్లను చూసింది. తన వాసన పసిగడుతూనే చెంగున ఎదురువచ్చే తన పిల్ల కట్టెగుట నిలిచిన దుర్మార్గుల చేతుల్లో హతిమయిందని దానికి తెలాసు. తన సంతానాన్ని హాట్టన బెట్టుకున్న యే ప్రాణినీ ఆడపులి ఎట్టి పరిస్థితులలోనూ క్షమించే ప్రసక్తిలేదు.

ఆడపులి కళ్ళు భరించరాని క్రోధంతో నిండి మరింత చిన్నవయ్యాయి. భైరవ్ సింగ్ నా మాటకు బాగా పౌరుషం తెచ్చుకున్నట్టున్నాడు మొలనుండి పొడవాటి తన బాకును పైకిలాగి సిద్ధంగా వున్నాడు.

నిజానికి పులిని తుపాకీతో షూట్ చేసే అవకాశం నాకు ఉంది. కానీ భైరవ్ సింగ్ తన జీవితంలో ఒక గుణపాఠం నేర్చుకోవాలనే ఉద్దేశంతోనే నేను తుపాకీని పైకెత్తలేదు.

భైరవ్ సింగ్ కత్తిని గట్టిగా పట్టి నిలబడి ఉన్నాడు. ఆడపులి నాలుగడుగులు వెనక్కి తగ్గింది. పులి పరిస్థితిని భైరవ్ సింగ్ తప్పుగా అంచనా వేసుకున్నాడు. వీరో

చితంగా నిలబడిన తన తీరు పులిని బెదరగొట్టేసిందనే భావన కలిగిందతనికి. అతని మొహంలో చిరునవ్వు మెరిసింది చిన్నగా. కానీ కళ్ళముందు పిల్లను కోల్పోయిన ఆడపులి ఇక వెనక్కి తిరిగే ప్రశ్నే వుండదని అతనికి తెలియదు.

భైరవ్ సింగ్ వూహించని రీతిలో అంత దూరంనుండీ ఒకేఒక దూకు దూకింది పులి. ఆ విసురుకు అతను, అతని చేతిలోని కత్తి చెరో ప్రక్కకు ఎగిరిపోయారు.

పులి భైరవ్ సింగ్ మీదకు రెండో దాడి చేయబోతోందిక. దానితో అతని చరిత్ర సమాప్తమవుతుంది. ఉపేక్షించి లాభం ఉండదని భైరవ్ దిక్కుగా దూసుకు వస్తున్న పులిని గురిచూసి తుపాకీ పేల్చాను. దిక్కులు పిక్కటిల్లే చప్పుడు వినపడుతూనే పులి తల నామ రూపాల్లేకుండా పగిలిపోయింది. మొండెం అక్కడికక్కడే పడిపోయింది.

ఇంచుమించు తల్లీ పిల్లల శవాలు ఒక్క దగ్గరే పడి ఉన్నాయి. తుపాకీ దించి వాటిని చూస్తూ తలవంచుకుని నిలబడిపోయాను. భైరవ్ సింగ్ దుమ్ము దులుపుకుంటూ వచ్చాడక్కడికి. నా కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. తుపాకీపట్టి సుమారు పదిహేనేళ్ళవుతుంది. ఏనాడూ ఇంతటి బాధను అనుభవించలేదు నేను.

"భైరవ్ దాదా! ఈ పాపం మనల్ని అంటకపోదు. నా వేట జీవితంలో నేను చేసిన మొదటి పాపమిది" అన్నాను బాధగా.

భైరవ్ మొహం సిగ్గుతో ముడుచుకుపోయింది. "క్షమించు బేటా! దీనికంతకీ కారణం నేను" అన్నాడు అతను రుద్ధకంఠంతో. జరిగిందానికి అతిడూ పశ్చాత్తాప

పడుతున్నాడు. ఏమయితేనేం? మరణించిన ఈ సాహస ప్రాణులు మరి తిరిగిరావు.

తల్లీ పిల్లను అక్కడే దహనంచేసి భారంగా వెను తిరిగాం.

# 6

మరుసటి రోజు అడవిలో అడుగుపెట్టలేకపోయాను. బుజ్జిగా అమాయకంగా అగుపడే పులిపిల్లా, మరణించిన ఆ తల్లీ పిల్లల మృతదేహాలూ పదేపదే గుర్తుకువచ్చి మనసంతా చికాకుగా ఉంది. రోజంతా గుడిసెలో గడిపి సాయంత్రం వేళకు ప్రశాంతంగా ఉంటుందని నదిఒడ్డుకు బయల్దేరాను. భైరవ్ సింగ్ కొండజాతి వాళ్ళతో కలిసి జీలుగు కల్లు తాగేందుకని మధ్యాహ్నమనగా వెళ్ళినవాడు తిరిగి రాలేదింకా.

నది ఒడ్డున ఓ బండరాతిమీద చతికిలబడ్డాను. నా "ఫారూన్" నన్నంటిపెట్టుకొని ప్రక్కనే వుంది.

పక్షులు గుంపులుగా గూళ్ళను చేరుతున్నాయి. నది ఒడ్డున వేటాడే కొంగలకు మాత్రం వేళకాలేనట్టుందింకా; ఒంటికాలిమీద దొంగ జపం చేస్తూ ఆహారంకోసం నిరీక్షిస్తున్నాయి. ఏదో పరాకున వున్న నాకు కొంగలన్నీ ఒకే మారు లేచిపోవడం అసహజమనిపించి చూశానటు.

హిల్మన్! కదిలే పర్వతంలా వడిగా అడుగులు వేస్తూ నదిలో బాగా ముందుకు పోయింది. కొంతదూరం వెళ్ళి నీటిలో మునిగి తేలుతూ,తొండంతో నీటిని నలుదిక్కులా వెదజల్లుతూ ఆటలాడసాగింది.

హిల్మన్ యే టయిముకయినా యిటే వస్తుంది. అంత వరకూ వేచివుండి నది ఒడ్డున దాని పని పట్టాలని నిశ్చయించుకున్నాను. గంటలు గడుస్తున్నాయి. రాత్రిగడిచే

కొద్దీ చలి ఉధృతమవుతోంది. హిల్మన్ ఎంతకీ బయటకు రాలేదు. నదిలో అది ఇంత సేపు ఏం చేస్తున్నట్టు?

ఏనుగు తాను గతంలో వచ్చిన తోవనే వెనక్కి మరలుతుంది సాధారణంగా. ఆ మార్గం సురక్షితమైనది కాదని భావిస్తే తప్ప, అది మరో దారి వెతుక్కోదు. హిల్మన్ నదిలో దిగేటప్పుడు నన్ను గమనించిందా యేం! యేది యేమయినా ఆ విషయం తేలనిదే తిరిగి వెళ్ళకూడదని ఓపిగ్గా కూర్చున్నానక్కడే. చూస్తుండగానే తెల్లారిపోయింది. హిల్మన్ నదిలో లేదు. ఉసూరుమంటూ కాళ్ళీడ్చుకొని గూడెం మొహం పట్టాను.

"అరే బేటా! రాత్రంతా యెక్కడికి పోయావు? నీకేమయిందోనని భయపడి చస్తున్నాను. క్షేమంగా తిరిగొచ్చావు. అంతే చాలు!" తేలిగ్గా నిట్టూర్పు విడుస్తూ అన్నాడు భైరవ్ సింగ్.

జరిగిన సంగతి చెప్పానతనికి.

"నే చెప్పలా అది ఏనుగు కానేకాదు బేటా! సైతాన్ అది! మొత్తానికి ఈ ప్రాంతంలోనే వుంది కదా. ఈ పూట విశ్రాంతి తీసుకో. మొహం చూడు ఎలా పీక్కుపోయిందో" అన్నాడు భైరవ్ బాధపడుతూ.

ఆ పరిస్థితిలో అతని మొహంచూస్తే మొదట భైరవ్ ని గూర్చి అనవసరంగా అనుమానపడ్డాననిపించి ఒకింత సిగ్గుపడ్డాను. భైరవ్ అరగంటలో చపాతీలు కాల్చి ఇవ్వగా కడుపునిండా తిని వెంటనే నిద్రపోయాను. అలా పడుకున్నవాణ్ణి తిరిగి సాయంత్రం చీకటి పడ్డాక నే లేచాను.

మరుసటిరోజు భైరవ్ నేను తిరిగి అడవిలో చొరబడ్డాం. తిరిగి తిరిగి యిద్దరం బాగా అలసిపోయాం,

హిల్మన్ మాట దేముడెరుగు, గుక్కెడు నీళ్ళకోసం చెట్టు పుట్టలు గాలిస్తున్నాం. ఉన్నట్టుండి భైరవ్:

"విక్రమ్! హాథీ" అన్నాడు పెద్దగా. గిరుక్కున తిరిగా నేను.

సుమారు అరఫర్లాంగు దూరాన చెట్ల దిగువ నడుస్తూ కనిపించింది హిల్మన్. దాని మూపు బ్రహ్మాండమయిన ఆ చెట్లకొమ్మల్ని ఇంచుమించుగా తాకుతోంది. దాహం మాట మరచి పరుగెత్తా నేను. భైరవ్ నా వెంట వస్తున్నాడు. రెండే నిముషాల్లో చేరానక్కడికి.

విచిత్రం! హిల్మన్ కనపడలేదెక్కడా! ఇంతలో ఏమయింది? భైరవ్ చెప్పినట్టు ఇదేమన్నా పిశాచమా? భైరవ్ నేనూ జాగ్రత్తగా వెతుకుతున్నాం.

చెట్లన్నీ ఒకదానికొకటి దగ్గరగా, గజిబిజిగా వుండి నిజానికి గుబులు పుట్టించేలా వుందా ప్రాంతం. హిల్మన్ లాంటి భారీ జంతువులు సయితం సులభంగా దాక్కునే వీలుంది అక్కడ. తుపాకిని పొజిషన్‌లోనే వుంచుతూ పరిసరాలను వేయి కళ్ళతో గమనిస్తూ ముందుకు సాగుతున్నాను.

ఇంతలో వినపడిందో పెద్ద అరుపు. అది భైరవ్ గొంతు. నా దృష్టిలో నేనుండి భైరవ్ ఎక్కడ నానుండి విడిపోయాడో నేను గమనించనే లేదు.

గిరుక్కున వెనుతిరిగి వచ్చిన తోవన బాణంలా దూసుకు వెళ్ళాను. భైరవ్ సింగ్‌ని తొండంతో చుట్టి పట్టుకు పోతున్నది హిల్మన్. నన్ను చూస్తూనే వేగాన్ని పెంచేసింది. భైరవ్ సింగ్ భయంతో అరుస్తున్నాడు.

"భయపడకు దాదా!" అరిచాను నేను. ఒక వంక దాహంతో నోరు అర్చుకుపోతున్నది. పరుగెత్తే ఓపిక

లేదు. అయినా పళ్ళ బిగువున పరుగుతీస్తున్నాను. నాకు తెలుసు. పరుగులో ఏనుగుతో పోటీపడగల మనుషులు వుండరెక్కడా!

తుపాకీతో ఏనుగును వెనకనుండి కాల్చే అవకాశ ముంది. కానీ ఆ దెబ్బకది చావదు. ఈలోగా ఇప్పటికే మతి చలించిన హిల్మన్ భైరవ్‌ని కాస్తా పచ్చడి చేసేస్తుంది.

క్రమేపీ నా అడుగులు తడబడుతున్నాయి. అప్పటికి చాలామారం పరుగెత్తి ఉన్నానేమో ఇక నావల్ల కాదని పించి నిలబడిపోయాను. గుండెలు బ్రద్దలయ్యేలా చప్పుడు వినవస్తోంది లోపలినుండి.

భైరవ్ ఇక ఎలాగూ దక్కడు. హిల్మన్ చాలా దూరం పోయిందప్పటికి.

వెయ్యి గజాల దూరాన్ని నిస్సందేహంగా ఛేదించగల ఫారూన్ నా చేతుల్లో పిడుగుపాటున గర్జించింది.

ముందుకు దూసుకుపోతున్న హిల్మన్ ఒక్కసారిగా ఆగి బాధగా ఘీంకరిస్తూ వెనక కాళ్ళ మీద లేచింది. హిల్మన్ తొండంతో చుట్టబడి ఉన్న భైరవ్ అంత ఎత్తు నుండి కిందపడిపోయాడు.

హిల్మన్ రెట్టించిన క్రోధంతో వెనుతిరిగింది. శరీరం వెనక భాగంలో యేర్పడిన గాయంనుండి రక్తం వరదలా ప్రవహిస్తోంది. ప్రళయ భీకరంగా అరుస్తూ మేరు పర్వతంలా నామీదకు దూసుకువస్తోంది హిల్మన్. పిరికివాళ్ళు గుండె జబ్బులు ఉన్నవాళ్ళు తక్కడికక్కడే ప్రాణాలు కోల్పోయేలా భయంకరంగా వుందా స్వరూపం. ఇన్నాళ్ళ వేట అనుభవంలో ఎన్నో భయంకర మృగాల్ని ఎదుర్కొన్న నేనే ఆ సమయంలో కించిత్తు భయాన్ని

పొందినమాట వాస్తవం. కానీ అది తాత్కాలికం.

నా చేతిలో తుపాకీ మరోసారి గర్జించింది. అంతే! హిల్మన్ తల చిన్నాభిన్నమయి నిలువునా కూలబడి పోయింది. ఆ అదురుకు భూమి కంపించినట్టయింది.

హిల్మన్ సంగతి మరచి భైరవ్ పడివున్న చోటుకు పరుగు తీసాను. భైరవ్ ఆయాసంతో అతికష్టంగా శ్వాస పీలుస్తున్నాడు. నోటినుండి, చెవులనుండి రక్తం ఎడ తెరిపి లేకుండా స్రవిస్తున్నది. హిల్మన్ తొండం చుట్టులో భైరవ్ శరీరం నలిగి నజ్జయింది. భైరవ్ పరిస్థితి ఇక క్షణాలమీద ఉన్నదని గ్రహించిన నా కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగాయి.

గద్గద స్వరంతో పిలిచాను "దాదా!...."

భైరవ్ అతిప్రయత్నంమీద కళ్ళు తెరిచాడు. మొహాన చిరునవ్వు వెలిగి మాయమయింది. నా కళ్ళ నీళ్ళు బుగ్గలమీదుగా జారి అతని మొహంమీద పడ్డాయి. ఏడవవద్దన్నట్టు మొహాన్ని అడ్డంగా వూపాడు భైరవ్. కళ్ళు తుడుచుకున్నాను. అయినా ఆగలేదు దుఃఖం. భైరవ్ తలను నా తొడమీద పెట్టుకున్నాను. భైరవ్ పెదాలు అదురుతున్నాయి. అతదేదో చెప్పాలనుకుం టున్నట్టు అర్థమయి ఆత్రంగా అడిగాను.

"చెప్పు దాదా! ఏమిటి....?"

ఎట్టకేలకు నోరు తెరవగలిగాడు భైరవ్.

"బేటా! తెల్లనివన్నీ....పాలు కావు....ఎన్నోసా...ర్లు నా ప్రాణం కాపాడావు. కానీ....కానీ....అవసరం.... తీరాక....నీ ప్రాణం తీసేందుకు....వచ్చాను నేను.... భగవంతుడు....దయామయుడు....నాకు....నాకు ....తగిన శాస్తిచే....సాడు.... నేనిక....బ్రతకను....కానీ....చచ్చే

ముందయినా....ఒక మంచి పని.... చేయమని.... దేవుడు.. నన్ను....ఆదేశిస్తున్నాడు.... నే చెప్పేది....జాగ్రత్తగా ....విను...." అంటూ నెమ్మదిగా ఆగి ఆగి చెప్పసాగాడు భైరవ్ —

# 7

భైరవ్ సింగ్ శవంముందు నిలుచొని ప్రశాంతంగా కళ్ళు మూశాను కొద్దిక్షణాలు.

భైరవ్ ఎవరయితే నేం ఎటువంటి వాడయితే నేం ఆఖరి క్షణాల్లో నా మేలు కోరి నా చేతుల్లో నే ప్రాణాలు విడిచాడు. ఎండుకట్టెలు ఏరి చితి పేర్చి శవాన్ని దానిమీద ఉంచాను. లైటర్‌తో చితికి నిప్పంటించాను. మంటలు క్రమేపీ ఉధృతమయి భైరవ శరీరం కాలి బూడిదయింది.

నే వచ్చిన పని కొంతవరకు నెరవేరింది. ఇక ఆ మిగిలిన కార్యాన్ని యే విధంగా పూర్తిచేయాలి?

హిల్మన్ శరీరం నిర్జీవంగా పడివుంది. ఇంతలో చుట్టూ వున్న చెట్లమీద పక్షులు కలవరపడుతూ పైకెగిరి పోయాయి. దరిదాపుల్లో నే గుర్రాల కాలిగిట్టల చప్పుడు వినపడింది. ఎవరో వస్తున్నారు. వారు శత్రువులే కావచ్చు మిత్రులే....మిత్రులేమిటి? ప్రస్తుత పరిస్థితుల్లో నాకు శత్రువులే హెచ్చు!

చుట్టూ చూశాను. చేరువలో బండరాళ్ళు కొన్ని కనిపించాయి. జేబులో గుడ్డమూట తీసి కాలి బూటు కున్న సన్నని చాకును లాగాను. బండరాతిని కొద్దిగా ప్రక్కకు దొర్లించి చాకుతో కొంత మట్టిని తీసి గుడ్డ మూటను ఆ గోతిలో వుంచి మామూలుగా మట్టితో కప్పివేశాను. బండరాయిని యథాస్థానంలో వుంచి పరుగున హిల్మన్

కళేబరంవద్ద కొచ్చి నిలుచున్నాను.

చెట్లకింద ఆగాయి ఓ పది పన్నెండు గుర్రాలు. వాటిని అధిరోహించి వున్న వ్యక్తుల్ని చూస్తూనే బందిపోటు దొంగలని గుర్తించాను. గుర్రాలు నెమ్మదిగా నడుస్తూ వచ్చి నా చుట్టూ మూగాయి. అందరి చేతుల్లోనూ తుపాకులున్నాయి.

అందరిలోనూ ఎత్తుగా బలంగా వున్నాడొక వ్యక్తి. నన్ను ఎగాదిగా చూసి....

"భేష్! పని ముగించావన్న మాట. హాథీని ఖతం చేసి భైరవ్‌ని సయితం గతంలోకి పంపేశావు. బహుత్ అచ్ఛా విక్రమ్! మాకు శ్రమ తగ్గించావు. ఏదీ ఆ మూట! ఇలా యివ్వు బేటా!" నవ్వుతూ చెయ్యి చాచాడా వ్యక్తి.

నేనూ నవ్వుతూనే "మూటేమిటి? నీ మాటేమిటి?" అన్నాను అమాయకంగా మొహంపెట్టి.

ఆ మాటకు పక పక లాడాడా వ్యక్తి. నవ్వును మధ్యలో ఆపి "అతి తెలివికి పోకు. వజ్రా లెక్కడ?" తిరిగి సీరియస్‌గా అడిగాడు.

ఆశ్చర్యం నటిస్తూ "వజ్రాలేమిటి? నేను హాథీని వేటాడేందుకు నియమించబడ్డ వ్యక్తిని. ఆ పని చేసిపోయేంతలో మీరు వచ్చారు. అంతే!" అన్నాను.

ఆ వ్యక్తి తల అడ్డంగా వూపుతూ "విక్రమ్! మంగల్ సేన్ ముందు అబద్దాలు పనిచెయ్యవు. అయినా అదీ చూద్దాం.........బలరాం!" కేకేసాడు మంగల్ సేన్ గట్టిగా.

"హాఁ సర్దార్" ముందుకు వచ్చాడొక వ్యక్తి.

"హాథీ మెడలో చూడు" ఆజ్ఞాపించాడతణ్ణి మంగల్

సేన్.

"జీ సర్దార్!" అంటూ గుర్రం దిగి హిల్మన్ కళే బరంవంక పరుగెత్తాడు బలరాం.

బెల్టుతో తిరిగివచ్చి "హాకీ మెడలో లేదిది! ప్రక్కన పడివుంది" అంటూ మంగల్ చేతి కందించాడు బలరాం దానిని.

బెల్టు అందుకున్నాడు మంగల్. కొద్దిసేపు దానిని తనిఖీ చేసి ప్రక్కన పడేస్తూ "బలరాం! విక్రమ్ జేబులు తనిఖీ చెయ్!" అన్నాడు.

బలరాం నా జేబులు తనిఖీ చేశాడు. సిగర్ లైటర్, సిగరెట్ పెట్టె కొన్ని నోట్లు దొరికాయతనికి. వాటినే మంగల్ కి చూపిస్తూ "ఇంతకుమించి మరేం లేవు" అన్నాడు బలరాం.

మంగల్ తల వూపుతూ నావేపు తిరిగాడు. చిన్నగా నవ్వి "విక్రమ్! హాకీ మెడలో వుండే బెల్టు దాని ప్రక్కన పడివుంది. ఇందులో భద్రపరచబడిన ఆఫ్రికా వజ్రాలు మాయమయ్యాయి. హిల్మన్ ని చంపింది నువ్వు. భైరవ్ సయితం చనిపోయాడు. వజ్రాల విషయం నీకేం తెలియదని నన్నింకా నమ్మమంటావా?" సూటిగా ప్రశ్నించాడు మంగల్.

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా నువ్వడిగిన విషయాలేవీ నాకు తెలియవు" స్థిరంగా పలికింది నా స్వరం.

అంతే! నా మొహంమీద తగిలింది మంగల్ చేతిలో కొరడా విసురుగా. భగ్గుమంది చర్మం. వెనువెంటనే వరసగా తగిలాయి కొరడా దెబ్బలు. వీపు, కాళ్ళు, చేతులు, చర్మం చిట్లిపోతోంది దెబ్బ తగిలిన ప్రతిచోటా! దెబ్బ దెబ్బకీ హెచ్చరిస్తున్నాడు మంగల్ "వజ్రాలు ఎక్కడ

దాచిందీ చెప్పకపోతే నీ ప్రాణాలు ఇలాగే పోతాయి" అంటూ.

భైరవ్ సింగ్ వజ్రాల వలయంలో ఎదురుకాగల ప్రతి వ్యక్తి విషయమూ చెప్పాడు నాకు.

"నాకు యే సంగతీ తెలియదు. నా మాట నమ్ము మంగల్. భైరవ్ నేనూ అడవిలో విడిపోయాం. భైరవ్ పోథీని తుపాకీతో కాల్చి చంపాడు. వజ్రాలు అతనే ఎక్కడో దాచాడు. ఇంతలో అతణ్ని విషసర్ప మేదో కాటేసి వుంటుంది. నేను భైరవ్‌ని వెతుక్కుంటూ యిటుగా వచ్చేసరికి నురగలు కక్కుతూ స్పృహలేని స్థితిలో వుండి అలాగే ప్రాణాలు వదిలేశాడు" నోటికి వచ్చిందేదో కల్పించి చెప్పాను మంగల్‌కి యేదోలా ఆ కోరడా బారి నుండి తప్పించుకోవాలనే ఆత్రంలో.

మంగల్ ఫకాలున నవ్వాడు. "నీకు తెలియదేమో భైరవ్‌కి తుపాకీ యెలా నొక్కాలో కూడా తెలియదు" అన్నాడు.

అబద్ధం ఆడి తప్పులో కాలేశానన్నమాట. భైరవ్ సింగ్‌కి తుపాకీ పేల్చడం రాదని నాకు నిజంగానే తెలియదు.

"విక్రమ్!.... నే చెప్పేది సరిగా విను. నువ్విప్పుడు మా మధ్య చిక్కుకుపోయావు. మొండికేస్తే వృధాగా ప్రాణాలు పోగొట్టుకుంటావు. మేం సంఖ్యలో నీకు పది రెట్లున్నాం. ఒకరిద్దరు మాలో పోయినా విజయం మాదే అవుతుంది. నీతో మాకు ఎటువంటి విరోధమూ లేదు. ఆ వజ్రాలు మాకు అప్పగిస్తే మా దారిన మేం పోతాం. ఆలోచించు" అన్నాడు మంగల్.

ఇందులో ఆలోచించవలసింది యేదీలేదు. మంగల్

చెప్పింది వాస్తవం. పరిస్థితులు నాకు యే మాత్రం అనుకూలంగా లేవు. అనువుగాని చోట అధికుల మన రాదనే సూక్తిపట్ల నమ్మకమున్నవాణ్ని గనక ఆ తర్వాతి కార్యక్రమం వీలునిబట్టి ఆలోచించవచ్చని మంగల్‌తో సంధికి ఒప్పుకున్నాను.

వజ్రాలను చూసి అతని కళ్ళలో వెలిగిన ఆనందం నేను మాటల్లో వర్ణించలేనిది. మంగల్ వజ్రాలమూటను జేబులో తోస్తూ "ఇతణ్ని చెట్టుకు కట్టండి" అన్నాడు తన అనుచరులతో.

మంగల్ అనుచరులు క్షణాలమీద నన్ను చెట్టుకి కట్టారు.

జరిగిన అన్యాయానికి నాకు ఒళ్ళు మండిపోయింది. "మంగల్! ఇది ఘోరం, దారుణం, దగుల్బాజీతనం...." అరిచాను పెద్దగా.

మంగల్ నవ్వుతూ చెయ్యెత్తి "తొందరపడి నన్ను దూషించకు మిత్రమా! మమ్మల్ని నువ్వు చాటుగా వెంబడించి దొంగదెబ్బ తీయకుండా ఇది ముందుజాగ్రత్తన్న మాట. బలరాం ముడులు వేయడంలో బహు నేర్పరి. ఆ కట్లను నువ్వు ఆదేపనిగా ఓ పావుగంట గుంజితే ముడి నెమ్మదిగా దానంతట అదే విడిపోతుంది. ఈలోగా మేం చాలా దూరం పోతాం" అన్నాడు.

మంగల్ తన గుర్రాన్ని వెనక్కి తిప్పుతూ నా తుపాకీని స్వాధీనం చేసుకున్న అనుచరుణ్ణి "ఆ తుపాకీ అతని ప్రక్కనే పడేయ్!" అని ఆజ్ఞాపించాడు. ఆ అనుచరుడు నా తుపాకీని నన్ను కట్టబడిన చెట్టుకే ఆనించి వెనక్కి పోయాడు.

మంగల్ చేయి వూపుతూ "సెలవు మిత్రమా!"

అన్నాడు. గుర్రాలు కదిలాయి. వెర్రి మొహం వేసి దిక్కులు చూస్తూ వుండిపోయాను నేను.

నిరుత్సాహపడి ప్రయోజనం లేదని అంతలోనే తిరిగి ధైర్యం తెచ్చుకున్నాను. ఏదోలా తిరిగి దెబ్బతీసే అవకాశం నాకు దొరక్కపోదు. ఆ ఆలోచన వచ్చిందే తడవు ఆగకుండా ముందు వెనుకలకు వూగుతూ తాళ్ళను గుంజడం ప్రారంభించాను. ఎడతెరిపిలేని నా ప్రయత్నం ఫలితంగా తాడు ముడి పది నిముషాల్లోనే విడిపోయింది. తుపాకీ చేతబట్టి గట్టిగా వూపిరి పీల్చుకున్నాను.

ఇంతలో యెక్కడో తుపాకీ మోత లీలగా నా చెవులకు సోకింది. చెవులు రిక్కించాను. సందేహంలేదు! ఇరు వర్గాల మధ్య పోరాటమది! తుపాకులు ఆదేపనిగా మోగుతున్నాయి. మంగల్ తన అనుచరులతో వెళ్ళిన దిక్కుగానే ఆ చప్పుళ్ళు వినపడేది. ఫాతూన్‌ని భుజంమీద వేసి పరుగెత్తాను.

మార్గ మధ్యంలో వుండగానే కాల్పులు చల్లబడిపోయాయి. ఏం జరిగివుంటుంది? మంగల్ అనుచరులు వజ్రాలకోసం తమలో తాము కీచులాడుకున్నారా? లేక వేరే వర్గమేదయినా మంగల్ ముఠామీద దాడి జరిపిందా? మంగల్‌ని ఎదిరించే సాహసం ఎవరికి వుందిక్కడ? అంతా అనూహ్యంగా వుంది!

నా అంచనా ప్రకారం కాల్పులు మొదట నేను బయల్దేరిన చోటునుండి రమారమి మైలు దూరంలో జరిగి వుండాలి. ఆ మాత్రం దూరాన్ని చేరగానే పరిసరాలను జాగ్రత్తగా గమనిస్తూ అడుగు ముందుకు వేస్తున్నాను.

ఐదు నిముషాలయినా గడవకముందే కంటబడిన దృశ్యాన్ని చూసి నిశ్చేష్టుణ్ణయ్యాను.

ఇంచుమించు మంగల్ మాత్రా అంతా గుర్రాలలో సహా రక్తపుమడుగులో తేలుతున్నారు. చెల్లాచెదురుగా పడివున్నాయి శవాలు. శరీరాలు తూట్లుపడి జల్లెడ మాదిరి తయారయ్యాయి.

మంగల్ కోసం గాలించాను. ఓ పొదప్రక్కన పడి వున్నాడు మంగల్! చివరిక్షణాల్లో వున్నాడు. కళ్ళు మూసుకొని భారంగా వూపిరి పీలుస్తున్నాడు. శరీరంలో తూటా దెబ్బలు తగలనిది ఒక్క శిరస్సు మాత్రమే!

మంగల్ ప్రక్కన మోకాళ్ళమీద కూర్చొని పేరు పెట్టి పిలిచాను. అతిప్రయత్నంమీద కళ్ళు తెరవగలిగాడు మంగల్. నన్ను చూస్తూనే అతని కళ్ళు వెలుగుతో నిండాయి.

"ఏం జరిగింది మంగల్!" అడిగాను ఆత్రంగా.

మంగల్ నోటిని తెరిచే ప్రయత్నం చేస్తూ తన చేతితో నా చేతిని పట్టుకున్నాడు గట్టిగా.

"ప్ర... ప్ర....ప్రతా....వ్ ....వ....వ్వజ్రాలు.. ...."

అంతే. ఆ పైన చెప్పలేకపోయాడు మంగల్. అర్థమయిందన్నట్టు తల వూపాను. మంగల్ కళ్ళు తిరిగి మూతపడిపోయాయి. నా చేయి పట్టిన మంగల్ చేయి వదులుగా జారిపోయింది కిందకు.

నా కళ్ళు అప్రయత్నంగా నీళ్ళు చిమ్మాయి. మంగల్ సేన్ డాకూ కావచ్చుగాక! మాటకు కట్టుబడే మనిషి. ప్రతాప్ లాంటి నయవంచకుల కన్నా వేయిరెట్లు నయం!

# 8

బిగ్గరగా సకిలిస్తూ ముందుకు దూకింది అశ్వం. ప్రారంభంలోనే నాలుగుకాళ్ళ వేగాన్ని అందుకుంది. అప్పటికే

తృప్తిలేక బూటు కాళ్ళతో గుర్రం డొక్కలో పొడుస్తున్నాను.

మంగళ్ సేన్ ముఠాకి చెందిన దా అశ్వం. ప్రతాప్ సింగ్ ముఠా బారినుండి ఎలా తప్పించుకున్నదో పోరాటం జరిగిన ప్రాంతానికి కాస్తంత దూరంలో నాకంటపడింది. ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రతాప్ ముఠా అరణ్యం దాటి పోకూడదన్నది నా ధ్యేయం.

అరగంటలో గమ్యాన్ని చేరాను. నిక్కుతూ నీల్గుతూ పోతున్నది ప్రతాప్ ముఠా. వారికంట పడకుండా జాగ్రత్తగా ఓ ఐదు నిమిషాలు వారిని వెంబడించాను. అంతా కలిపి ఓ డజనుమంది వున్నారు. అందరి దగ్గరా అధునాతనమయిన మెషిన్ గన్ లున్నాయి. మంగళ్ ముఠాని ఆ కారణంగానే వీళ్ళు సులువుగా దెబ్బతీయ గలిగారు.

క్షణకాలం ఆలోచించాను. ఈ పరిస్థితిల్లో ఇంత మందిని దెబ్బతియ్యడం నా ఒక్కడివల్లా జరిగే పని కాదు. అలాగని మరొకరు నాకు సాయం వచ్చే అవకాశమూ లేదిక్కడ. అప్పటికప్పుడు ఏం చెయ్యాలో ఆలోచించి అశ్వాన్ని దారి మళ్ళించాను.

ఆ మార్గంలో ప్రతాప్ ముఠాకంటె ముందు వున్నానిప్పుడు. ప్రతాప్ తన నివాసాన్ని చేరేందుకు ఈ మార్గంలోనే పయనించవలసి వుంది. వాయువేగంతో అశ్వాన్ని పరిగెత్తిస్తూ అనువయిన ప్రాంతంకోసం వెదుకుతున్నాను. ప్రతాప్ మంగళ్ ముఠాని దొంగదెబ్బ తీసాడని తెలుస్తూనే వుంది. ముల్లును తీసేది ముల్లే.

ప్రతాప్ లాంటి వాళ్ళను ఈ ప్రభుత్వాలు చట్టాలు ఏం చెయ్యలేవు. అరణ్యంలో సాధారణ చట్టాలు చెల్లు

బడిశావు. దెబ్బకి దెబ్బన్నర! అదే న్యాయమిక్కడ! ప్రతాప్ మురాని నేను అదే సూత్రం ఆధారంగా సర్వ నాశనం చెయ్యాలనుకుంటున్నాను.

చుట్టూ దట్టమయిన చెట్టూ చేమలతో నిండిన వాతావరణం ఒక్కసారిగా మారి మైళ్ళకొద్దీ వ్యాపించిన విశాలమయిన పచ్చిక బయళ్ళు, వాటిని అనుకున్న బ్రహ్మాండమయిన పర్వతాలుగల ప్రదేశంలో పయనిస్తోంది అశ్వం.

పరయినచోట అశ్వాన్ని ఆపి దానిని ఒకచాటు ప్రదేశంలో కట్టాను. వడివడిగా పర్వతం మధ్యభాగాన్ని చేరాను. రాయి రప్పా అల్లిబిల్లిగా ఓ మోస్తరు పొదలు. నా కార్యక్రమానికి అనువయిన స్థలమది. అక్కడే ఓ బల్లపరపుగా ఉండే రాతిని ఎన్నుకున్నాను. ముందు భాగంలో కొంచెం ఎత్తుగా, వెనక్కి వచ్చేకొద్దీ వాలుగా, బోర్లా పడుకొని తుపాకీ పేల్చేందుకు చక్కగా అమరింది రాయి.

రాతిమీద పొజిషన్‌లో ఉండి కిందకు చూసాను. పచ్చికబయలు దానిమధ్య మార్గము కనుచూపుమేర స్పష్టంగా గోచరిస్తోంది. అదే సమయంలో మైదానంలో ఉన్నవారు బైనాక్యులర్స్‌తో గాలించినా నా ఆచూకీ దొరకదు.

నా చేతిలో ఫారూన్ లక్ష్యంకోసమని వువ్విళ్ళూరుతోంది. తన యజమానిముందు అనితర సాధ్యమయిన తన ప్రతిభను ప్రదర్శించే సమయమది.

బహు దూరాన అశ్వాలు ధూళిరేపుతూ వేగంగా వస్తున్నాయి. నా గుండె చప్పుడు స్పష్టంగా నాకే వినపడుతోంది. వుద్వేగం నిండి శరీరం రోమాంచితమయింది.

ముందున్న కార్యం సామాన్యమయింది కాదని నాకు తెలుసు. జయాపజయాలు దైవాధీనంకాకూడదు. ఆరు నూరయినా ఇందులో గెలిచితీరాలన్నదే నా దృఢ విశ్వాసం!

అశ్వాలు రౌతులు లీలగా కనిపిస్తున్నారిప్పుడు. సుమారు వెయ్యిగజాల దూరంలో వున్న లక్ష్యాన్ని, అదీ వేగంగా కదిలే లక్ష్యాన్ని ఛేదించడమంటే మాటలుకాదు. ఇందుకు ఎంతో ఏకాగ్రత, కాలపరిజ్ఞానం, సునిశిత దృష్టి అవసరం. పై మూడింటిలో యే ఒక్కటి లోపించినా నా చేతిలో ఫారూన్ నన్ను వెక్కిరిస్తుంది.

తుపాకీ సరిచేసి గురి చూసాను. ఆకారాలు తప్ప మనుషులెవరో తెలిసే అవకాశంలేదు. తనదయిన ప్రత్యేకతలో నా చేతిలో ఫారూన్ గర్జించింది. ఆ శబ్దం చుట్టూ వ్యాపించివున్న కొండల్లో ప్రతిధ్వనించింది. వెను వెంటనే కనిపించింది ఫలితం. ఒక రౌతు నేలకూలాడు. తృప్తిగా నిట్టూర్చాను. వెంటనే మరొకడు!

ముఠాలో కలకలం బయల్దేరింది. కళ్ళాలు బిగించబడిన అశ్వాలు సకిలిస్తూ కదం తొక్కుతున్నాయి. ఇంతలో మరోసారి పేలుడు. కెవ్వున ఆర్తనాదం! ప్రతాప్ ముఠా జరుగుతున్నదేమిటో తెలుసుకునేలోగా నలుగురు వ్యక్తులు రక్తం చిందే గుండెల్ని అదిమిపడుతూ నేల కూలారు.

చుట్టూ పర్వతాలు! కనుచూపు మేరలో ఎక్కడా ఏ అలికిడీ లేదు. కొండల్లో ప్రతిధ్వని. ఎటునుండి తుపాకీ పేలుతున్నదో స్పష్టం కావడంలేదు. ఫారూన్‌లో విశేషం పొగను తనలోనే ఇముడ్చుకొని చల్లబరచ

గలడం.

ప్రతాప్ కి పరిస్థితి అర్థమయింది. నిస్సందేహంగా ఇది ఫారూన్ పనితనం. అంటే విక్రమ్ కొండల్లో ఎక్కడో దాగి తమను దెబ్బతీస్తున్నాడన్నమాట! ప్రతాప్ కి కడుపు రగులుకు పోయింది. కళ్ళముందే విశ్వాసపాత్రులయిన అనుచరులు మట్టికావడం ఏ నాయకుడు సహించగలడు?

"విక్రమ్!" అరిచాడు గట్టిగా. ప్రతాప్ కేక లోయలో ప్రతిధ్వనించింది .... "పిరికివాడిలా దొంగ దెబ్బతీయడం కాదురా! చాతనయితే బయటపడి పోరాడు."

ప్రతాప్ నోటికి సమాధానం ఫారూన్ చెప్పింది. శాశ్వతంగా మూతపడవలసిన ఆ నోరు అప్పుడే మరొక అనుచరుడు అడ్డం వచ్చిన కారణంగా బ్రతికిపోయింది. చూచాయగా నా ఉనికి అప్పటికి అర్థమయింది ప్రతాప్ కి. వెర్రి ఆవేశంతో తన అనుచరుల్ని ముందు నేనున్న పర్వతం దిక్కుగా పురిగొల్పుతూ తను వారిని వెన్నాడి వస్తున్నాడు.

పర్వతాన్ని చేరేలోగా మరో ముగ్గుర్ని యమపురికి పంపింది నా ఫారూన్. మిగిలిన వ్యక్తులు గుర్రాల పైనుండి దూకి కొండరాళ్ళ ఆసరాగా పైకివస్తున్నారు. ఇక ముఖాముఖీ పోరాటం తప్పదు. పొదల మాటున ప్రాకుతూ మరికొంచెం ఎత్తుకు వెళ్ళాను.

మునుపటి నా స్థావరాన్ని గమనిస్తూ మరో సురక్షిత మయినచోట పొంచి వున్నాను. నిమిషాలు గడుస్తున్నాయి. హోరున వీచే కొండగాలి శబ్దం తప్ప మరేదీ లేదక్కడ.

ఇంతలో పొదల మాటునుండి ఎక్కుపెట్టిన తుపా

ఉలలో బండమీదకు చెరో ప్రక్కనుండీ ఒకేసారి దూకారు ఇద్దరు. అక్కడ నేను లేకపోవడం చూసి తెల్ల మొహాలు వేస్తూ మొహాలు చూసుకుంటున్న వేళ, వారికి నా ఉనికిని తెలియబరుస్తూ గర్జించింది ఫారూన్. ఇద్దరూ కలిసికట్టుగా వెనక్కి విరుచుకు పడిపోయారు.

ఇక మిగిలింది ఇద్దరు. నెమ్మదిగా లేచి రాళ్ళ వెనక ఒంగినడుస్తూ మరో చోటు చూసుకున్నాను.

అరగంట గడిచినా ఏ అలికిడీ లేదు. నిరీక్షణ వేటగాడికి ప్రాథమిక విద్య. అరగంట కాదు అర్ధరాత్రి వరకూ శరీరంలో ఎటువంటి కదలిక లేకుండా కూర్చోగలను.

మరో అరగంట గడిచాక రాళ్ళ వెణికి బడబడ దొర్లుతున్న శబ్దం వినపడి చటుక్కున లేచాను. కంగారుగా వెనక్కి పరుగెడుతున్నాడొక వ్యక్తి. మెరుపువేగంతో తుపాకీ పేల్చి కూర్చుండిపోయాను. కెవ్వుమనే కేక దబ్బున చప్పుడువిన పడింది. లెక్కపదకొండు. కేకనుబట్టి పదకొండో నెంబరు ప్రతాప్ కాదని గ్రహించాను.

గంట! రెండు గంటలు! మూడు గంటలు గడిచి చీకటి పడింది. ప్రతాప్ నుండి సమాధానంలేదు. ఏమయ్యాడు ప్రతాప్! చడీ చప్పుడూ లేకుండా వెనక్కి మరలి పోయాడా? అలా అని తొందరపడకూడదు. ప్రతాప్ సయితం వేటగాడే! మరో గంట గడిచింది. చలిగాలి ఉధృతంగా వుంది. నెమ్మదిగా లేచి చుట్టూ పరికించాను.

ఇంతలో యేదో చప్పుడు వినపడి చటుక్కున అటు తిరుగుతూ తుపాకీ పేల్చే ప్రయత్నంలో ఉన్నాను. కంటబడిన దృశ్యం చూసి అలాగే వుండిపోయాను. ఫారూన్ దెబ్బతిని చనిపోయిన వ్యక్తి శవాన్ని

తో రేళ్ళు పీక్కు తింటున్నాయి.

పరిసరాలను వేయికళ్ళతో గమనిస్తూ జాగ్రత్తగా కొండ దిగాను. ప్రతాప్ ఎక్కడా తారసపడలేదు. పిరికిపంద! పలాయనం చిత్తగించాడు.

ప్రతాప్ ఒక అరణ్యంలో పట్టుబడడం జరగని పని. విటూయనూ ఆ రాత్రికి కొండరాళ్ళమధ్య ఓ అనువయిన స్థలంలో నిద్రపోయాను. తూరుపు తెలవారుతుండగా లేచి గుర్రమెక్కాను.

## 9

సుమారు ఓ గంట ప్రయాణం చేసి ఉంటానేమో! దారి ప్రక్కనే వున్న బండరాతి వెనకనుండి చెంగున దూకి యెదురుగా నిలబడిన వ్యక్తిని చూసి నివ్వెర పోయాను.

చేతిలో నా గుండెలకు గురిపెట్టబడిన రివాల్వర్ తో ప్రతాప్!

రాత్రంతా నాకోసమని పడిగాపులు పడినట్టు మొహ మంతా పీక్కుపోయి కళ్ళు చింత నిప్పుల్లా ఉన్నాయి.

ప్రతాప్ క్రూరంగా నవ్వుతూ "స్వాగతం మిత్రమా! పిచ్చి వేషాలు వెయ్యకుండా జాగ్రత్తగా గుర్రం దిగు!" అని ఆజ్ఞాపించాడు రివాల్వర్ ఊపుతూ.

అతను చెప్పింది చేయడం మినహా మరో దారి లేదు. నా ఫాయూన్ గుర్రానికి కట్టబడిన తోలు పట కాలో వుంది. అంతే కాదు! రాత్రి ఖాళీ అయిన తూటాల స్థానంలో కొత్తవి తిరిగి అమర్చని నా బుద్ధి మాంద్యాన్ని నేనే నిందించుకున్నాను. ఇంతలోనే ఇటు వంటి ఉపద్రవం ముంచుకువస్తుందని నేను భావించక

పోవడం నిజంగా పొరపాటే! బుద్ధిమంతుడిలా గుర్రం దిగి చేతులెత్తేసాను. అయినా దేవుడు మేలు చేసి ఏదన్నా జరక్కపోతుందా అనే ఆశమాత్రం చావలేదింకా!

"అరేయ్ విక్రమ్! నా ముఠా అంతటినీ నాశనం చేసావు. భైరవ్ నికూడా నువ్వే చంపివుంటావు. నిన్ను నేను వదలను. కావాలంటే ఈ రివాల్వర్ తో నిన్ను కుక్కను కాల్చినట్టు కాల్చి చంపగలను. కానీ అరేయ్ విక్రమ్! నీకు ఆ ఫారూన్ గన్ అంటే మహా ప్రీతి కదూ! నిన్నూ దానితోనే చంపుతానని ప్రతిజ్ఞ చేశాను. పిచ్చి వేషాలెయ్యక ఆ ఫారూన్ ఇటు విసురు" అన్నాడు ప్రతాప్.

దేవుడు దయామయుడు. నాకేదో దారి దొరక బోతోంది. కాకపోతే దొరికినవాణ్ణి దొరికినట్టే చంపక ఈ ప్రతిజ్ఞాపాలన లేమిటి ఈ వెధవకి! చేటుకాలం కాకపోతే! బుర్రకి పదును పెడుతూ

"అందులో గుళ్ళు లోడ్ చేసి లేవు" అన్నాను నెమ్మదిగా.

పకపకలాడాడు ప్రతాప్. "అంత నిర్లక్ష్యం గనకే నాకు దొరికిపోయావు. పిచ్చి తలంపులు పెట్టుకోకుండా గన్ లోడ్ చేసి ఇటివ్వు" అన్నాడు ప్రతాప్.

బుద్ధిగా తల ఊపి ఫారూన్ అందుకున్నాను. నేను యేమాత్రం తొందరపడినా వెంటనే దెబ్బ తీసేందుకు ప్రతాప్ నా ముఖకవళికల్ని అతి జాగ్రత్తగా పరి కిస్తున్నాడు. ఈలోగా గుళ్ళు లోడ్ చేస్తున్న నా చేతి వేలి ఉంగరం బారల్ లో జొరబడింది. ప్రతాప్ ఆ సంగతి గమనించే స్థితిలో లేడు. చిన్నగా నిట్టూరుస్తూ తుపాకీ ప్రతాప్ కందించాను.

"గుడ్!" నవ్వాడు ప్రతాప్. రివాల్వర్ తిరిగి పాకెట్‌లో పెట్టేసాడు.

"ఇది యేనాడూ నువ్వు వూహించని అనుభవం కదూ విక్రమ్! ఆఖరుసారిగా దేవుణ్ని ప్రార్థించుకో" పకపక లాడుతూ ట్రిగ్గర్ నొక్కాడు ప్రతాప్.

వూహించని అదురుతో ప్రతాప్ వెనక్కి విసిరివేయ బడ్డాడు. ఫారూన్ తారాజువ్వలా గిజగిజలాడుతూ మరో ప్రక్కకు పడిపోయింది. ప్రతాప్ తేరుకొని తిరిగి లేచే లోగా నా కాలిబూటులో ఇముడ్చబడిన చాకు సర్ మంటూ పోయి అతని గుండెల్లో దిగబడింది బలంగా.

ప్రతాప్ ఎక్కడివాడు అక్కడే వెనక్కి విరుచుకు పడిపోయాడు. కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూ నా కళ్ళముందే ప్రాణాలు వదిలేసాడు.

ప్రతాప్ శవం వంక జాలిగాచూస్తూ నిట్టూర్చాను. నిజానికి ఆ చావు నాకు రావలసినది. అందుకే మా గురువుగారు చెప్పేవారు!

శత్రువు ముందర నిర్లక్ష్యం, రోగం దగ్గర అలస్యం పనికిరావనేవారాయన.

పాపం! ప్రతాప్‌కి అటువంటి గురువు లెవరూ లేరేమో తప్పటాలిపోయాడు. ప్రతాప్ జేబులు వెదికాను. వజ్రాల మూట దొరికింది.

వీటిని ఇప్పుడేం చెయ్యాలి? ఆఫ్రికాలో ఒక కోటీ శ్వరుడిని చంపి — ప్రతాప్ వీటిని దొంగిలించాడు. ఆఫ్రికాలో ఉన్న వీటి స్వంతదారు యెవరో నాకు తెలియదు. ఆ ప్రయత్న మేదిచేసినా లేనిపోని చిక్కుల్లో పడడమే అవుతుంది. ఈ గొడవంతా దేనికి? వజ్రాలను చక్కగా పార్శిలుచేసి యే అనాధశరణాలయానికో

పంపితే సరి!

పుణ్యమూ పురుషార్థమూ చేకూరినట్టవుతుంది!

తృప్తిగా నిట్టూర్చి గుర్రమెక్కాను. ఆకాశంలో విహరించే రాబందుల నీడలు ప్రతాప్ శవంమీద పడుతున్నాయప్పుడే! "చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత" అంటే ఇదే కాబోలు!

అరుణోదయ కిరణాలను చీలుస్తూ ముందుకు సాగింది నా అశ్వం!

—: అ యి పో యిం ది :—

సీరియల్



ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

రంజిత్ అరిచిన అరుపుతో మెరుపు వేగంతో ఆ వైపుకు తిరిగింది స్టెల్లా. తిరుగుతూనే ప్రమాదాన్ని గుర్తించి రివాల్వర్‌తో ఎర్రతోడేలు తలకేసి కాల్చింది. ఆమె గురి తప్పలేదు.

ఎర్రతోడేలు కణతలోకి దూసుకుపోయింది బుల్లెట్. భీకరంగా అరుస్తూ పక్కకు పడిపోయింది.

లేచి నిలుచున్నాడు రంజిత్. కిందపడిన తుపాకీని అందుకున్నాడు. వెంటనే షాక్ నించి తేరుకోలేక పోయాడు.

స్టెల్లా తనమీదకు దూకుతున్న మరో ఎర్రతోడేలు తలమీదకు కత్తిని విసిరింది. అది తల పక్కకు తిప్పటం వల్ల చెవికి తగిలింది. కసుక్కున దాని చెవి తెగి కింద పడింది.

తుపాకీ మడమతో ఎర్రతోదేలు తలమీద శక్తికొద్దీ కొట్టాడు జాన్సన్. దాని తల రెండు చెక్కలుగా పగిలి పోయి నెత్తురు బయటకు చిమ్మింది.

భారత్‌ను వదల్లేదు ఆ ఎర్రతోదేలు. అతడి వెనుకే నోరు తెరిచి కోరల్లాంటి పళ్ళు బయటకు పెట్టి పరుగు దీసింది. అతడికి తుపాకి గురిచూసి కాల్చే అవకాశంలేదు. ఏం చెయ్యటానికి దిక్కు తోచలేదు.

ఆ పరిస్థితిని గమనించి పైలట్ డోర్ దగ్గర నుండి తుపాకి పేల్చాడు కాని అది గురి తప్పింది.

చెవి తెగిన ఎర్రతోదేలు మరింత కోపంతో సెల్లా మీదకు మళ్ళీ యెగిరిదూకింది. ఈసారి కూడా ఆ తోదేలు తెలివిగా తల పక్కకు తిప్పి కత్తివేటును తప్పించుకుం టుందని వూహించిన సెల్లా ముందుగానే కత్తిని తలకు కొంచెం పక్కగా విసిరింది.

సరిగ్గా అనుకున్నట్టే జరిగింది. ఎర్రతోదేలు తలను పక్కకు తిప్పింది. అంతే! సెల్లా కత్తి దాని తలను రెండుగా చీల్చేసింది.

అది అరవకుండానే కూలిపోయింది.

సరిగ్గా అదే సమయంలో అనంత్—భారత్ మీదకు దూకబోతున్న తోదేలుమీదకు తుపాకి పేల్చాడు. కాని అది గురితప్పింది.

మరోసారి కాల్చబోయి ఆగిపోయాడు. ఈసారి కాలిపే గుండు భారత్‌కు తగిలే అవకాశం వుంది. ఎర్ర తోదేలు భారత్‌కు ఎదురుగా వచ్చేసింది.

రావటంతోనే రెండు కాళ్ళనూ పైకెత్తి నోరు తెరిచి భారత్ గుండెలమీదకు దూకింది. పళ్ళతో అతడి గుండె లను చీల్చే ప్రయత్నం చేస్తున్నప్పుడే ప్రాణభయంతో

భారత్ బిగ్గరగా అరిచాడు.

ఆ అరుపు వినటంతోనే అప్పుడే కత్తి విసిరిన సెల్లా ఉలిక్కిపడి తలతిప్పి చూసింది. చూస్తూనే ఒక్క సెకను కూడా ఆలస్యం చెయ్యకుండా అక్కడినించే గాల్లో యెగిరి డైవ్ చేసింది భారత్ దగ్గరకు.

కత్తితో దాన్ని పొడిచే అవకాశం లేదు. కత్తి భారత్ కు కూడా తప్పక తగులుంది. రివాల్వర్ పేల్చే అవకాశం కూడా లేదు. ఎగిరి దూకుతూనే యిలా ఆలోచించి— చేతిలో వున్న కత్తినీ, రివాల్వర్ ను కిందికి వదిలేస్తూ రెండు చేతులతో ఎర్రతోడేలు వెనకకాళ్ళు పట్టుకుని వెనక్కి విసురుగా లాగుతూ కింద పడిపోయింది.

సెల్లా అలా లాగటంతో భారత్ గుండెలను పళ్ళతో చీల్చబోతున్న ఎర్రతోడేలు నోటికి భారత్ వేసుకున్న షర్టు మాత్రమే దొరికింది.

కాళ్ళు పట్టుకుని లాగిన విసురుకు సెల్లా వెనుక పడిపోయింది ఎర్రతోడేలు. పడుతూనే నేలకు కొట్టిన బంతిలా లేస్తూ యెగిరి కిందపడిన సెల్లామీదకు దూకబోయింది.

ఎర్రతోడేలు చర్యను ముందుగానే పసిగట్టిన సెల్లా కిందపడుతూనే కత్తిని అందుకుని దాన్ని పైకెత్తి యెదురుగా పట్టుకుంది వెల్లకింతలా పడుకుని.

అవుట్! సెల్లామీదకు ఎగిరిదూకిన ఎర్రతోడేలు పొట్టలోకి నిలువుగా చివరంటా దిగిపోయింది పొడుగాటి కత్తి.

ఘోరంగా అరుస్తూ నోరు తెరిచేసింది ఆ ఎర్రతోడేలు.

•  •  •

అంతా నోళ్ళు తెరిచి కొయ్యబారిపోయి స్టెల్లా చేసిన ఆ సాహసాన్ని చూస్తూండిపోయారు బొమ్మల్లా నిలబడి.

జిత్తుల ఎర్రతేలును అంతకంటే గొప్ప జిత్తుతో ఎంతో సమయస్ఫూర్తితో మాతమూర్చిన స్టెల్లా తెలివి తేటలు, ధైర్యసాహసాలు వాళ్ళందరినీ ఆశ్చర్య చకితుల్ని చేశాయి.

ఎర్రతేలు పొట్టలోనించి కత్తిని బయటకు లాగేసింది స్టెల్లా.

కొంచెంసేపటి తర్వాత అంతా షాక్ నించి బయటపడ్డారు.

పది ఎర్రతేళ్ళూ భయంకరంగా చచ్చిపోయి చెల్లాచెదురుగా పడివున్నాయి.

షాక్ నించి తేరుకున్న భారత్ అక్కడ మరికొంత మంది మనుషులు వున్నారనే విషయాన్ని కూడా మరచిపోయి రివ్వున వచ్చి స్టెల్లాను కౌగలించుకుని బలంగా ఆమె పెదవుల మీద ముద్దు పెట్టుకుని ఆమెను వదిలాడు....

అతడి చర్యకు స్టెల్లా షాకయ్యింది. అతనలా చేస్తాడని ఆమె అనుకోలేదు.

"స్టెల్లా....నీ సాహసం అపూర్వం....నీ సాహసంతో యీ రోజు నువ్వు మా అందరి ప్రాణాలూ కాపాడావు" అన్నాడు భారత్.

చిరునవ్వు నవ్వింది స్టెల్లా కిందపడిన రివాల్వర్ను అందుకుంటూ—

ఒక్కొక్కరు ఆమెను ప్రత్యేకంగా అభినందించారు. చివరకు లీల—పైలట్ కూడా ధైర్యంగా కేబిన్లోనించి

దిగివచ్చి ఆమె చూపిన తెగువకు—ధైర్యసాహసాలకు మెచ్చుకున్నారు.

చివరగా జాన్సన్ ఇలా అన్నాడు—

"ఇప్పటివరకూ ప్రాణాలకు తెగించి పోరాటానికి దిగటంలో నేనే మొనగాడినని అనుకునే వాడిని. కాని ఇప్పుడు నీ సాహసం_చొరవ_తెగింపు_వేగం చూసిన తర్వాత నీ ముందు నేనెందుకూ పనికిరానని అర్థమయ్యింది. నువ్వు వుండగా రంజిత్ మా ప్రాణాలకు తోడుగా ఉండటానికి నన్నెందుకు తీసుకువచ్చాడో తెలీటంలేదు. నువ్వు మామూలు ఆడదానివి కాదు."

ఆ మాటలతో స్టెల్లా పొంగిపోలేదు.

వాళ్ళందరి పొగడ్తలనూ చిరునవ్వుతో స్వీకరించింది.

సరిగ్గా అప్పుడే చూసింది లీల బండపక్కనే నీడలో పడివున్న కొండచిలువను.

దాన్ని చూస్తూనే "కొండచిలువ" అంటూ అరిచింది. అంతా అప్పుడు చూశారు దాన్ని.

"భయపడకండి .... అది బతికిలేదు. దాన్నికూడా స్టెల్లాయే నరికేసింది" అంటూ జాన్సన్ జరిగినదంతా వాళ్ళకు చెప్పాడు.

వాళ్ళకు స్టెల్లాను ఎలా అభినందించాలో అర్థంకాలేదు. ప్రొఫెసర్ అనంత్‌కీ, లీలకీ స్టెల్లా పక్కన ఉండగా తమకు ఎలాంటి భయమూ ఉండదనే నమ్మకం కలిగింది.

ఇక ఆ రాత్రి ఎవ్వరూ నిద్రపోలేదు.

ప్రొఫెసర్ అనంత్ సాబూజా దీవివాసులకు ఎర్ర తోడేళ్ళ మాంసం అంటే ఎంతో ఇష్టం అని చెప్పిన తర్వాత జాన్సన్ చెల్లాచెదురుగా పడివున్న ఎర్రతోడేళ్ళను ఈడ్చుకువచ్చి స్టోర్ రూంలో పడేశాడు.

గొప్ప ప్రమాదం నించి బయటపడినందుకు అంతా సంతోషపడిపోయారు. రంజిత్‌కీ, భారత్‌కీ స్వల్పంగా గాయాలైనాయి.

అంతా తెల్లవారటంకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు. భారత్ మెదడులో తిరిగి టకారదీవి గురించిన ఆలోచనలు మొదలైనాయి.

*    *    *

తూర్పు తెల్లబడింది. చీకటి తెరలు తప్పుకుని సంధ్యా కాంతులు ప్రసరిస్తున్నాయి.

ఆహ్లాదకరంగా ఉంది వాతావరణం.

ఇంకా సూర్యోదయం కాలేదు.

కాబోతున్నది. సూర్యుడు పైకి రావడానికి ప్రయత్నం చేస్తున్నట్టుగా ఆకాశం ఎర్రబడబోతున్నది.

అప్పటికే అంతా సిద్ధమయ్యారు.

రాత్రి అంతగా భయపెట్టిన ఆ పరిసరాలు—ప్రకృతి వెలుగులో యెంతో రమ్యంగా కనిపించాయి. బండ పక్కనే పడివున్న కొండచిలువ చుట్టమటుకు అసహ్యంగా కనిపించింది.

తిరిగి హెలికాప్టర్ రొద పెట్టుకుంటూ పైకిలేచింది. దాని గాలికి చుట్టూ ఉన్న చెట్ల ఆకులు అటూ ఇటూ ఊగాయి. నిద్ర లేచికూడా బద్ధకంగా కూర్చుని అరుస్తున్న పక్షులన్నీ ఒక్కసారి భయంతో అరుస్తూ పైకిలేచాయి.

ఎత్తుకు లేచిన తర్వాత దిశమార్చుకుని నికోలాయ్ దీవుల మీదనించి యెంతో ఉత్సాహంతో దూసుకుపోయింది హెలికాప్టర్.

అందరికీ సంతోషంగా వుంది—ఎందుకంటే ప్రమా

దంతో నిండివున్న నికోలాయ్ దీవులనించి ఎటువంటి ప్రాణ నష్టం లేకుండా బయటపడ గలిగినందుకు.

ఐతే ఆ రాత్రి ఎదురు చూసిన అనుభవాన్ని మాత్రం వాళ్ళు ఎన్నటికీ మరువలేరు.

జరిగినదంతా ఒక్కసారి తల్చుకుంటే అప్పుడుకూడా వాళ్ళందరికీ గుండెలు దడదడమని కొట్టుకున్నాయి.

ఏమైతేనేం? తమ అదృష్టం బావుంది.

ఆలోచనల్లోనే నికోలాయ్ దీవులు దాటిపోయాయి. దాటిపోయేముందు వారికి దీవి అంతమవుతుందనగా సముద్ర తీరంనించి చెట్లవైపుకు పరుగుదీస్తున్న రెండు ఎర్ర తోడేళ్ళు—మరో మృగం కనిపించాయి.

ఆ మృగం అడవిదున్నలా వుంది. కాని దానికి కొమ్ములులేవు. బాగా ఎత్తుగా—బలిష్టంగా ఉంది.

రాత్రి అలాంటి మృగాలుకూడా తమమీద దాడి చెయ్యనందుకు వాళ్ళు సంతోషపడ్డారు. అటువంటి మృగాలు నాలుగు వచ్చినట్లయితే హెలికాప్టర్‌ని పిండి చేసివుండేవి.

సముద్రంమీద ఎగురుతోంది హెలికాప్టర్.

వాచీకేసి చూసుకున్నాడు ప్రొఫెసర్ అనంత్....

"మరో నలభై నిమిషాల్లో మనం సాబూజా దీవిలో ఉంటాం" అన్నాడు.

రాత్రంతా నిద్రలేకపోవడంవల్ల రంజిత్ పక్కనే కూర్చున్న జాన్సన్ కునికిపాట్లు పడుతున్నాడు. అతడి గుండుమీద రెండు చిన్న చిన్న గాట్లుపడ్డాయి. రాత్రి ఎర్రతోడేళ్ళ పోరాటంలో అవి పడివుండాలి.

"టకారదీవి ఇంతకంటే భయంకరంగా వుంటుందా?" ఉన్నట్టుండి అడిగింది లీల—సైలాని.

"ఉంటుంది. టకారాదీవిలో నీలిరంగు పాములు వున్నాయి. ఇలాంటి ఎర్రతోదేళ్ళు లేవుకాని పులులు ఉన్నాయి. అన్నిటినీమించి క్రూరజంతువుల్లాంటి మనుషులు ఉన్నారు."

"ఇప్పటినించే నాకు భయంగా వుంది" అన్నది లీల.

"ఆ దీవిలో మేము ఏడురోజులు గడిపాం."

"మై గాడ్!" అన్నది గుండెలమీద చెయ్యి వేసుకుని కళ్ళు పెద్దవిచేసి.

వాళ్ళలా మాట్లాడుకుంటున్నప్పుడే హెలికాప్టర్ సముద్రతీరాన్ని దాటి తిరిగి మరో దీవిలో ప్రవేశించింది.

కిందికి వొంగి పరీక్షగా చూస్తున్నాడు ప్రొఫెసర్ అనంత్.

మంచెల్లాగా నిర్మించిన ఇళ్ళనీ, పొడుగ్గా, పొట్టిగా ఆ దీవిలో అక్కడక్కడ తిరుగుతున్న మనుషులను చూస్తూనే గుర్తించాడు.

సాబూజా!

"ఇదే సాబూజా దీవి.... రెండుసార్లు రౌండ్లు కొట్టించి గూడెం మధ్యలో వున్న ఖాళీ ప్రదేశంలో లాండ్ చెయ్యి."

కొంచెం కిందికి దిగింది హెలికాప్టర్.

అప్పటికే దీవిమీద తిరుగుతున్న హెలికాప్టర్ని చూస్తూనే కింద తిరుగుతున్న మనుషులంతా సంతోషంతో పైకిచూస్తూ చప్పట్లు కొట్టటం మొదలుపెట్టారు.

నాగరికులు యెవరో తమ దీవిలో దిగబోతున్నారని వాళ్ళకి తెలిసిపోయింది.

మరికొన్ని నిమిషాల తర్వాత హెలికాప్టర్ గూడెం మధ్యలో ఉన్న ఖాళీప్రదేశంలో లాండయ్యింది.

అంతా ఒక్కొక్కరే బయటకు దిగారు.

అప్పటికే అక్కడ సాబూజా దీవిమనుషులంతా చేరారు. ఎక్కడినించో పరుగులాంటి నడకతో గూడెం దొర జనాన్నందరినీ నెట్టుకుంటూ అక్కడికి వచ్చాడు.

ప్రొఫెసర్ అనంత్‌ను చూస్తూనే గుర్తుపట్టి ఆనందంతో కౌగలించుకున్నాడు. అనంత్ మిగిలిన మనుషులందరినీ వాళ్ళ భాషలో దొరకు పరిచయం చేశాడు.

స్టెల్లాకు ఆశ్చర్యం కలిగించిన విషయం ఒకటుంది— ఆమెకే కాదు—భారత్‌కు కూడా....

అదేమిటంటే ఆ దీవిలో మనుషులు మరీ అంత మొరటుగా—భయంకరంగా లేరు. వాళ్ళలో కొంత మంది మొలకు జంతుచర్మాల్లాంటివి చుట్టుకున్నా మరి కొంతమంది మామూలు నాగరికులు ధరించే దుస్తులే వేసుకున్నారు.

అందరి చేతుల్లోనూ ఈటెల్లాంటివి లేనేలేవు.

ఇంకో విషయం ఏమిటంటే—ఆ దీవిలో మగవాళ్ళు బాగా పొట్టిగా వున్నారు. ఆడవాళ్ళు పొడుగ్గా వున్నారు.

నాగరికులు ఎప్పుడైనా ఓసారి వాళ్ళ దీవికి రావటం వల్ల అంత వింతగా అనిపించలేదు కాని నాగరిక స్త్రీలను వాళ్ళు చూడటం అదే మొదటిసారి. అంతక్రితం కొన్నిసార్లు అనంత్ ఆ దీవికి మరికొందరితో కలిసి వచ్చినా లీలను తీసుకు రాలేదు.

లీలను—స్టెల్లాను వాళ్ళంతా వింతగా చూశారు. అక్కడి ఆడవాళ్ళను స్టెల్లా—లీల కూడా అలాగే చూశారు.

వాళ్ళు మొలచుట్టూ ఏదో నారతో అల్లిన బట్ట

లాంటిది చుట్టుకున్నారు. పువ్వులు, ఆకులతో చేసిన దండల్లాంటి వాటిని మెళ్ళో వేసుకుని వక్షోజాలను కప్పుకున్నారు. అంతకుమించి వాళ్ళ శరీరంమీద యొటువంటి ఆచ్ఛాదనా లేదు.

ప్రొఫెసర్ అనంత్ కి సాబూజా దీవి స్త్రీల అందచందాల గురించి తెలుసు కాబట్టి అతను మామూలుగానే ఉండిపోయాడు కాని ఆ స్త్రీలు బలమైన — బిగువైన అవయవాల పొందికను చూసి భారత్ — రంజిత్ — జాన్సన్ — పైలట్ లు గుటకలు మింగారు.

నాగరికులు తమకోసం తీసుకువచ్చిన విస్కీ సీసాలు సిగరెట్లు చూసి దొర తెగ ఆనందపడిపోయాడు. ఆ తర్వాత స్టోర్ రూంలోనించి బయటకు లాగిన ఎర్రతోదేళ్ళను చూసి దొరతో పాటు మిగిలిన వాళ్ళంతా సంతోషంతో వెర్రిగా కేకలు పెట్టారు.

ఎర్రతోదేళ్ళ శవాలచుట్టూ చేరి పిచ్చిగా ఎగురుతూ నాట్యం చేశారు. దొర కొంచెంసేపు తన్మయత్వంతో ఆ నాట్యాన్ని చూసి "ఇన్ని ఎర్రతోదేళ్ళు యొక్కడివి? వీటన్నింటినీ ఎలా చంపగలిగారు?" అనడిగాడు.

అనంత్ క్రితం రాత్రి నికోలాయ్ దీవుల్లో ఎర్రతోదేళ్ళు తమమీద దాడిచెయ్యటం గురించి వాటిని ఎలా చంపిందీ వివరంగా దొరకు చెప్పాడు.

అంతా విని ఆశ్చర్యంతో నోరు తెరిచాడు దొర. స్టెలా చూపిన సాహసం గురించి విన్నాక ఆమెను బాగా పొగిడాడు.

పది ఎర్రతోదేళ్ళను నాగరికులు వేటాడి తెచ్చారనే వార్త అప్పటికప్పుడే క్షణాలమీద సాబూజా దీవి అంతటికీ తెలిసిపోయింది.

ఆ వార్త వినటంలోనే స్త్రీలు—పిల్లలు పరుగులు తీసుకుంటూ అక్కడికి వచ్చేశారు. వాటిని చూస్తూనే సంతోషం పట్టలేక కొంతమంది భారత్‌నీ, అనంత్‌నీ కౌగలించుకున్నారు.

ఎర్రతోదేళ్ళ మాంసమంటే సాబూజా దీవి మనుషులకు యెంత ఇష్టమో ఆ సంఘటనలో, వాళ్ళ సంతోషంతో అర్థమైపోయింది.

నిజమే. ఎంతో రుచిగా వుండే ఎర్రతోదేలు మాంసమంటే ఆ దీవి మనుషులకు చెప్పలేనంత ఇష్టం. ఒకప్పుడు ఆ దీవిలో అక్కడక్కడ ఎర్రతోదేళ్ళు ఉండేవి. కాని వాటి మాంసంమీద వున్న ఇష్టంతో వాళ్ళంతా ఎర్రతోదేళ్ళను వేటాడి, వేటాడి చివరకు ఆ దీవిలో ఒక్క ఎర్రతోదేలు కూడా లేకుండా చేశారు. ఇప్పుడు సాబూజా దీవిలో ఎర్రతోదేళ్ళ సంతతి పూర్తిగా అంతరించిపోయింది.

వాళ్ళు ఎర్రతోదేలు మాంసం తిని ఎన్నో యేళ్ళు అయ్యింది. అందుకే ఇప్పుడు వాళ్ళకు అంత ఉత్సాహం-వెర్రి ఉద్రేకం.

దొర వాళ్ళందరినీ మంచెల్లాగా ఉన్న ఇళ్ళ దగ్గరకు తీసుకెళ్ళాడు.

ఎర్రతోదేళ్ళన్నింటినీ వాళ్ళు అక్కడినించి ఈడ్చుకుపోయారు. పిల్లలు కేరింతలు కొడుతూ వాటి వెనుకే వెళ్ళిపోయారు.

ఆ దీవి మనుషుల సంతోషాన్ని చూస్తుంటే భారత్‌కి క్రితం రాత్రి నికోలాయ్ దీవుల్లో గడపకలసి రావటం ఆ ఎర్రతోదేళ్ళు దాడిచేసి అన్నీ చావటంకూడా ఒక రకంగా తమ మంచికే జరిగిందేమో అనిపించింది. ఎర్ర

తోడేలు మాంసం సాబూజా దీవి మనుషులకు ఇష్టం అని ప్రొఫెసర్ అనంత్ చెప్పినా వాళ్ళు మరీ అంత ఎక్కువగా సంతోషపడిపోతారని అనుకోలేదు.

విశాలంగా కొమ్మలుపరుచుకున్న చెట్ల వెనగ్గా వున్న మంచెల్లాంటి ఇంట్లోకి వాళ్ళందరినీ తీసుకెళ్ళాడు దొర. అక్కడ ఏవో చెట్లకర్రలను చీల్చి అడవితీగలతో బిగించి కట్టిన పొడుగాటి ఆసనాలు ఉన్నాయి. వాటిమీద అంతా వరుసగా కూర్చున్నారు. ఎదురుగా ఉన్న ఓ చిన్న ఆసనంమీద దొర కూర్చున్నాడు.

దొర అడిగిన తర్వాత ప్రొఫెసర్ అనంత్ తామంతా సాబూజా దీవికి యెందుకు వచ్చారో అతనికి తెలియజేశాడు.

అంతా విని "టకారా దీవి ఇక్కడికి దగ్గరలోనే ఉండివుంటుందని నా ఉద్దేశం....మా పూర్వీకుల ప్రస్తావనలో కొన్ని సార్లు టకారా దీవి దొర్లింది. ఐతే మేమెప్పుడూ ఆ దీవికి వెళ్ళలేదు. ఎన్నో యేళ్ళక్రితం ఆ దీవి మనిషి ఎవడో ప్రాణాలతోనే సముద్రంలోపడి మా దీవికి కొట్టుకు వచ్చాడుట. అప్పుడు వాడు చెప్పాడుట తను టకారా దీవినించి కొట్టుకు వచ్చినట్టుగా. ఆ తర్వాత వాడ్ని మా దీవి మనుషులు ఎందువల్లనో ఈటెలతో పొడిచి చంపారు. అప్పుడే మా వాళ్ళకు టకారా దీవి గురించి మొదటిసారిగా తెలిసింది. కాని ఒకటి మాత్రం నిజం. టకారాదీవి ఇక్కడికి సమీపంలోనే వుండొచ్చు" అన్నాడు దొర.

ఆ మాటలతో భారత్ తృప్తిపడ్డాడు.

టకారా దీవి దగ్గరలో ఉందని అంటున్నాడు కాబట్టి హెలికాప్టర్ మీద తిరుగుతూ దాన్ని గుర్తించటం అంత

కష్టంకాదు. అసలు టకారా దీవి ఆ వైపునే లేనప్పుడే దాన్ని వెతికటం కష్టసాధ్యమవుతుంది.

కొంచెం సేపు కూర్చుని దొర బయటకు వెళ్ళిపోయాడు.

"నాకు ఆశ్చర్యంగా వుంది. ఈ సాబూజా దీవి మనుషులు మనందరితో ఇంత సన్నిహితంగా ఉండటం చూస్తుంటే వీళ్ళకూడా మూఢనమ్మకాలు, నాగరికులను ప్రాయశ్చిత్తం పేరుతో తలలు నరకటం లాంటివి ఏవీ ఉండవా?" అనడిగింది స్టెల్లా.

ప్రొఫెసర్ అనంత్ అందుకు నవ్వి "ఎప్పుడైనా నాగరికులు ఈ దీవికి వస్తూ ఉండటమే వీళ్ళంత సన్నిహితంగా ఉండటానికి కారణం. అయితే వీళ్ళకి మూఢనమ్మకాలు, వింత ఆచారాలు ఉన్నాయి కాని అవన్నీ వాళ్ళవరకే పరిమితం. ఆ నమ్మకాలతో నాగరికుల ప్రాణాలు తియ్యటమనే ఆలోచనే లేదు. అసలు నరబలులులాంటివి ఈ దీవిలోనూ, ముంకాసా దీవిలో కూడా లేవు. ముంకాసా దీవి ఈ దీవికి దగ్గర్లోనే వుంది" అన్నాడు.

వాళ్ళలా మాట్లాడుకుంటున్నప్పుడు వాళ్ళకు వెదురు గొట్టాలతో బాగా కాచిన అడవి జింకల పాలు ఇవ్వబడినాయి. వాటిలో యేవో సుగంధద్రవ్యాల లాంటివి కలిపారేమో .. ఘుమఘుమల సువాసనలు వెదజల్లుతున్నాయి.

మిగిలినవాళ్ళు వాటిని తాగడానికి సంశయిస్తున్నప్పుడు "తాగండి....ఇవి అడవి జింకలపాలు....మనం ఇక్కడకు వస్తున్నప్పుడు కొన్ని ఇళ్ళ బయట కట్టేసి వున్న జంతువులను మీరు చూసే ఉంటారు. అవే అడవి జింకలు.

పాలకోసం వీళ్ళు వాటిని పెంచుతారు. అడవి జింకల పాలు రుచిగా ఉంటాయి. తాగిచూడండి. మీకే తెలుస్తుంది. నేను చాలాసార్లు తాగాను" అన్నాడు ప్రొఫెసర్ అనంత్....

ముందు అతను తాగటం మొదలు పెట్టిన తర్వాత మిగిలినవాళ్ళు ఆ పాలను తాగారు. నిజంగానే అవి రుచిగా ఉన్నాయి. జాన్సన్ మరో పెదురుగొట్టంతో అడవి జింక పాలను తెప్పించుకుని తాగాడు.

• • •

అప్పటికే సూర్యోదయమయ్యింది.

సూర్యుడి కిరణాలు దీవినంతటినీ ఆక్రమించుకున్నాయి.

తర్వాత చెయ్యవలసినదాన్ని గురించి భారత్— అనంత్ మాట్లాడుకుంటున్నారు.

"మనం ఇప్పుడే బయల్దేరుదాం" అన్నాడు భారత్. అతనికి ఆత్రంగా వుంది టకారా దీవి అక్కడికి దగ్గరలోనే వుందని తెలియగానే....

"నాకేమీ అభ్యంతరంలేదు. మనిద్దరమే వెళ్ళి ముందు ఆ దీవిని లొకేట్ చేసి రావచ్చు. వీళ్ళంతా ఇక్కడే ఉంటారు. టకారా దీవిని మనం కనుగొన్న తర్వాత మన ప్లాను ప్రకారం అందరం కలిసి వెళదాం" అన్నాడు అనంత్.

అందుకు భారత్ అంగీకరించాడు.

అవును. అంతా అప్పుడే బయల్దేరవలసిన అవసరం లేదు. టకారా దీవి కనిపించిన తర్వాత ఓ ప్లాను సిద్ధం చేసుకుని అంతా కలిసి వెళ్ళొచ్చు.

దొర లోపలకు వచ్చాడు.

తను— భారత్ టకారా దీవి అన్వేషణకై హెలి

కాప్టర్‌లో అప్పుడే బయల్దేరబోతున్నట్టుగా దొరతో చెప్పాడు భారత్ ....

అందుకు దొర ఒప్పుకోలేదు.

"ఈ రోజంతా మీరు ఎక్కడికీ కదలటానికి వీల్లేదు. రాత్రంతా సరిగా నిద్రలేకుండా ఎర్ర లోదేళ్ళతో పోరాటం జరిపి అలసిపోయి వున్నారు. అందువల్ల మీరు భోజనాలుచేసి విశ్రాంతి తీసుకోండి. సాయంత్రం మీ వినోదంకోసం 'దునీనాకా' యేర్పాటు చేయిస్తున్నాను. దయతో ఈ దొర కోరికను మన్నించండి." అన్నాడు ప్రాధేయపూర్వకంగా అరవైయేళ్ళ దొర.

దొర అన్న మాటల గురించి అనంత్—భారత్‌తో చెప్పేసరికి అతడి మొహం అదోలా అయిపోయింది. విసుగనిపించింది. యెంత త్వరగా తన పనిని ముగించుకుందామా అనే తొందరలో వున్నాడు భారత్. కాని అనుకోని విధంగా ఆలస్యం జరుగుతూనే వుంది.

"తప్పదా?" అన్నాడు అనంత్‌తో.

"తప్పదు. దొర అంత ప్రాధేయపూర్వకంగా చెప్పిన తర్వాత అతని మాట వినకపోతే బాధపడతాడు. ప్రస్తుతం దొర మనసు కష్టపెట్టటం అంత మంచిదికాదు" అన్నాడు అనంత్—దొర బాగా విశ్రాంతి తీసుకోమని ఎందుకన్నాడో అర్థం చేసుకుంటూ—

కాని—ఆ విషయం గురించి భారత్‌తో ప్రొఫెసర్ అనంత్ అప్పుడే చెప్పదల్చుకోలేదు. చీకటి పడిన తర్వాతనే చెప్పాలని అనుకున్నాడు.

"దొర 'దునీనాకా' అంటున్నాడు. అంటే ఏమిటి?" అని అడిగింది స్టెల్లా—అనంత్‌ని.

"దునీనాకా అంటే ఓ జంతువుతో ఇద్దరు మనుషులు

పోరాడటం. చివరకు వాళ్ళిద్దరు ఆ జంతువును చంపు తారు. ఆ జంతువు మేకలా వుంటుంది. ఐతే పూర్తిగా తెల్లటి వర్ణంతో వుంటుంది. అది మేకవంటి సాధు జంతువు కాదు. మనుషులు ఒంటరిగా దొరికినప్పుడు కొమ్ములతో పొడిచి చంపుతుంది."

తను దునినాకా గురించి వివరించి వాళ్ళకు చెబుతు న్నట్టుగా దొరకు చెప్పాడు అనంత్.

దొర నవ్వి "వీళ్ళు యింతకు ముందు యెప్పుడూ ఈ దీవికి రాలేదు కదా! అన్నీ చిత్రంగా వుంటాయి. ఒక సారి వీళ్ళందరికీ మా సాబూజా దీవిని చూపించి రాకూడదూ" అన్నాడు.

అనంత్ ఆ విషయం చెప్పగానే అంతా అందుకు బాగా ఆసక్తిని చూపుతూ లేచి నిలబడ్డారు. ముఖ్యంగా జాన్సన్—రంజిత్ ఎక్కువ ఆసక్తి చూపించారు.

ఎందుకంటే కేవలం పువ్వులు—ఆకులతో వున్న దండలతో శరీరాలను కప్పుకున్న సాబూజా దీవి ఆడ వాళ్ళ వంపుసొంపులను తనివితీరా చూడవచ్చు—అని.

అంతా మంచెలాంటి యింట్లోనించి బయటకు వచ్చారు.

ఇళ్ళ మధ్య వున్న దారి అంత విశాలంగా లేదు. కొంచెం ఇరుగ్గానే వుంది. పైగా వంకర టింకరగా వుంది. అక్కడి యిళ్ళన్నీ ఒకే రకంగా వున్నాయి. ఇళ్ళ బయట నిల్చుని ముందునించి వెళుతున్న వాళ్ళందరినీ స్త్రీలు, కొంచెం వయసులో వున్నవాళ్ళు ముసిముసిగా నవ్వుతూ చూశారు.

జాన్సన్ ధైర్యంచేసి తనని చూసి నవ్వుతున్న ఓ యువతిని చూసి కన్ను గీటాడు.

పిల్లలు చెట్లకింద యేవో ఆటలు ఆడుకుంటున్నారు—దిశ మొలలతో....

వాళ్ళని చూసి లీల—స్టెల్లా నవ్వుకున్నారు.

మొదట్లో లీల రావటం తనకు యిష్టం లేకపోయినా తర్వాత స్టెల్లాకు ఆమె అంటే యిష్టం యేర్పడింది. లీల కూడా స్టెల్లాతో బాగానే కలిసిపోయింది. స్టెల్లా సాహసాన్ని చూసిన తర్వాత ఆమె తనకంటే అన్నింటిలోనూ ఎక్కువే అనే భావం లీలకు కలిగింది. అందువల్లనే స్టెల్లా అంటే గౌరవం కూడా యేర్పడింది.

వాళ్ళతోపాటుగా ఈ సెలు తీసుకుని యిద్దరు సాబూజా దీవి మనుషులు కూడా రక్షణగా వచ్చారు.

నడుస్తూ ప్రొఫెసర్ అనంత్ ఆ యిద్దరితో కబుర్లలోకి దిగిపోయాడు. ఓ నాగరికుడు తమ భాషలో తమతో మాట్లాడటం వాళ్ళకు ఎంతో సంతోషాన్ని కలిగించింది. అంతే కాకుండా తను వెలిగించుకున్నప్పుడల్లా వాళ్ళిద్దరికీ సిగరెట్లను ఆఫర్ చేశాడు అనంత్.

ఆ దీవిలో చెట్లు మరీ అంత పొడుగూ పొట్టీ కాకుండా వున్నాయి. చెట్ల మధ్యగా అక్కడక్కడ బాగా అల్లుకున్న పొదలు, తీగెలు కనిపించాయి.

టకారా దీవిలో వున్నంత దట్టంగా ఈ దీవిలో చెట్లు లేవని అనుకుంది స్టెల్లా.

స్టెల్లా—లీలతో మాట్లాడుతూ వెళ్ళటంతో భారత్ ఆలోచనలకు అంతరాయం లేకుండాపోయింది.

అతని ఆలోచనలన్నీ ఆ మణి గురించే—

ఆ మణి దివ్యకాంతులే అతడి కళ్ళముందు కదులుతున్నాయి. ఇప్పటివరకు ఆ మణి గురించి స్టెల్లాకు రంజిత్ కు తనకీ మాత్రమే తెలుసు.

అంతే—

టకారా దీవికి వెళ్ళిన తర్వాతైనా ఆమణి గురించి మిగిలినవాళ్ళకు చెప్పక తప్పదు.

అనంత్ యేమని అనుకుంటాడో!

ముందుగానే చెప్పనందుకు అతను నొచ్చుకోడు కదా!

తనని చీట్ చేసి తీసుకొచ్చాడని అనుకుంటాదేమో! ఏమో! ఎలాగైనా అతడిని కన్విన్స్ చెయ్యాలి.

అప్పటికి వాళ్ళంతా మంచెల్లాంటి యిళ్ళను దాటి దీవిలో చాలా దూరం వచ్చేశారు.

"ఇక్కడ ఆగిపోదాం...." అన్నాడు అనంత్ వాళ్ళతో.

సరేనన్నారు వాళ్ళు.

వాళ్ళు నిలుచున్న చోట బాగా విశాలంగా కొమ్మలు పరుచుకున్న ఓ చెట్టు వుంది. దాన్నిండా పసుపుపచ్చని పండ్లు వేలాడుతున్నాయి. లీల కోరికమీద వాళ్ళిద్దరు గబగబా చెట్టు యెక్కి పండ్లు కోసి కిందపడేశారు.

అంతా ఆ పండ్లను తిన్నారు.

అవి నిమ్మపండ్లలా పులుపుగా వున్నాయి. రెండు పండ్లను మించి యెవ్వరూ యెక్కువ తినలేకపోయారు.

ఎండ తీక్షణరూపం దాల్చింది.

గాలి వెచ్చగా వీస్తోంది.

చెట్టుకింద బాగా ఎత్తుగా గడ్డి పెరిగివుంది. గడ్డిలో పడివున్న పండును తీసుకోటానికి ముందుకు వంగి గడ్డిలో చేతిని వుంచిన జాన్సన్ కీచుమంటూ అరిచాడు.

అంతా ఉలిక్కిపడ్డారు.

బాధతో గబుక్కున చేతిని వెనక్కి లాక్కుంటూ

లేచి నిలబడ్డాడు. వాళ్ళిద్దరు చెట్టు దిగి కిందికి వచ్చారు.

అంతా జాన్సన్ చుట్టూ చేరారు.

జాన్సన్ బాధతో చిందులు వేస్తున్నాడు.

"ఏం జరిగింది?" అనంత్ అడిగాడు.

"ఏదో కుట్టింది"

అప్పుడంతా కిందకు చూశారు.

గుండ్రంగా బిళ్ళలా కుంకుమ రంగులో వున్న పురుగు ఒకటి గడ్డిమీద ఎగురుకుంటూ గబగబా వెళ్ళి పోతూ కనిపించింది.

ఆ పురుగును చూస్తూనే వాళ్ళిద్దరు నవ్వి గబ గబా అక్కడికి దగ్గర్లోనే వున్న యేవో తీగెల ఆకులు తెంచుకుని వచ్చి పసరు ఆ పురుగు కుట్టిన ప్రదేశంలో పిండారు. అప్పటికే ఆ ప్రదేశమంతా బాగా వుబ్బిపోయింది.

పసరు పిండిన తర్వాత వాళ్ళిద్దరు ఆ పురుగు గురించి వాళ్ళకు చెప్పారు. ఆ బిళ్ళపురుగు అడుగున తేలుకొండి లాంటిది వుంటుందిట. దానితో అది కుడుతుందని చెప్పారు. అయితే ఆ పురుగులో తేలుకొండిలో వున్నట్టుగా విషం వుండదుట.

కొంచెంసేపటి తర్వాత అంతా వెనక్కుమళ్ళారు.

• • •

మధ్యాహ్నం పన్నెండు గంటలయ్యేసరికి అందరికీ ఎర్రతోదేళ్ళ మాంసంతోపాటు యేవో వుడికించిన కాయల గుజ్జును కూడా వడ్డించారు.

ఆ సమయానికి వాళ్ళందరికీ ఆకలి దహించి వేస్తోంది. భోజనాన్ని వడ్డించేసరికి అంతా ఎగబడ్డారు.

సాబూజా దీవి మనుషులంతా ఎర్రతోదేళ్ళ మాంసమంటే ఎందుకంత సంబరపడిపోయారో వాళ్ళకు అప్పుడు

అర్థమయ్యింది.

నిజంగా నే అద్భుతంగా వుంది ఆ మాంసం. సెల్లాకు భారత్ కీ టకారా దీవిలో తిన్న నల్లమృగాల మాంసం కంటే కూడా ఎంతో రుచిగా వున్నట్టుంది.

ఆ వుడికించిన కాయలగుజ్జు కూడా వింత రుచితో అందరికీ ఎంతగానో నచ్చింది.

జాన్సన్ సంతోషానికి అవధుల్లేకుండా పోయాయి. ఆవురావురుమంటూ మొదటిసారి వడ్డించిన మాంసాన్నంతా కొన్ని నిమిషాలకే లాగించేశాడు.

దొర దగ్గరే ఉండి అందరికీ వడ్డిస్తున్నాడు. జాన్సన్‌కు రెండోసారి వడ్డించారు ఎర్రతో లేలు మాంసాన్ని...

ప్రొఫెసర్ అనంత్ అన్నాడు "జాన్సన్.... బాగా తినగలిగిన వాళ్ళంటే దొరకు ఎంతో అభిమానం.... మనుషులకు తిండి పుష్టి బాగా వుండాలంటూ వుంటాడు దొర. ఇప్పుడు నిన్ను చూస్తుంటే దొరకు ముచ్చటగా ఉందిట—అంటున్నాడు."

జాన్సన్ దొరవైపు చూసి చిన్నగా నవ్వి తర్వాత తిండిలో మునిగిపోయాడు.

మగవాళ్ళంతా బాగానే తిన్నారుకాని, సెల్లా, లీల ఎంత రుచిగా వున్నా ఎక్కువ తినలేకపోయారు.

అనంత్ రాత్రి భోజనం గురించి దొరతో యేదో చెప్పాడు.

తర్వాత వారితో ఇలా చెప్పాడు-"రాత్రి భోజనంగా పాములను పట్టించి వండమని చెప్పాను దొరతో—పాముల వంటకం అదో రకమైన రుచితో ఉంటుంది. తప్పకుండా మీరంతా ఇష్టపడతారు."

మగవాళ్ళంతా సిగరెట్లు వెలిగించారు.

తిన్నాలమీద వాళ్లు విశ్రాంతి తీసుకోటానికి పడకలను ఏర్పాటు చేయించాడు దొర.

పడుకున్న వెంటనే అందరికీ నిద్రపట్టింది. కాని భారత్ ఒక్కడికే నిద్రపట్టలేదు.

ఆతిథ్యంకోసం, పాముల వంటకాలకోసం ఈ సాబూజా దీవికి రాలేదు. ఈ దీవిలో టకారా దీవి గురించి తెలుసుకుని ఇక్కడినించి దాన్ని అన్వేషించి తర్వాత ఓ ప్లాను ప్రకారం ఆ దీవిని చేరుకోవాలని వచ్చాడు. కాని అనుకోని విధంగా ఆలస్యం జరుగుతోంది.

ఆలస్యం జరుగుతున్నకొద్దీ యెందువల్లనో అతనిలో ఆందోళన పెరిగిపోతోంది.

ఏమో! యే నిమిషంలో ఏం జరుగుతుందో యెవరు చెప్పగలరు?

సాబూజా దీవి మనుషులంతా మంచివాళ్ళేనని ప్రొఫెసర్ అనంత్ చెప్పినా భారత్ కి అంతగా నమ్మకం కుదరలేదు.

ఎందుకంటే అతిథి మర్యాదల విషయంలో యెటువంటి లోపం రానివ్వమంటూనే తమని నరకయాతనకు గురిచేసి ప్రాయశ్చిత్తం పేరుతో ఇద్దరు స్త్రీలను నిర్దాక్షిణ్యంగా తలలు నరికివేసిన టకారా దీవి ఆటవికుల గురించి అతను ఇంకా మరచిపోలేదు.

ఈ అనాగరికుల ప్రవర్తన ఎప్పుడు ఎలా వుంటుందో వూహించటానికి వీల్లేదు.

అందుకే వీలైనంత త్వరగా తన లక్ష్యాన్ని నెరవేర్చుకోవాలనే యాంగ్జయిటీలో తను వున్నాడు.

తన ఆత్రుత-ఆదుర్దా మిగిలినవాళ్ళకు ఎలా వుంటుంది? అవును, వుండదు. అందుక్కారణం తమ టకారా దీవి

ప్రయాణంలోని అసలు రహస్యం వాళ్ళెవ్వరికీ తెలీదు.

అంతే—

ఆలోచనలతోనే నిద్రలోకి జారిపోయాడు భారత్.

వాళ్ళంతా తిరిగి నిద్ర లేచేసరికి సాయంత్రం ఐదు గంటలు కావస్తోంది. వాళ్ళు లేచేసరికి 'దునివాకా' ఏర్పాట్లు జరిగిపోయాయి.

వాళ్ళు నిద్రలేవటంకోసమే ఎదురుచూస్తున్న దొర అందర్నీ అక్కడినించి ఓ పక్కగా వున్న ప్రదేశానికి తీసుకువెళ్ళాడు.

అక్కడ దీవిలోకి మనుషులంతా గుమిగూడి వున్నారు. ఎదురుగా వాళ్ళ కులదేవత విగ్రహం ఒకటి ఎత్తుగా నిలుచుని వుంది. అంతా మనిషి ఆకారంలోనే వుంది కాని తల మాత్రం ఏదో జంతువు తలలా వుంది. దానికి రెండు కొమ్ములు కూడా వున్నాయి. మూతి పొడుగ్గా వుంది.

ఆ బొమ్మకేసి లీల ఆశ్చర్యంగా చూసింది.

పొడుగాటి ఆసనాలమీద దొర వాళ్ళని కూర్చో పెట్టాడు. వాళ్ళ ఎదురుగా ఖాళీ ప్రదేశం వున్నది. ఆ ప్రదేశంలో తీగలతో కట్టబడి ఉన్న తెల్లటి జంతువు నిలబడి అందరినీ బెదురుతూ చూస్తోంది. దానికి కొంచెం దూరంలో ఒంటినిండా నల్లని బూడిద పూసుకుని ఇద్దరు పొట్టి యువకులు నిలబడి వున్నారు.

దొర ఆజ్ఞ ఐన తర్వాత ఆ జంతువుకు కట్టిన తీగలను తెంచేశారు. వెంటనే అది ఎదురుగా వున్న ఆ యువకుల మీదికి దూకింది కోపంతో....వాళ్ళు ఒడుపుగా పక్కకు తప్పుకుంటూ దాని మెడను గట్టిగా పట్టుకున్నారు. అది తలను గట్టిగా విదిలించింది. ఆ విసురుకు వాళ్ళు చెరో

వైపుగా కొంచెం దూరంలో పడిపోయారు.

వాళ్ళు లేవకముందే అది ఓ పొట్టి మనిషిమీదకు రివ్వున దూసుకుపోయింది. అది సగం దూరం వెళ్ళేసరికే పొట్టిగా ఉన్న రెండో మనిషి ఎగిరి దానిమీదకు దూకి దాన్ని కిందపడేశాడు.

కిందపడుతూనే అది కొమ్ములతో భూమిని కుమ్మి పైకిలేచి వేగంగా ఆ ఇద్దరిమీదకు వచ్చేసింది.

స్టెల్లా—లీల మిగిలిన వాళ్ళంతా ఊపిరిబిగబట్టి ఎంతో ఆసక్తిగా చూస్తున్నారు ఆ పోరాటాన్ని.

ఉన్నట్టుండి వూహించని విధంగా ఆ జంతువు వాళ్ళ మీదికి వెళ్ళకుండా వెనక్కి తిరిగి రివ్వున స్టెల్లామీదకు బాణంలా దూసుకుని వచ్చేసింది.

అదిరిపోయింది స్టెల్లా—ఆమెతో పాటు మిగిలినవాళ్ళు కూడా కంగారుపడిపోయారు.

తలను వంచి పొడవటానికే అన్నట్టుగా అది వచ్చేసింది. స్టెల్లాకు కనీసం తప్పుకునే అవకాశం కూడా లేకుండా పోయింది. దాన్ని కాల్చటానిక్కూడా రివాల్వర్ బయటకు తీసే వ్యవధి కూడా లేదు.

బాగా దగ్గరికి వచ్చేసింది జంతువు.

అంతా గోలగా అరుస్తున్నారు.

దొర కంగారుగా అరిచాడు.

ఆ యిద్దరు పొట్టియువకులూ దాని వెనుకే పరుగెత్తుకు వచ్చారు.

స్టెల్లా విసురుగా లేచినిల్చుబోయింది. కాని అప్పటికే అది వీలయినంత దగ్గరగా వచ్చింది కొమ్ములు విసురుతూ—

టెన్షన్—భారత్ బిగ్గరగా అరిచాడు.

ఐతే—ఎవ్వరూ ఎదురుచూడని విధంగా జాన్సన్ మెరుపులా లేచినిల్చుంటూనే యెగిరి ఆ జంతువుమీద పడుతూ దాన్ని పక్కకు నెట్టుకుపోయాడు.

అతనలా చెయ్యకుండా వున్నట్లయితే దాని కొమ్ములు సెల్లా గుండెలను చీల్చివుండేవి.

కింద పడిపోయి కూడా జాన్సన్ దాని గొంతును రెండు చేతులతో ఏ మాత్రం కదలటానికి వీల్లేకుండా బిగించి పట్టుకున్నాడు.

అంతా ఆనందంతో చప్పట్లు చరిచారు. సంతోషంతో కేరింతలు కొడుతూ గోలగా అరిచారు.

జాన్సన్ సాహసం—సమయానికి తగిన చురుకుదనం అందరినీ ఆకర్షించాయి.

ఆ జంతువు జాన్సన్ కబందహస్తాలనించి బయటపడలేక కాళ్ళతో కొట్టుకుంటోంది.

ఒంటినిండా బూడిద పులుముకున్న ఆ పొట్టి యువకులిద్దరూ జంతువు గొంతును గట్టిగా నొక్కుతున్న జాన్సన్‌ను వింతగా చూశారు.

రెండు నిముషాల్లోనే ఆ జంతువు గిలగిలా తన్నుకుని ప్రాణాలు వదిలింది. జాన్సన్ అప్పుడు లేచి నిలబడ్డాడు.

సెల్లాతోపాటు భారత్ కూడా జాన్సన్‌కు కృతజ్ఞతలు తెలియజేసుకున్నాడు—ఆమెను రక్షించినందుకు.

"ఇలా జరిగినందుకు నాకు విచారంగా వున్నా సెల్లా ప్రాణాలను కాపాడే అవకాశం వచ్చినందుకు సంతోషపడుతున్నాను" అన్నాడు జాన్సన్.

ఆ రాత్రి విస్కీని సేవించటం పూర్తయిన తర్వాత అందరికీ భోజనాలు వడ్డించారు. దొర కూడా వాళ్ళందరితో కూర్చుని తాగాడు. సెల్లా విస్కీ తీసుకుంది. లీల

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈనెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అసన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేదనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

సుకో లేదు. అలవాటు లేదన్నది.

పాము మాంసంతో పాటుగా వాళ్ళకు చేపలు, తర యేవో సముద్ర జంతువుల కూరను వడ్డించేసరికి నంత్ తప్పించి మిగిలినవాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

ఆ దీవివాళ్ళు పడవలమీద సముద్రంలోకి వెళ్ళి చేప ను ఇతర సముద్రజంతువులను అప్పుడప్పుడు పట్టి తీసుకు కూ వుంటారని అనంత్ వాళ్ళకు చెప్పాడు.

కొంచెంసేపటి కబుర్ల తర్వాత అందరికీ తిరిగి పడకలు కేర్పాటు చేయబడినాయి.

జంటలుగా వున్నవాళ్ళకు ప్రత్యేకంగా వున్న ఇళ్లను కేటాయించారు.

షైలా—భారత్ ఓ యింట్లో పడుకున్నారు. కర్ర దల ఆసనాలమీద చాపల్లాంటివి పరిచారు.

• • •

ఉదయం ఆరుగంటలకే ప్రొఫెసర్ అనంత్—భారత్ హెలికాప్టర్ మీద టకారాదీవి అన్వేషణకై నాయకుడు సూచించిన దిశగా ప్రయాణమై వెళ్ళిపోయారు.

ఆ సమయకు ఇంకా సూర్యోదయంకూడా కాలేదు. కొంచెం మేఘాలు క్రమ్మినట్టుగా ఉండటంతో వాతా వరణం ఇంకా చీకటిగానే ఉన్నట్టుంది.

అనంత్ అన్నాడు—"జాగ్రత్తగా చూడండి మిష్టర్ భారత్ టకారా దీవిని మీరే గుర్తించాలి. ఎందుకంటే దీవిని నే నెప్పుడూ చూడలేదు కదా!"

తల వూపాడు భారత్.

దూరంగా సముద్ర తీరం అంతమవుతూ పచ్చని చెట్లు నపడుతున్నాయి. వాటికేసి జాగ్రత్తగా చూశాడు భారత్.

"కేర్‌ఫుల్‌గా అబ్జర్వ్ చెయ్యండి" అన్నాడు అనంత్ హెలికాప్టర్ ఆ పచ్చని చెట్లకు దగ్గరవుతుండగా—

పచ్చని చెట్లమీదకు వచ్చేసింది హెలికాప్టర్.

వేగాన్ని కొంచెం తగ్గించాడు పైలట్.

ఏదో దీవి. భారత్ జాగ్రత్తగా చూస్తున్నాడు.

ఆ చెట్లు యేవో కొత్తగా ఉన్నాయి. ఇంతకుముందు తను టకారా దీవిలో చూసిన చెట్లు కావు.

ఇంకొంచెం ముందుకు వెళ్ళిన తర్వాత గూడెంలాంటిది ఇళ్ళముందు ఇటూ ఇటూ తిరుగుతున్న మనుషులు కనిపించారు. ఆ గూడెం మధ్యలో ఏదో చిన్న కొండలాంటిది కనపడింది.

దాన్ని చూస్తూనే అది టకారా దీవి కాదని గ్రహించాడు భారత్—అదే మాటను అనంత్‌తో చెప్పాడు.

అక్కడినించి ఇంకా ముందుకు వెళ్ళింది హెలికాప్టర్.

ఎవ్వరూ మాట్లాడుకోలేదు. ఇంజన్ రొద మాత్రమే వినపడుతోంది. ప్రొపెల్లర్లు తిరుగుతున్న చప్పుడు.

గంటకు పైగా తిరిగినా ఎక్కడా టకారా దీవి కనిపించలేదు. టకారా దీవే కాదు—మరే దీవీ కనిపించలేదు.

భారత్‌కు అంతులేని నిరుత్సాహమనిపించింది.

దొర టకారా దీవి సాబూజా దీవికి దగ్గరగానే వుంటుందనే చెప్పాడు. కాని తాము చాలాదూరం వచ్చేశారు. ఐనా టకారా దీవి కనిపించలేదు.

దొర సరయిన దిశను సూచించి ఉండడు.

తను అనుమానాన్ని వ్యక్తం చేశాడు భారత్.

అనంత్ పైలట్‌తో మాట్లాడాడు. (సశేషం)

